'హాసం'
హాస్య-సంగీత పత్రిక

Also available on net - www.haasam.com

# ఇవీ సంగతులు

36

# హాస్యం - సంగీతం





**ముఖచిత్రం**

నిర్మాణంలో పున్న శివమణి 98480 22338 చిత్రంలో అక్కినేని నాగార్జున



**'సెంటర్ స్ప్రెడ్'లో**
**'గంగోత్రి', 'పెళ్లిసందడి'**
సినిమా పాటల పుస్తకాలు
కలర్‌లో

నేను మీరు ప్రచురిస్తున్న 'హాసం' పత్రికను చదువుతున్నాను. మాలాంటి పాటలు ఆసక్తి ఉన్నవారికి 'హాసం' ఒక వరంగా భావిస్తున్నాను. ఫిబ్రవరి 16-28 సంచికలో "అమరగాయకుడు ఘంటసాలగారి 29వ వర్ధంతి సందర్భంగా 'భారత ప్రభుత్వము ఘంటసాలగారి గుర్తుగా స్టాంపు రిలీజ్ చేసిన వివరాలతో మరియు తెలుగు చిత్రసీమలో అతిరథులైన ప్రముఖ సినీ నేపథ్య గాయనీ గాయకులతో మీరు ఇన్నర్ కవరు పేజిపై ముద్రించిన గ్రూప్ ఫోటో మమ్మల్ని ఎంతగానో ఆకట్టుకుంది. నభూతో నభవిష్యతి అనడంలో సందేహంలేదు.

**-బి.రవికిషోర్, హైదరాబాద్**

ఫిబ్రవరి 'హాసం' సంచికను తొలిసారి లైబ్రరీలో చూసి ముగుగ్ధురాలినయ్యాను. హాట్సాఫ్ టు 'హాసం'- ప్రతి హాసాలు, పరిహాసాలు, చిరుచిరు నవ్వులు, రువ్వేపువ్వులు తరగని సిరులు - కమ్మని పరిమళం విరజిల్లే విరులు!

**-అచ్యుతుని రాజశ్రీ**

భావితరాలకు అపూరూపమైన ఎన్ సైక్లోపిడియాగా 'హాసం' పత్రికలు ఉపయోగపడతాయి. "సాంగులే బంగారు రాజా" చాలా చాలా బాగున్నది. టి.వి.రాజుగారి గూర్చి వ్యాసం చమత్కారమైన పదాలతో ఆద్యంతం ఆకట్టుకునే విధంగా ఉంది.

**-డా॥ సయ్యద్ రహమతుల్లా, పర్లాకిమిడి (ఒరిస్సా).**

మేము కర్ణాటకలో ఉంటున్న ప్రవాసాంధ్రులము. మా ఊరిలో చాలా తక్కువగా దొరికే తెలుగు వీక్లీస్‌నీ కొంటుంటాను. మీ "హాసం" పత్రిక ఈ మధ్యనే మా ఊరి ఏజెంట్ ద్వారా పరిచయమయింది. మొదటి సంచికతోనే అమితంగా ఆకర్షించిన 'హాసం' వెనుకటి సంచికలను కూడా తెప్పించేలా చేస్తోంది. మాతృభూమికి దూరంగా ఉంటున్న మాకు 'హాసం' ఎంతో ఉల్లాసాన్ని, తృప్తినీ కలిగిస్తోంది. ప్రతి పేజిని అత్యద్భుతంగా తీర్చిదిద్దుతున్న మీకు మా ప్రత్యేక అభినందనలు మరియు కృతజ్ఞతలు.

**-డి.కె.సురేష్‌బాబు,దొడ్డ బల్లాపూర్,కర్ణాటక.**

"హాసం" హాస్య సంగీత పత్రిక నన్ను అమితంగా ఆకట్టుకుంది. మార్కెట్‌లోకి వచ్చినరోజే తీసుకోవాలని నాకు ఆతృతగా ఉంటోంది కానీ మా వూరికి ప్రతివారం ఆలస్యంగా వస్తోంది. నేనేమిచేయాలి?

**-కావేటి సంజీవ, కిషన్‌గూడ.**

మార్చి 1-15 నాటి 'హాసం' హాస్య సంగీత పత్రిక ముఖచిత్రం చాలచాల బాగుండి చూడగానే నా మనసు దోచుకుంది. ముఖపత్ర సుందరి కుమారి లయ చిరుదర హాసం- 'హాసం' అట్టపై అదిరింది. బంగారు నంది అవార్డు గ్రహీత కుమారి లయ ముందు ముందు మరిన్ని నందులు అందుకోవాలని మా ఆశ, ఆకాంక్ష.



సరస్వతీ మానస పుత్రిక 'హాసం' హాస్య సంగీత పత్రికకు వందనమందారాలు.

**-తాళాభక్తుల శేషుబాబు, నాగాయలంక.**

నేను బి.ఎస్.సి. మొదటి సంవత్సరం చదువుతున్నాను. మీ 'హాసం' పత్రికకు రెగ్యులర్ రీడర్‌ను. రావికొండలరావు గారి (సి)నీతిచంద్రిక అంటే నాకు చాలా ఇష్టం. ఆ సీరియల్ అయిపోయినందుకు చాలా బాధగా ఉంది. సెంటర్‌స్ప్రెడ్‌లో కొత్త సినిమా పాటలను అందిస్తున్నందుకు కృతజ్ఞతలు. మార్కెట్‌లో ఏ పత్రికా కొని చదవని నేను మీ 'హాసం' పత్రికకు బానిసైపోయాను. బాపూ విశ్వరూపం మమ్మల్ని ఎంతగానో ఆకట్టుకుంది.

**-వర్మ, భీమవరం.**

'సత్కార్యాలకు ప్రచారం ఉండాలి' అనే

హాసం...సినీ సంగీత నందనం
హాసం...సుందర సరస సమీరం
హాసం...సుమధుర స్వర సాగరం
హాసం...సరిగమల దివ్యక్షేత్రం
హాసం...నేటి-అలనాటి గీతాల తోరణం
హాసం...స్వరాన్వేషకులకు శ్రీకారం -శోధనా సాధనం
హాసం...పత్రికా ప్రపంచాన విరిసిన మధుర మందహాసం
హాసం...సరస సంగీత ప్రియుల హృదయ విలాసం
హాసం...నాటి తరం మధుర స్మృతుల మధువనం
హాసం...నేటి తరం నవతేజానికి ఒక వేదం
హాసం...సంగీత పత్రికారంగాన ఉత్తేజతరంగం
హాసం...అమర సంగీత కర్తల ఆరాధనాలయం
హాసం...ఉత్తమాభిరుచులు గల అత్యుత్తమ గ్రంథం
హాసం...భావితరం నేర్చుకోదగిన జ్ఞానకోశం
హాసం...ఎంత చదివినా తరగని తనివితీరని స్వరామృతం
హాసం...ప్రతిభావంతుల ప్రగతికోసం చేసే మహా యజ్ఞం
హాసం...నవయువ సంగీత కారుల మార్గదర్శినీ యంత్రం
హాసం...మహా పురుషుల జీవిత విశేషాల మాలా తోరణం
హాసం...అనతికాలంతోనే అత్యంత ప్రాచుర్యం పొందిన అందాల కావ్యం
హాసం...సరికొత్త స్వరాలకు నవతరాలకు స్వాగత ద్వారం
హాసం...సినీ వినీలాకాశంలో నవజీవన వినోద వికాశం
హాసం...అఖిలాంధ్ర పాఠకుల హృదయాన ఆనంద పారవశ్యం
హాసం...తెలుగు చిత్రసీమ గర్వించదగిన పత్రికా రత్నం
హాసం...సినీ సంగీత పెద్ద బాల శిక్షణాలయం
హాసం...ప్రతి తెలుగు గుండెలో నిండిఉండాలి నిరంతరం
హాసం...సున్నిత సాహిత్య సంగీత విమర్శల 'రాజ'మందిరం
హాసం...సృష్టికర్తలకు...వందనం...అభినందనచందనం

**-జి.ఆనందు, సినీసంగీత దర్శకుడు, గాయకుడు, చెన్నై**

వాక్యం అక్షరసత్యం. ప్రకాశం జిల్లా'అద్దంకి' వాసులు జన్మభూమి స్ఫూర్తితో ఆడిటోరియమ్ మరియు సంగీత కళాశాల నెలకొల్పాలనే ఆలోచన రావటం దాన్ని సాకారం చేయడం ముదావహం మరియు అభినందనీయం. పాఠకులకు 'హాసం' సంపాదకీయాలు స్ఫూర్తిని, ప్రేరణ కలిగిస్తున్నాయి.

**-చింతలపాటి విశ్వనాథ్, లక్ష్మీ శైలజ, విజయవాడ.**

16-28 ఫిబ్రవరి 'హాసం' పత్రికలో లలిత సంగీతంలో "ఏనాటికీ రాడు" శ్రీమతి రావు బాలసరస్వతీ దేవి గానం చేసిన గీతం ఇచ్చినందుకు చాలా సంతోషం. అలనాటి ఆణిముత్యాల గురించి నేటి తరానికి అనువైన శైలిలో తెలిపే నవ్వుటద్దాలులో సంఖ్యాబలంతో సాహిత్యశైలిని చూపిన ఆచార్య తిరుమల గారి సాహిత్యం చదివాను. చాలా బాగుంది. ఘంటసాల స్మారక తపాలాబిళ్ల సందర్భంగా మీరిచ్చిన ప్రముఖ గాయనీ గాయకుల ఫోటో చూసి చాలా ఆనందం కలిగింది. మొత్తంమీద ఓ మంచి పత్రిక చదువుతున్నామనే సంతృప్తిని 'హాసం' కలిగిస్తుంది.

**-ముత్యాల భాస్కరరావు, రామరాజులంక**

సంపుటి: 2 సంచిక: 12

16-31 మార్చి 2003

పేజీలు: 68+8

వెల : రూ. 10-00

సంవత్సర చందా : రూ.200

మేనేజింగ్ ఎడిటర్
ఎమ్బీయస్ ప్రసాద్

ఎడిటర్
రాజా

రిఫరెన్స్ కర్టెసీ
డా॥ కె.వి.రావు
జె.మధుసూదన శర్మ

HAASAM HAASYA SANGEETHA PATHRIKA
Flat No. 502, Sri Balaji Nilayam
13-1-212, Motinagar,
Hyderabad-500 018
Ph: 2383 1388 / 5557 0215
email: haasammag@hotmail.com

Printed and Published by:
**K.I.Varaprasad Reddy**
on behalf of Hummus Infoway (P) Ltd.,
502, Sri Balaji Nilayam,13-1-212,
B.S.P. Colony, Motinagar,
HYDERABAD-500 018
Fax: 040-3541713

**Printed at:**
**Kalajyothi Process Ltd.,**
1-1-60/5, RTC X Roads,
Musheerabad, Hyderabad-20

**Published at:**
502, Sri Balaji Nilayam,
13-1-212, B.S.P. Colony, Motinagar,
HYDERABAD-500 018

**Editor: RAJA**

**Marketed by:**
Margadarsi Marketing Pvt Ltd.,
6-3-570, Eeenadu Compound
Somajiguda, Hyderabad-82



The one and only Magazine devoted to Humour & Music

36




# హాసం

## హాస్య-సంగీత పత్రిక

మనిషికి భౌతిక అవసరాలైన కూడు,గూడు,గుడ్డ సమకూరడం చాలదని,లలితకళల అవసరం కూడా ఉందని గుర్తిస్తూనే లలితకళలు పోషించబడాలంటే మనిషి భౌతిక అవసరాలు - పూర్తిగా కాకపోయినా కొంతమేరకైనా- తీరాలని కూడా గమనించాలి. మనుగడే కష్టమైనప్పుడు లలితకళలను ఆస్వాదించే ఉత్సాహం, ఉల్లాసం ఎక్కడనుండి వస్తాయి? అలాగని భౌతిక అవసరాల మీదనే పూర్తిగా దృష్టిని కేంద్రీకరించి మానసిక అవసరాలను నిర్లక్ష్యం చేస్తే, మనశ్శాంతికై అలమటించడం తప్పక శారీరక సౌఖ్యాలిచ్చే హాయిని కోల్పోతాం. అందువల్లనే శారీరకంగా శ్రమిస్తూనే, ఆ కష్టాన్ని ఓర్చుకునే శక్తిని మానసికంగా చేకూర్చుకోవడానికి కళల నాశ్రయించడం జరుగుతుంది. పల్లెపదాలు పాడినా, తోలుబొమ్మలాట చూడబోయినా ఆంతర్యం ఇదే!

మరి వీరిని ఉల్లాసపరచవలసిన కళాకారుడు జీవించడమెలా? అతని భౌతిక అవసరాలు తీరడమెలా? అన్న ప్రశ్న వచ్చినప్పుడు సమాజం బాగోగుల ప్రసక్తి వస్తుంది. సమాజం, ప్రజలు కళకళలాడుతున్నప్పుడే కళ పరిఢవిల్లుతుంది. కుండెడు నీటికోసం క్రోసు దూరం నడిచే వేళ కావ్యాలు వినిపిస్తామంటే వినే లేమ లెవ్వరు? చేలు తడిపే నీళ్లకోసం కాట్లాడుకుని కుత్తుకలు ఉత్తరించుకునే సమయాన ఉదాత్తప్రసంగాలు వినే నాధుడెవ్వడు? కరువురక్కసి విలయతాండవ ఘడియన వినబడేది ఇనుపగజ్జెల సవ్వడా? యక్షగాన కీర్తనా?

కళలను ఆస్వాదించాలంటే కడుపునిండిన పరిస్థితి ఒక్కటే సరిపోదు.మానసిక వికాసం కూడా అవసరమే. చదువు, సంస్కారం అబ్బినప్పుడే కళలోని మర్మం బోధపడుతుంది. సున్నితమైన అంశాలు ఆస్వాదించగల శక్తి అలవడుతుంది. విషయం తెలిసి కళాకారుడిని అభినందించగల స్థితికి ఎదగడం జరుగుతుంది. అదే కళాకారుడికి శ్వాస. రసజ్ఞుడైన పాఠకుడు, శ్రోత, ప్రేక్షకుడు తల ఊచినప్పుడే తన విద్యకు సార్థకత కలిగిందని పరవశిస్తాడు కళాకారుడు. ఆ విధంగా సమాజశ్రేయస్సు, కళాకారుడి అభివృద్ధి పరస్పరాశ్రితాలని అనవచ్చు. కళాకారుడు సమాజంలో భాగమే కానీ సమాజంలో తక్కిన వర్గాలను ప్రేరేపించగల శక్తి హెచ్చుగా గలవాడు కాబట్టి, అతను చేసిన ప్రతి పనికి - మంచి గాని చెడుగాని - ప్రచారం బాగా జరుగుతుంది కాబట్టే అతని గురించి ఇంత చర్చ. శక్తితో బాటు అతనికి సమాజం పట్ల బాధ్యత కూడా ఏర్పడుతోంది. సమాజంలోని వ్యక్తులకు అన్నోదకాలు, చదువుసంధ్యలు అమరాలని కోరుకుని, అమర్చడానికి తన శక్తి మేరకు తనవంతు కృషి చేస్తున్నాడు కళాకారుడు.

ప్రముఖ సినీ నటుడు చిరంజీవి ఒక పత్రికలోని వార్తకు స్పందించి, ఒక బాలిక ఉన్నతవిద్యకు సహాయం చేస్తానని గతపక్షంలో ముందుకు వచ్చినప్పుడు ఇవన్నీ ఆలోచించి చేసి ఉండకపోవచ్చు. ఒక మంచిమనిషిగా, స్పందించే గుణం అధికంగా గల కళాకారుడిగా ఆ పేద బాలిక చక్కటి శాస్త్రజ్ఞురాలిగా రూపుదిద్దుకోవడానికి ఆమె బాధ్యతను, ఆమె కుటుంబ బాధ్యతనూ తలకెత్తుకోవడానికి సంసిద్ధత వ్యక్తపరచి ఉండవచ్చు. కానీ ఆయన ఒక గొప్పసంప్రదాయాన్ని కొనసాగిస్తున్నారని గుర్తించి మనం అభినందించాలి.

ఔదార్యం, వితరణశీలం కనబరచిన కళాకారులెందరో ఉన్నారు. స్వర్గీయ ఎం.జి.ఆర్. స్కూలు ఫీజు కట్టమని అభ్యర్థించిన విద్యార్థుల వద్దకు తన సిబ్బందిని పంపి నిజానిజాలు తెలుసుకుని స్కూలు వారికి డైరెక్టుగా ఫీజు కట్టేవారట. అక్కినేని నాగేశ్వరరావు గారు గుడివాడ కాలేజికి ఇచ్చిన భూరివిరాళం ఆంధ్రదేశమంతటా తెలుసు. సమాజంలో ఎందరో దానశీలురున్నా ఈ సత్కార్యాలకు వచ్చిన ప్రచారంవల్ల సామాన్యులెందరో ఉత్తేజితులవుతారు. గుప్తదానాలు ఇచ్చిన, స్కాలర్‌షిప్‌లు ఏర్పాటు చేసిన నటీనటులెందరోవున్నారు. కపిల్‌దేవ్ మేటి క్రికెటరుగా రూపుదిద్దుకోవడానికి హిందీనటుడు ప్రాణ్ అందించిన సహకారం కూడా ఈ కోవకు చెందినదే. ఈనాడు చిరంజీవి గారు ఇచ్చిన చేయూతతో ఆ బాలిక అబ్దుల్ కలాం బాటలో ముందుకు సాగుతుందన్న అభిలాష ఆ పత్రిక వ్యక్తపరిచింది. తథాస్తు. నిన్న - తారల క్రికెట్ మ్యాచ్, నేడు చిరంజీవి వితరణ - ఇలా కళాకారుడికి, సంఘానికి మధ్య బంధం నానాటికీ దృఢతరం కావడం శుభపరిణామంగా 'హాసం' భావిస్తున్నది. అభినందిస్తున్నది. దీనిద్వారా సాంఘికప్రగతి, సామాన్యుల అభివృద్ధి, తద్వారా పైన చెప్పినట్లు కళావికాసం జరుగుతాయని 'హాసం' నమ్మిక.



# ముల్లును ముల్లుతోనన్న పద్ధతే... వజ్రం వజ్రేణ భిద్యతే...



**- ఏజర్ల సత్యనారాయణ**

ఖాళీగా ఉన్న బెంచ్ మీద కూర్చున్నాడు రాజేష్.

'యువర్ అటెన్షన్ ప్లీజ్-నెం.2025 హైద్రాబాద్ టు ముంబాయి వెళ్ళే ఫ్లయిట్ మరికొద్ది సేపటిలో బయలుదేరుటకు సిద్ధముగా ఉన్నది....' అన్న పిలుపు విని ఉలిక్కిపడ్డాడు రాజేష్.

ఉలిక్కిపడింది ముంబాయి వెళ్ళే ఫ్లయిట్ వెళ్ళిపోతున్నందుకు కాదు, ఆ అనౌన్స్‌మెంట్ స్పీకర్‌లోంచి కాకుండా టీవి లోంచి వచ్చినందుకు...!

'ఇంకా హైద్రాబాద్ డవలప్ కాలేదు. టీవీలో అనౌన్స్‌మెంటు రావటం ఏంటి.... మరి విచిత్రంగా' అని మనసులో నవ్వుకున్నాడు రాజేష్.

"ఒరేయ్ రాజేష్" అని పిలుపు వినబడడంతో పక్కకు తిరిగి చూశాడు, ఎదురుగా సోడాబుడ్డి కళ్ళద్దాలను పెట్టుకొని ఒక వ్యక్తి నవ్వుతూ కనిపించాడు రాజేష్‌కి.

ఆ పలకరించిన వ్యక్తి ఎవరో రాజేష్‌కి అర్థం కాలేదు... "హీ... హీ... హీ..." అని పళ్ళు ఇకిలిస్తూ రాజేష్ ముందుకొచ్చాడు ఆ వ్యక్తి.

"ఉరేయ్ రాజేష్ నన్ను గుర్తు పట్టలేదా? నేను సురేందర్‌ని రా. గుర్తు వచ్చానా...?" అంది ఆ కళ్ళద్దాల శాల్తీ.

రాజేష్ "ఆ..?" అని నోరు తెరిచి "ఉరేయ్ సురేందర్ నువ్వా...?" అన్నాడు.

"అవున్రా, నేనే... గుర్తుపట్టలేదా...?" అన్నాడు సురేందర్.

"ఎలా... గుర్తుపడతానురా...! ఆ సోడాబుడ్డి కళ్ళద్దాలు ఏమిటి...? ఆ లోకం ఏంటీ...?" ఆశ్చర్యంగా ఎగాదిగా చూస్తూ అన్నాడు రాజేష్.

"ఏం చేస్తాం... మారుతున్న కాలంతో పాటు మనం కూడా మారాలి కదరా" అన్నాడు సురేందర్.

"ఏం మారడమో గాని న2వ్వు మాత్రం నిజంగానే మారిపోయావు రా...! కాలేజీలో చదువుకునే రోజులలో ఎంత హ్యాండ్‌సమ్‌గా ఉండేవాడివి. అలాంటిది ఇలా అయిపోయావేంట్రా"

"అవన్నీ సీరియల్ కష్టాలు గానీ ముందు

**14 జూన్ 2012**

సమయం 11 గంటల 30 నిముషాలు...

ఎయిర్‌పోర్ట్‌లో...

అప్పుడే అమెరికా ఫ్లయిట్ నుండి దిగిన రాజేష్ ఇండియా గాలిని అందులోనూ హైద్రాబాద్ గాలిని గుండెలనిండా పీల్చి... 'హా... ఎంతకాలమైంది హైద్రాబాద్ గాలిని పీల్చి. ఎంత హాయిగా ఉంది! ఎన్నాళ్ళయింది.... ఈ గాలిని, ఈ వాతావరణాన్ని రుచి చూసి' అనుకున్నాడు రాజేష్.

రాజేష్ ఇక్కడున్న బంధువులను, స్నేహితులను వదిలి అమెరికాకు వెళ్ళి 10 సంవత్సరాలు అయింది. అమెరికాలో హిప్నాటిజంలో డాక్టర్ పట్టాను పుచ్చుకుని స్వదేశంలో తన సేవలను అందించడానికి అక్కడి నుండి హైద్రాబాద్ వచ్చాడు. వచ్చేముందు తన ప్రాణ స్నేహితుడైన సురేందర్‌కి ఫోన్ చేసి తాను వస్తున్న సంగతి చెప్పి ఏర్‌పోర్ట్‌కి కారు పంపించమని చెప్పాడు.

కాని సురేందర్ కారు కాదు కదా కనీసం మనిషి కూడా రాలేదు! అతని కోసం చూసి చూసి చివరకు ఇంటికి ఫోన్ చేశాడు రాజేష్. కానీ ఎంత సేపు ట్రై చేసినా ఎంగేజ్ వస్తోంది ఫోన్. రాజేష్‌కి హైద్రాబాద్ కొత్త. అసలు రాజేష్‌ది విజయవాడ. నెల రోజులు సురేందర్ దగ్గర హైద్రాబాద్‌లో ఉండి తరువాత విజయవాడ వెళ్ళాలనుకున్నాడు.

'ఈ సురేందర్ గాడు ఇంకా రాలేదు...' అని మనస్సులో తిట్టుకుంటూ లగేజీని ఓ పక్కకు పెట్టి

ఇంటికి నడు, తర్వాత అన్నీ వివరంగా మాట్లాడుకోవచ్చు..." అన్నాడు సురేందర్.

తర్వాత లగేజీని కారులో సర్ది ఇద్దరూ బయలుదేరారు.

"మీ ఇంటికి ఫోన్ చేస్తే ఎంగేజ్ వస్తోంది. నువ్వు కారుతో వస్తావని ఎదురుచూస్తున్నాను" అన్నాడు రాజేష్.

"కారు కొంచెం ప్రాబ్లమ్ ఇచ్చింది. అందుకే త్వరగా రాలేకపోయారా... ఫోన్ ఎంగేజ్ వస్తోందంటే కరెంట్ పోయిందన్నమాట" అన్నాడు సురేందర్.

"అంటే మీ ఫోన్ కరెంట్ ఉంటేనే పని చేస్తుందా...?" ఆశ్చర్యంగా అడిగాడు రాజేష్.

"కరెంట్ పోయింది మాకు కాదు, మా అత్తగారికి. అందుకే ఫోన్ ఎంగేజ్ వస్తుంది...!" అన్నాడు సురేందర్.

"ఆ... నువ్వు ఏం మాట్లాడుతున్నావో నాకు అర్థం కావడం లేదు" అయోమయంగా అన్నాడు రాజేష్.

"ఇందులో అర్థం కాకపోవడానికి ఏం ఉందిరా బాబూ. మా అత్తగారికి కరెంట్‌పోతే మా ఆవిడ తను చూస్తున్న సీరియల్‌ని ఫోన్‌లో రన్నింగ్ కామెంటరీలాగా వివరిస్తుంది. అందుకే ఫోన్ ఎంగేజ్ వస్తుంది" ఓపిగ్గా చెప్పాడు సురేందర్.

"ఆ...!" ఆశ్చర్యంతో నోరు తెరిచేశాడు రాజేష్.

"అలా నోరు తెరిచేశావేంటి...?" ఇంకా ఆశ్చర్యంగా అడిగాడు సురేందర్.

"టీవీలో సీరియల్ గురించి... ఫోన్‌లో... గంటలు గంటలు... మాట్లాడుకోవడమా...? ఆశ్చర్యంగా ఉందే...?" అతి కష్టం మీద అన్నాడు రాజేష్.

"వోర్నీ... ఇప్పుడేం చూశావు? ముందు ముందు అన్నీ నీకే ఆశ్చర్యంగా అనిపిస్తాయి" తేలిగ్గా అన్నాడు సురేందర్.

కారు లోపల పరిశీలిస్తూ "ఆ...!!! ఇదేంటి? కారులో కంప్యూటర్?" మళ్ళీ ఆశ్చర్యంగా అడిగాడు రాజేష్.

"అది కంప్యూటర్ కాదురా-టీవీ! మా ఆవిడ బయటకు వెళ్ళేటప్పుడు చూడడానికని పెట్టించాను. అయినా నువ్వు ప్రతీసారి అంత ఆశ్చర్యపోకురా" విసుగ్గా చెప్పి "A.TV, B.TV, C.TV, E.TV, M.TV, Y.TVలు ఆన్ చేయమంటావా...? X.TV ఆన్ చేయమంటావా..?" కారులో ఉన్న ఆ చిన్న టీవీని పరీక్షగా చూస్తున్న రాజేష్‌ని ఉద్దేశించి అడిగాడు సురేందర్.

రాజేష్ "టీవీ ఛానెల్ పేర్లు ఇన్నా...?"

సురేందర్ "నేను చెప్పింది కొన్ని ఛానెల్స్




పేర్లే...! తెలుగులో ఉన్న 499 ఛానెల్స్ పేర్లు చెపితే ఇంకెంత ఆశ్చర్యపోతావో...?"

రాజేష్ "ఆ......499 ఛానెల్సా....?" ఆశ్చర్యంగా అని నోరు పెద్దగా తెరిచాడు రాజేష్.

"ఒరేయ్, నీతో చస్తున్నాన్రా. ముందు నోరు మొయ్యి. లేకపోతే నోట్లో దోమలు దూరతాయి" చిరాగ్గా అన్నాడు సురేందర్.

"అన్నట్లు మన ఫ్రెండ్స్ చిన్నా, బాబూరావు, క్రిష్ణారెడ్డి, సతీష్... ఎలా ఉన్నారు" అడిగాడు రాజేష్.

"చిన్నా పెళ్ళయి మూడు నెలలు తిరగక ముందే విడాకులు ఇచ్చేసి ప్రశాంతంగా స్వామి చిన్మయానంద ఆశ్రమంలో శేష జీవితాన్ని గడుపు తున్నాడు" చెప్పాడు సురేందర్.

"అదేంటి!!! ఎందుకు...?" బుల్లెట్ల మాదిరిగా రెండు ప్రశ్నలు వచ్చాయి రాజేష్ నోట్లోనుంచి.

అంతే స్పీడ్‌గా తిరిగొచ్చిన బుల్లెట్లలాగా జవాబిచ్చాడు సురేందర్ "పెళ్ళాం బాధ భరించలేక...!"

"అంటే పెళ్ళాం అంత గయ్యాళిదా...?" విచిత్రంగా చూస్తూ అడిగాడు రాజేష్.

"అంటే మరీ మా ఆవిడంత గయ్యాళిది కాదనుకో" చెప్పాడు సురేందర్.

"మరి ఎందుకు విడాకులిచ్చాడు...?"

"ఏముంది టీవీ కొనమని వేధిస్తోందని.."

"టీవి కొనమని అడిగినందుకు అగ్నిసాక్షిగా పెళ్ళాడిన భార్యకు విడాకులు ఇచ్చేస్తాడా...? నిజంగా వాడికి మెంటలెక్కినట్టుంది! ఉండు, వాడు కనిపిస్తే ఏం చేస్తానో చూడు" అంటూ పళ్ళు పటపట నూరాడు రాజేష్.

"హి...హి...హి... ఏం జోక్ చేశావురా" అన్నాడు సురేందర్ ఇకిలిస్తూ.

"ఒరేయ్ సురేందర్, గుర్రం సకిలించినట్లు ఏంటా నవ్వు?" అన్నాడు చిర్రెత్తుకొచ్చిన రాజేష్.

"చిన్నాగాడు చేసిన పనికి మెచ్చుకోక తిరిగి వాడ్ని తిడుతున్నందుకు ఈ నవ్వు" అని చెప్పి మళ్ళీ పగలబడి నవ్వటం మొదలుపెట్టాడు సురేందర్.

"చక్కని సంసారం చేతులారా చెడగొట్టుకున్న వాడ్ని తిట్టకుండా నెత్తినెక్కించుకోమంటావా...!" కోపంగా అన్నాడు రాజేష్.

"వాడా పని ఎందుకు చేశాడో తెలుసా...?" అన్నాడు సురేందర్.

"ఎందుకు...?" ఆశ్చర్యంగా అన్నాడు రాజేష్

"ఎందుకేంటి? అప్పట్లో తెలుగులో 75 ఛానెల్స్ ఉన్నాయి. వాటిలో 30 ఛానెల్స్‌లో



సీరియల్స్ వస్తుంటాయి. కాని మన చిన్నాగాడి ఆవిడ 30 ఛానెల్స్‌లో వచ్చే సీరియల్స్ అన్నీ చూడడం మిస్ అవుతుందని 30 టీవీలు కొనమని రోజు సతాయిస్తుండేది. పాపం మనవాడు భార్య మీద ప్రేమతో అప్పటికే ఓ 20 టీవీలు కొన్నాడు. కాని ఇంకా కావాలని వేధిస్తుంటే మనవాడు ఆ బాధ భరించలేక విడాకులు ఇచ్చేశాడు'' అంటూ దారిలో ఉన్న ఆశ్రమంలోకి తీసుకువెళ్ళి చిన్నాను చూపించాడు సురేందర్.

* * *

"ఒరేయ్ చిన్నా... ఏంట్రా ఈ వేషం... కాలేజీలో చదువుకునే రోజుల్లో ఎంత హ్యాండ్‌సమ్‌గా ఉండేవాడివి. అలాంటిది ఇలా అయిపోయావు ఏంట్రా!'' తన స్నేహితుడిని చూస్తూ బాధగా అన్నాడు రాజేష్.

చిన్నా "ఎవరు నాయనా నువ్వు...! ఎవరు...??? ఎవరిలా అయిపోయారు..??? అందరూ అందరే... ఏదో రోజు మనిషి అనే ఈ చిన్న టీవి, భగవంతుడనే పెద్ద టీవీలోకి వెళ్ళిపోవలసిందే నాయనా... అంతా టీవి మయం...!'' అన్నాడు ఒక్క నిమిషం కళ్ళు మూసుకుని చిన్నా.

రాజేష్ "వీడు ఇలా మాట్లాడు తున్నాడేంట్రోయ్!!! అసలు వీడు మన చిన్నాగాడేనా? ఏంటి వీడు ఇలా...?'' బుర్ర బరుక్కుంటూ అడిగాడు రాజేష్.

"ఏం చేస్తాం అంతా 'టీవీంద్రజాలం'...!" వైరాగ్యంతో అన్నాడు సురేందర్.




తీసుకున్నదానికన్నఎక్కువ హామీ చూపించగలిగితే ఎంతైనా ఇచ్చే సంస్థ?

బ్యాంకు

"టీవీంద్రజాలం ఏమిట్రా?'' తను పుట్టిన దగ్గర్నుంచి వినని కొత్త పదం వినబడటంతో ఆశ్చర్యంగా అడిగాడు రాజేష్.

"సంసార బాధలు భరించలేక ఇక్కడకు వచ్చిన వారికి భక్తిభావం బోధించడానికి 24 గంటలూ భక్తి కార్యక్రమాలు చూపించడంతో ఇక్కడ ఉన్న వారందరికీ భక్తి నరనరాల్లోకి ఎక్కేసింది'' వివరించి చెప్పాడు సురేందర్.

"అంటే దీనికి విరుగుడు మార్గం లేదా...?'' కొంచెం అయోమయంగా అడిగాడు రాజేష్.

"ఎందుకు లేదు? ఉంది ఒకే మార్గం'' అన్నాడు సురేందర్ కులాసాగా.

"ఏమిటది..." అని ఆశగా అడిగాడు రాజేష్.

"మనం వెనక్కి చూడకుండా ఇక్కడి నుండి వెళ్ళిపోతే అప్పుడు ఉంటుంది మార్గం. లేకపోతే మనకి కూడా కాషాయ బట్టలు వేసి టీవి ముందు కూర్చోబెట్టి భక్తిని బోధించేస్తారు. అప్పుడు నువ్వు కూడా వీడిలా అయిపోతావు తర్వాత నీ ఇష్టం'' అన్నాడు సురేందర్.




"పాపం అలా అంటావేంట్రా...!'' అన్నాడు రాజేష్ కంచెం జాలిగా.

"ఇంకేమనమంటా వురా. ఎయిర్‌పోర్ట్ నుండి ఇంటికి కూడా వెళ్ళకుండానే ఈ చిన్న దానికే నువ్వు ఇంతగా బాధపడిపోతున్నావు. ముందు ముందు నువ్వు చాలా చూడాలి. ఓపికపట్టు... ముందు నడు'' అని చేయి పట్టుకుని ఆశ్రమం నుండి బయటకు తీసుకువచ్చి కారు స్టార్ట్ చేశాడు సురేందర్.

కారు ఆశ్రమం దాటి ముందుకు కదిలిందో లేదో కారుకు కొంత దూరంలో కొందరు వ్యక్తులు ఓ మనిషిని మోసుకుంటూ రావడం కనిపించారు.

"పాపం ఎవరో చనిపోయారు. అవును... ఎవరో ఆడామె అనుకుంటా. పట్టుచీర కట్టుకుని ఉంది'' అన్నాడు రాజేష్.

"నీ మొఖం. ఆడవాళ్ళు పట్టు చీర కట్టుకోకపోతే మగవాళ్ళు కట్టుకుంటారా...!'' అన్నాడు సురేందర్.

"అదికాదు అమెరికాలో అయితే అసలు చీరలే కట్టుకోరు కదా! అందుకని అలా అన్నా'' అన్నాడు రాజేష్.

"అది అమెరికానమ్మా. అక్కడ ఏం కట్టుకున్నా నడుస్తుంది. కాని ఇది ఇండియా. అలా చేస్తే రోట్లో పసుపుకొమ్ముల్లా చితక్కొట్టేస్తారు'' అన్నాడు సురేందర్.

"ఆ...! ఆ... అదేమిటీ ఆవిడ వెనుక టీవీలు తీసుకువెళ్తున్నారు...'' ఆశ్చర్యంగా అడిగాడు రాజేష్.

"ఆమెకు మనశ్శాంతి కోసం, రోజూ టీవీచూసే అలవాటు వల్ల. టీవీతో ఆమెకు దహనసంస్కారాలు చేస్తారు'' అన్నాడు సురేందర్.

"ఎందుకు...?'' అడిగాడు రాజేష్.

"దెయ్యమై మిగిలిన వారిని పీడించకుండా'' చెప్పాడు సురేందర్.

"బాగానే ఉంది...!'' అన్నాడు రాజేష్.

"ఇంకా బాగుంటుంది... బస్సులో వెళితే'' చెప్పాడు సురేందర్.

"ఆ...!'' అని నోరు తెరిచాడు రాజేష్.

"అవును. టైర్ పంచర్ అయింది. మనం ఈ రోజు ఇంటికి వెళ్ళేలా లేం''. చెప్పాడు సురేందర్.

"అన్నట్లు మీ ఇంటికి ఎంతదూరం...!'' అడిగాడు రాజేష్.

"ఓ ...పది కిలోమీటర్లు''

"అంటే సిటీకి చాలా దూరంలో అన్నమాట'' సురేందర్ "అవును. నడు బస్సులో వెళదాం''

అని కారుని రోడ్డు పక్కకు పెట్టి లాక్ చేశాడు.

* * *

ఇద్దరూ బస్టాప్‌లో బస్సు కోసం ఎదురుచూడసాగారు.

"మరి బాబూరావు, సతీష్, క్రిష్ణారెడ్డి... ఏం చేస్తున్నారు...? కాదు ఎలా ఉన్నారు...?"

"పెళ్ళాలు వదిలేశారని బాధే గాని వాళ్ళకేం రెండు చేతులా సంపాదిస్తున్నారు".

"ఆ..? వాళ్ళ భార్యలు కూడా వాళ్ళని వదిలేశారా???" ఆశ్చర్యంగా అడిగాడు రాజేష్.

"ఎందుకు నాయనా? సాంబార్‌లో ముద్దపప్పు కలిపినంత ఆశ్చర్యంగా అడుగుతావు. ఇండియాలో 75% భార్యాభర్తలు భర్త టీవీ చూస్తున్నప్పుడు అడ్డు వస్తున్నాడని, భర్త వంటలు సరిగా వండడం లేదని, కేబుల్ టీవీ బిల్లు కట్టడం లేదని, మన చిన్నాగాడి భార్యలాగా ఛానెల్స్ పెరుగుతున్నప్పుడల్లా కొత్త టీవీ కొనమని, టీవీలో నటీనటులు వేసుకునే చీరలు, నగలు కొనమని ఇలా అనేక రకాల కారణాల వల్ల విడాకులనే పంజరంలో చిక్కుకుంటున్నారు. అయినా ఈ సుత్తి అంతా నీకు ఎందుకులే గాని నీకు వాళ్ళ వివరాలు కావాలి కదా... బాబూరావు పిచ్చాసుపత్రి పెట్టి లక్షలు సంపాదిస్తున్నాడు. క్రిష్ణారెడ్డి కంటాసుపత్రి పెట్టి వేలకువేలు సంపాదిస్తున్నాడు" చెప్పాడు సురేందర్.

"ఎలా...?" ఆశగా అడిగాడు రాజేష్.

"ఎలా ఏమిటి??? ఈ రోజు టీవీ చూసేవాళ్ళు ఆ జీడిపాకం సీరియల్స్ వల్ల రేపు ఎలాగో కళ్ళు పాడయి, మతిపోయి పిచ్చోళ్ళు, గుడ్డోళ్ళు కావడం ఖాయం. నాటికి 60% అలాగే అవుతున్నారు. కాకపోతే వాళ్ళు నాకు డిస్కౌంట్ ఇచ్చారు. ఎందుకు...? రేపో ఎప్పుడో మా ఆవిడ కూడా పిచ్చిది అయిపోతుంది కదా!

అందుకు ముందునుంచే కాకా పట్టేశాను. ఆ... అదుగో మనం వెళ్ళవలసిన బస్సు వచ్చింది నడూ..! అన్నట్లు నీ దగ్గర నాలుగు వందలుచిల్లర ఉందా?" అడిగాడు సురేందర్.

"నీ చిల్లర బుద్ధి పోలేదన్నమాట, ఎందుకు...!"

"నేను చిల్లర అడుగుతున్నది మనకి టికెట్ తీయడానికి. పల్లీలతో పచ్చడి చేయడానికి కాదు...!"

"టికెట్‌కి నాలుగు వందలా?" తెల్లమొహం పెట్టి అన్నాడు రాజేష్.

"లేదు 200 డాలర్లు...!"

"అబ్బా నువ్వు వేళాకోళం ఆడుతున్నావో నిజంగా మాట్లాడుతున్నావో నాకు అర్థం కావడం లేదు. నాలుగు వందలతో టికెట్ ఏమిటి?" అంతా అయోమయంగా ఉంది అన్నాడు రాజేష్.




"ఆ... అంతా ఏమిటో ... బస్సులో చెపుతాను గాని ముందు బస్సు ఎక్కు. లేదంటే ఉన్నది కాస్తా పోతుంది" అన్నాడు సురేందర్.

ఇద్దరూ బస్సు ఎక్కి ఖాళీగా ఉన్న విండో సీటులో కూర్చున్నారు. ఇద్దరికీ రాజేష్ ఇచ్చిన పైసలతో టికెట్స్ తీసుకున్నాడు సురేందర్.

"అర్రే!!! బస్సులో టీవీ...?" ఆశ్చర్యంగా అడిగాడు రాజేష్.

"మరి ఆర్టీసీ లాభాల్లో రావాలంటే మహిళా ప్రయాణీకులు సీరియల్స్ మిస్ కాకుండా చూడడానికి ఈ ఏర్పాట్లు" చెప్పాడు సురేందర్.

"అదేంటి జనం ఆ టీవీ షాప్ ముందు...? దీపావళి పటాసులు కొంటున్నట్టు...?" వాడు గాని వాళ్ళని మోసం చేశాడా? అడిగాడు రాజేష్.

"దాదాపు అలాంటిదే ఇంకో 5 రోజులలో మరో కొత్త ఛానెల్ మొదలు కాబోతుంది. ముగ్గులు ఎలా పెట్టాలో దానిలో వీడియో ద్వారా చూపిస్తారు. అందుకే ముగ్గులు వేసేది మగవాళ్ళే కదా! అందుకే టీవీల కోసం ఆ మగ జనాభా...!" వివరంగా చెప్పాడు సురేందర్.

"ఏమిటి ముగ్గుల గురించి టీవీ ఛానెలా?" అని నోరు తెరిచాడు రాజేష్.

"అరేయ్, ముయ్యరా నోరు" కసిరాడు రాజేష్‌ని సురేందర్.

"ముగ్గుల గురించి టీవీ ఛానెల్ ఏమిట్రా?" అమాయకంగా ప్రశ్నించాడు రాజేష్.

"ఇప్పుడు అదొక్కటే తక్కువయింది. మన తెలుగు ప్రజల పుణ్యమా అని రైతుల కోసం కోళ్ళు పెంచే ఛానెల్, పందులు పెంచే ఛానెల్, కుక్కలు పెంచే ఛానెల్ ఇలా ఒకటేమిటి చెప్పుకుంటే ఐదువందల ఛానెల్స్ గురించి చెప్పుకోవాలి. ఒకసారి ఒక ఛానెల్‌లోని ప్రసారం చేసిన కార్యక్రమాన్ని ఓ పది సార్లయినా సంవత్సరానికి రిపీట్ చేస్తారు, తెలుగు సినిమా కథల్లాగ".

"ఉరేయ్, అన్నట్లు సినిమా అంటే గుర్తొచ్చింది సినిమా చూసి చాలా సంవత్సరాలు అయింది. సినిమాకి వెళ్దాంరా"

"సినిమాకా...?" నోరు తెరిచాడు సురేందర్.

"ఉరేయ్ నేను అడిగింది సినిమాకిరా బాబూ! నీ ఆస్తి రాసివ్వమని కాదు" అన్నాడు రాజేష్ ఉక్రోషంగా.

"అలా అడిగినా నా దగ్గరేముంది గాని సరే వెళ్దాం" అన్నాడు సురేందర్.

"అలా అయితే ఇంటికెళ్ళిన తర్వాత చెల్లాయ్‌ని కూడా తీసుకువెళ్దాం"



"ఎందుకు?"

"ఎందుకేమిట్రా... టికెట్స్ కోసం ఆడవాళ్ళకయితే త్వరగా ఇచ్చేస్తారు కదా టికెట్స్ అందుకని"

"ఏమిటి టికెట్స్ కోసమా...

"ఉరేయ్ నువ్వు అమెరికా నుండి పనికట్టుకుని నన్ను నవ్వించడానికి వచ్చావా???" విరగబడి నవ్వుతూ అన్నాడు సురేందర్.

"అదేమిటిరా అలా అంటావు" పాత సినిమాలలో విలన్‌లా అడిగాడు రాజేష్.

"మరి లేకపోతే ఏంట్రా? సినిమా టికెట్స్ కోసం లేడీస్‌ని సినిమాకి తీసుకువెళ్దాం అంటావు" కొండను తవ్వి చిన్న ఎలుకను పట్టుకున్నట్లు వెటకారంగా అన్నాడు సురేందర్.

"ఉరేయ్ మనం సినిమాకి వెళ్దాం అనుకున్నది ఫ్యామిలీ సినిమాకి. అంతేకాని మగవాళ్ళకి మాత్రమే అని చూపించే 'A' సినిమాకి కాదు" కోపంగా సురేందర్ వంకచూస్తూ అన్నాడు రాజేష్.

"మళ్ళీ జోక్ వేశావురా. హి... హి... హి... హి..." అని నవ్వాడు సురేందర్.

"నవ్వకురా బాబూ. ఏమి మాట్లాడినా నీకు జోక్ అనిపిస్తుంది. కాని నాకు నువ్వు నవ్వితే తేళ్ళు, జర్రులు ఒంటిమీద పాకుతున్నట్లు ఉంది" అని జుట్టు పీక్కుంటూ అరిచాడు.

"మరి ఈ రోజుల్లో ఆడవాళ్ళు సినిమాలకు ఎప్పుడు రావాలిరా...! ఎంత మంచి సినిమా అయినా వాళ్ళు టీవీని, టీవీలో వచ్చే జీడిపాకం సీరియల్స్ వదిలి రానుగాక రారు." టీవీ పుట్టిందే వారికోసం.

"ఉరేయ్ అంటే భారతదేశానికి 'ఎ అం ప్లే క' కంటే భయంకరమైన టీవీ వ్యాధి సోకిందన్నమాట" అన్నాడు రాజేష్.

## కమాల్ ప్రశ్న - ధమాల్ కార్టూన్



**తత్వజ్ఞానం అనగా...!?**

**గొప్పవాడిగా ఉండడం కన్నా దరిద్రుడిగా ఉండడంలోనే గొప్పతనం ఉందనుకునే ఆత్మతృప్తి**

"ఇదేంట్రోయ్ ఇదేదో కొత్త రోగంలా వుంది" అని ఆశ్చర్యంగా అడిగాడు సురేందర్.

"అంటే, ఎయిడ్స్, ఆంత్రాక్స్, ప్లేగు, కలరా" అన్నమాట చెప్పాడు రాజేష్.

"దీని నుండి విముక్తి లేదా???" దీనంగా అడిగాడు రాజేష్.

"విముక్తా, హి... హి... హి... హి... అలాంటి జోకులు వేయకురా. అసలే టీవీ ఛానెల్ వత్తిడి వల్ల చదువురాని వాళ్ళు తిట్టుకునే తిట్లను హి... హి...లతో కామెడీ చేయించేస్తున్నారు నేటి సినీ పండితులు. వారికి సినిమాలలో కరెక్టుగా సరిపోయినట్లు ఉంది నీ వరస" మందహాసంగా అన్నాడు సురేందర్.

"ఓరి నాయనో. ఏమిటీ వింత అప్పుడెప్పుడో "జంబలకిడి పంబ" సినిమా లాగా ఉంది ఈ వాతావరణం. నాకు పిచ్చెక్కిపోతోంది" అని మళ్ళీ జుట్టు పీక్కుంటూ అరిచాడు రాజేష్.

"ఆ...! అలాగయితే బాబురావు గాడికి ఫోన్ చేయమంటావా? అంబులెన్స్ పంపిస్తాడు" అడిగాడు సురేందర్.

"ఆ.. అంత పని చేయకురా నా పెళ్ళాం పిల్లలు అనాథలు అవుతారు!" అన్నాడు రాజేష్.

"అన్నట్లు అడగడం మర్చిపోయాను. మీ భార్యా పిల్లలు ఎలా ఉన్నారు?" అడిగాడు సురేందర్.

"వచ్చిన ఇప్పటికా అడిగేది ఇంకా నయం నేను వెళ్ళేటప్పుడు అడుగుతావేమోనని అనుకుంటున్నాను"

"ఆ... మన బస్ స్టాప్ వచ్చింది నడు. ఇంటికి వెళ్ళిన తర్వాత హాయిగా ఫ్రెషప్ అయి ఊరంతా తిప్పుతా, అప్పటివరకు కాస్త రిలాక్స్‌గా ఉండు" అని ఇద్దరూ బస్సు దిగి ఇంటివైపు నడిచారు.

* * *

"ఉరేయ్ రాజేష్ ఏమిటా మొద్దు నిద్ర లేవరా.... నీ కోసం వేడివేడిగా పకోడీలు చేశాను లేవరా నాయనా...!"

"కోళ్ళా...?" అన్నాడు బద్ధకంగా రాజేష్.

"నీ తలకాయ కోళ్ళు కాదు పకోడీలు"

"చాలా బాగున్నాయిరా. మా చెల్లెమ్మ చేతి వంట చాలా బాగుంది. నిజంగా నీవు అదృష్టవంతుడివిరా"

"అదృష్టమా పాడా. ఇవి మీ చెల్లెలు చేసినవి కాదు, నేను వండినవి"

"ఆ...!"

"అలా మాటి మాటికీ నోరు తెరవకు. దోమలు చేరగలవు, మా ఆవిడకు తీరిక ఎక్కడిది 24 గంటలు టీవీ చూడడంలోనే సరిపోతుంది" అన్నాడు సురేందర్.

"అన్నట్లు మీ ఆవిడ ఏదిరా? ఇందాక కనిపించలేదు" అడిగాడు రాజేష్ అనుమానంగా.

"అవుట్ హౌస్‌లో ఉంది. అన్నీ అక్కడికే వెళ్తాయి. నడు చూపిస్తా. కాస్త గుండె నిబ్బరం చేసుకుని చూడు రాజేష్" అని తీసుకువెళ్ళాడు సురేందర్.

ఎదురుగా సురేందర్ భార్యను చూసి, "బాబోయ్... దె... దె... దెయ్యం" అని కెవ్వున అరిచాడు. ఆ అరుపుకి గది దద్దరిల్లిపోయింది.

"రాజేష్ భయపడ్డావా...? నేను ముందుగానే



అనుకున్నా నువ్వు భయపడతావని''

''అ..దీ...కా..దు...రా... నిజంగా దెయ్యంరా...'' అని వణుకిపోతూ చెప్పాడు రాజేష్.

''నీ తలకాయి 24 గంటలూ టీవీకి అతుక్కుపోయి ఉండడం వల్ల ఆమె అలా తయారయింది'' అన్నాడు సురేందర్.

రాజేష్‌కి మతిపోయింది. 10 సంవత్సరాల క్రితం సురేందర్ పెళ్ళికి చూసినప్పుడు కుందనపు బొమ్మలా ఉన్న సురేందర్ భార్య ఇప్పుడు అస్తి పంజరంలా తయారయింది. చింపిరి జుత్తు, పెద్ద పెద్ద కళ్ళద్దాలు, బాబోయి ఆ గదిలో ఓ 30 వరకు టీవీలు ఉంటాయి. వాటిలో వివిధ ఛానెల్స్‌లలో సీరియల్స్ వస్తున్నాయి. ''బాబోయ్, నన్ను బయటకు ఎక్కడికి అయినా తీసుకువెళ్ళు. నా బుర్రంతా పాడైపోయింది. నేను ఈ దృశ్యాలను చూడలేను...!'' భయంతో వణుకుతూ అన్నాడు రాజేష్.

మరీ అంతగా భయపడకు ఇక్కడ ఆడవారు అందరూ అంతే. సరే అయితే నడూ అలా ట్యాంక్‌బండ్ వరకు వెళ్ళి మనస్సు ప్రశాంతంగా చేసుకుని వద్దాం'' అని రాజేష్‌ని ట్యాంక్‌బండ్ దగ్గరకు తీసుకువెళ్ళాడు సురేందర్.

* * *

జూలై 15, 2013

''వండర్... నిజంగా వండర్... ప్రపంచంలో వింతల్లో వింతయిన ఈజిప్టులోని పిరమిడ్ లన్నీ ఫ్రొగై మరొక పెద్ద పిరమిడ్ తయారయిన సైజులో భారతదేశంలోని టీవీలన్నీ పెద్దకొండలా పేరుకుపోయాయి. ఎక్కడ మచ్చుకు కూడా కనపడకుండా ఉండాలని అలా కొండలా పోసినది మొన్నటిదాకా టీవీకి దాసోహం అన్న మహిళామణులే! వారే అలా చేయడానికి కారణం - ఇప్పుడు వారికి టీవీ అన్నా, టీవీలోని సీరియల్స్ అన్నా ఎలర్జీ. ఎక్కడైనా, ఎవ్వరైనా, టీవీ చూస్తే చాలు, సల సల కాగే నూనెలో పడేసేటంత పని చేస్తారు. వీరిలో వచ్చిన మార్పువల్ల ప్రభుత్వాలే మారిపోయాయి. మంచిని పెంచి ప్రజల కష్టాలను అర్థం చేసుకుని వారిని బాధలు పెట్టకుండా, కన్నబిడ్డల్లా చూసుకొనే నాయకులు పాలకులు అయ్యారు.

టీవీ వ్యాధికి తగిన విరుగుడు కనిపెట్టి దాని ద్వారా ప్రజలందర్నీ మార్చి భార్యా బాధితులందరి మన్ననలను పొందిన రాజేష్‌కి సత్కారం -

''ప్రపంచ దేశాలతో పోటీ పడి అతి భయంకర టీవీ వ్యాధితో బాధపడుతున్న భారతావనిని ఒక యువకుడు ఒకసంవత్సరం కాలంలోనే మార్చి ఎందరికో స్వేచ్ఛా జీవితాలను ప్రసాదించిన రాజేష్‌కి యావత్ భారతదేశం రుణపడి ఉంటుంది. ఇంత కృషి చేసిన రాజేష్‌కి ప్రభుత్వం తరపున చిన్న సన్మానం, '' అంటూ రాష్ట్రపతి ఉపన్యసించారు.

''నువ్వు తలపెట్టిన కార్యం జరగదనుకున్నాంరా. కాని నువ్వు మా జీవితాలలో వెలుగు నింపావు'' అని సురేందర్ దంపతులు, చిన్నా, ఇంకా వేలాదిమంది దంపతులు అతన్ని పూలమాలతో ముంచెత్తేశారు. ఇంతకీ అతగాడీ విజయాన్ని ఎలా సాధించాడో తెలుసా...

హైద్రాబాద్‌లో ప్రజలు టీవీకి ఏవిధంగా బానిసలు అయ్యింది దాని వల్ల వారు పడుతున్న బాధలు అన్నీ క్షుణ్ణంగా గమనించాడు రాజేష్. టీవీపైవైగటు పుట్టించాలంటే దానికి మార్గం తాను అమెరికాలో నేర్చుకున్న హిప్నాటిజం. దాని ద్వారా ప్రజలను మార్చాలి. కానీ వారిని చేరుకోవడం ఎలా? ముల్లును ముల్లుతోనే తీసినట్టు టీవీ ఛానెల్‌ని ఉపయోగించే టీవీలు చూసేవారిని తగ్గించాలి. తన హిప్నో వైద్యం అందరికీ చేరాలంటే అదే సరి అయిన మార్గం అనుకొని వెంటనే స్వంతంగా ఓ హిప్నో ఛానల్ ఓపెన్ చేశాడు . ఫలితాలు సాధించాడు. అదీ సంగతి...! ■

---




సాహిత్యాన్ని ప్రజలకు చేరువ చేయడంలో యువ భారతి కృషి విస్మరించరానిది. 38 వ వార్షికోత్సవాల సందర్భంగా డిసెంబరు 2002లో 'హాస్యలహరి' ఉపన్యాస కార్యక్రమాలు ఏర్పాటుచేసి 9 మంది హాస్య రచయితల గురించి మరొక 9 మంది రచయితల చేత మాట్లాడించారు. వాటిని పుస్తక రూపంలో వెలువరించారు. వాటిలో మొక్కపాటి వారి రచనల గురించి శ్రీ ఇంద్రగంటి శ్రీకాంతశర్మ ప్రసంగవ్యాసంలో కొంత భాగం:



శ్రీ శ్రీ గారు సిరిసిరిమువ్వ శతకంలో

క్షితిలో బారిష్టరు పా

ర్వతీశమును చెప్పి, పిదప పలుకవలె కదా

కిత కితల కితరులను, భా

సిత సిత సుళ్లోకుడతడు సిరిసిరిమువ్వా!

బారిష్టరు పార్వతీశం రెండు, మూడు భాగాలు రచనతో - ఆంధ్రజ్యోతి వారపత్రిక ఉద్యోగబంధం వల్ల - నాకు కొంత సంబంధం వుంది. రెండవ భాగం దాదాపు పూర్తిగానూ, మూడవ భాగంలో కొన్ని ప్రకరణాలు, మొక్కపాటివారు వాచికంగా చెపుతుంటే, కాయికంగా నేను రాసిపెట్టాను. కప్పగంతుల రాజేశ్వరిగారు కొంత రాసిపెట్టారు.

శాస్త్రిగారు చాలా స్థిమితం మైన వ్యక్తి. గుండ్రటి మనిషి. పొట్టిగా వున్నా పచ్చగా, కళగా వుండేవారు. నేను ఆయనతో కూర్చుని నవల రాసిపెట్టేనాటికి నాకు 26 ఏళ్లు శాస్త్రిగారికి 78. అయినా వయస్సు అరమరికలు ఏమివుండేవి కావు. ఆయన ఒక మనిషితో చనువు ఏర్పడినంత వరకు మితభాషి. నాతో చాలా చనువుగా వుండేవారు. ఛలోక్తులు, ఇంగ్లండులో కొన్ని అనుభవాలు, సాహితీ సమితి కబుర్లు, చలం మీద విసుర్లు, సరదీగా చెపుతూండేవారు. భారతీయ సంప్రదాయాలమీద ఎనలేని అభిమానం వున్నా, పాశ్చాత్య రచయితల్ని సహజంగా అభిమానించే వారు. అయన ప్రవృత్తిలోనే హాస్యం వుండేది. పంచె, తరచు పట్టులాల్చీ, కండువా, ధరించి- నుదుట చిన్నగా కనిపంచే కుంకుమ వహించి - స్వచ్ఛంగా, ఆరోగ్యంగా కనిపించే వారు. ఊతంగా చేతికర్ర వుండేది.

''బారిష్టర్ పార్వతీశం'' నవల మాత్రమే తెలిసిన వారికి మొక్కపాటి వారి రచనా వ్యక్తిత్వంలో ఒక పార్శ్వం తెలిసినట్టే లెక్క. ఆయన హాస్యేతర రచనల వైవిధ్యం కథలలో కనిపిస్తుంది. ఆ యన ఇతివృత్తమే ఆయన శైలి. చలం లాగ, మల్లాది, శ్రీపాద, - తరవాతి తరంలో బుచ్చిబాబుగారి లాగ విశేషశైలిని - అంటే కథన శైలిని - నిర్మించకపోయినా ఆయన కథల్లోని పాత్రలు, కల్పించిన వాతావరణం, మనోఘర్షణలు, ప్రకృతి పట్ల లాలస - మనల్ని ఆకర్షిస్తాయి.

మొక్కపాటి నరసింహశాస్త్రి గారి రచనలు చదివితే ఆయన హ్యూమనిస్ట్ అని మనకర్థమవుతుంది. ఆధ్యాత్మికత, దేశభక్తి తనలో నాగూఢంగా వున్న వ్యక్తి శాస్త్రిగారు.

ఆధునిక సాహిత్య యుగంలో - ముఖ్యంగా వచన సాహిత్యానికి - పరువూ, బరువూ చేకూర్చిన ఆదిగురువుల్లో నిస్సందేహంగా 'మొక్కపాటి' వారొకరు. ■



ప్రముఖ గాయకుడు, స్వరకర్త లలిత సంగీత విద్వాంసుడు, వాగ్గేయకారుడు

**ఎం.చిత్తరంజన్**

సమర్పిస్తున్న శీర్షిక ఇది.

ఫోన్ నెం. 040-7402993

# లలిత సంగీతం

## కడలిగ పొంగిన మనసున అలలు

కడలిగ పొంగిన మనసున అలలు
కమ్మని తావుల నీనే కళలు
మానవతాలత విచ్చిన విరులు
మధుర పరిమళ భావలహరులు

1. హరి పదమును విడి హిమనగమడుగిడి
సురఝురి కరుణను ధరణిని వడివడి
చిరు మొలకల విరితావుల నించిన
హరిత దిగంతర సీమలగాంచిన ॥కడలిగ॥

2. వేదననైనా వెలువడు రాగము
బాధలనైనా పలుకును కావ్యము
భావము భాషలు వేర్వేరైనా
పరవశమున మది చేయును నాట్యము ॥కడలిగ॥

3. భేదభావముల తొలగ చేయగా
ప్రేమతత్త్వమును ప్రోది చేయగా
ఆనందమునకు అమృత తత్త్వమునకు
ఆధారము కళ విశ్వజనీనము ॥కడలిగ॥



| | |
|---|---|
| రచన | : శ్రీమతి డా॥ఎం.పద్మినీదేవి |
| సంగీతం | : పి.వి.సాయిబాబా |
| గానం | : బృందగానం |
| రాగమాలిక | : అభోగి, హిందోళ, హంసానందిరాగాలు |
| తాళం | : చతురస్ర ఏకతాళం |
| **అభోగి** | |
| ఆరోహణ | : స రి గ మ ద స |
| అవరోహణ | : స ద మ గ రి స |
| | -షడ్జము, సాధారణ గాంధారం, శుద్ధమధ్యమం, శుద్ధ దైవతం, కైశికినిషాదం యీ రాగంలోని స్వరాలు |
| **హిందోళ :** | |
| ఆరోహణ | : స గ మ ద ని స |
| అవరోహణ | : స ని ద మ గ స |
| | - షడ్జము, సాధారణ గాంధారం, శుద్ధమధ్యమం, శుద్ధ దైవతం, కైశికినిషాదం యీరాగంలోని స్వరాలు. |
| **హంసానంది :** | |
| ఆరోహణ | : స రి గ మ ద ని స |
| అవరోహణ | : స ని ద మ గ రి స |
| | - షడ్జము, శుద్ధరిషభం, అంతరగాంధారం, ప్రతి మధ్యమం, చతుశృతి దైవతం, కాకలి నిషాదం యీ రాగంలోని స్వరాలు |

శాస్త్రీయ సంగీతంలోనే కాక లలిత సంగీతంలో కూడా ఎన్నో రాగమాలికా గీతాలున్నాయి. సాధారణంగా అధిక శాతం లలిత గీతాలకు స్వరకర్తలు శాస్త్రీయ, లలిత సంగీతాల్లో వాడుకలోవున్న రాగాలనే ఉపయోగించడం జరుగుతూంటుంది. లలిత సంగీతంలో అరుదుగా వాడబడేవి, శాస్త్రీయ సంగీతంలో బాగా ప్రచారంలో వున్నవి షణ్ముఖప్రియ, హంసానంది, అభోగి మొదలగు రాగాలు మేళవించి స్వరకర్త సాయిబాబా "కడలిగ పొంగిన మనసున అలలు" అనే పద్మిని రచనను చక్కని రాగమాలికగా రూపొందించగా ఆకాశవాణిలో ప్రసారమైంది. కళ దైవస్వరూపం. మనిషిలోని మానవత్వాన్ని జాగృతం చేసి దైవత్వాన్ని సందర్శింప చేసే కళకు భాష, మతం, జాతి, కులం అనే తేడాలు లేవు. ఆనందంలోను, బాధలోను కూడా హృదయంలో కలిగే స్పందన కళగా ఆవిర్భవిస్తుంది. అనిర్వచనీయమైన ఆనందాన్ని (రసానందం) కలిగిస్తుంది. కళా స్వరూపాలు వేరుకావచ్చును. కాని అవి యిచ్చే ఆనందం ఒకటే అన్నది ఈ పాట యొక్క సారాంశం.

### శ్రీమతి డా॥ఎం.పద్మినీదేవి

సుమారు నాలుగు దశాబ్దాలకు పైగా తెలుగు సాహిత్య రంగంలో ప్రముఖ కవయిత్రిగా పేరుగన్న శ్రీమతి పద్మినీదేవి కవి పండిత వంశమైన బుక్కపట్నం తిరుమల వంశంలో జన్మించింది. తల్లి కీ॥శే॥ రుక్మిణిమ్మ, తండ్రి కీ॥శే॥ నరసింహాచార్యులు జ్యోతిషశాస్త్ర పండితులు. 1930, 40వ దశకాలలో పెద తండ్రి కీ॥శే॥ బి.టి.రాఘవాచార్యులు గారు రచయితగా నాటక రంగానికి సేవ చేశారు. అప్పట్లో గూడవల్లి రామబ్రహ్మంగారి "కృష్ణ లీలలు" సినిమాకు రచయితగా పనిచేశారు. బాల గాయకుడుగా సాలూరు రాజేశ్వరరావును యీ చిత్రం ద్వారా కృష్ణ పాత్రధారిగా పరిచయం చేశారు.

పద్మిని చిన్నతనం నుండే కథలు, కవితలు రాయడం ప్రారంభించి పాఠశాలలోను, కాలేజీలలోను అనేక బహుమతులను గెలుచుకుంది. సంస్కృతం, తెలుగు భాషలతో





"భాషాప్రవీణ" పరీక్షలో ఆంధ్ర విశ్వవిద్యాలయం నుండి 1962లో యూనివర్సిటీ ఫస్టుగా ఉత్తీర్ణురాలయి ప్రతిష్ఠాత్మకమైన "వీరభద్రయ్య స్మారక బహుమతి" పొందినది. ఎం.ఎ. (తెలుగు), "తెలుగులో పంచతంత్ర కావ్యములు" అనే అంశంపై పరిశోధన చేసి పి.హెచ్.డి. పట్టాను పొందినది. 1969 నుంచి మూడు సంవత్సరాల పాటు ఆకాశవాణి విజయవాడ కేంద్రంలో స్క్రిప్ట్ రైటరుగా పనిచేసింది. ఆ సమయంలో ఆమె రాసిన లలిత గీతాలు, కథలు, నాటకాలు, స్వీయ కవితలు, సంగీత రూపకాలు ఆ కేంద్రం నుండి ప్రసారమైనాయి. శ్రీరంగం గోపాలరత్నం, వింజమూరి లక్ష్మి మున్నగువారు ఆమె పాటలు పాడేవారు. నాతో వివాహం జరిగిన తరువాత పద్మిని హైదరాబాద్‌లో సెయింట్ జోసఫ్ జూనియర్ కాలేజీలో తెలుగు లెక్చరర్‌గా స్థిరపడింది. హైదరాబాదు ఆకాశవాణి కేంద్రానికి విష్ణుచక్రం, యక్షగృహిణి, చంద్ర సరోవరం మొదలగు సంగీత రూపకాలను, అసంఖ్యాకమైన లలిత గీతాలను రచించింది. 1975లో అప్పటి ప్రధాని ఇందిరాగాంధి ప్రతిపాదించిన 20 సూత్రాలపై ఆకాశవాణి 2 సంవత్సరాల పాటు ఎన్నో గీతాలను "చైతన్యరథం" పేరిట ప్రసారం చేసింది. సుప్రసిద్ధ గాయని శ్రీమతి ఎస్.జానకి "వీరశంఖమెత్తవోయ్ విజయగీతి పాడవోయ్" అనే పద్మిని పాటను రమేష్‌నాయుడు సంగీత సారథ్యంలో గానం చేశారు. 'యక్షగృహిణి' సంగీత రూపకంలో గోపాలరత్నం పాడిన పాటలు (నా సంగీతం) శ్రోతలను ఆకట్టుకున్నాయి. పద్మిని పాటలు ఎక్కువగా నిర్మల్ కుమార్, ఉషాకాంత్, పాలగుమ్మి విశ్వనాథం, సాయిబాబా, సుధీర్‌కుమార్ వంటి స్వరకర్తలు స్వరపరిచినవి ఆకాశవాణిలో ప్రసారమైనాయి. పద్మిని రచించిన సంగీత రూపకం "కాలచక్రగమనంలో కపోతకల కూజితాలు" ఆకాశవాణి వార్షిక అవార్డులలో 1989 సంవత్సరానికి జాతీయ మెరిట్ సర్టిఫికెట్ పొందింది. "పారిజతాలు" (గేయాలు), 'స్పందన' (గేయాలు, పద్యాలు), "ముకుంద పదార్చనం" (పద్యకావ్యం) మొదలగునవి కరుణశ్రీ, ఉత్పల సత్యనారాయణాచార్యులు, డా॥పి.బి.శ్రీనివాస్ గార్ల పీఠికలతో ప్రచురితమైన పద్మిని గ్రంథాలు.

## పి.వి.సాయిబాబా

ఆకాశవాణి హైదరాబాదు కేంద్రంలో నిలయ మృదంగ విద్వాంసులుగా పనిచేసి కీ॥శే॥ పుచ్చా సుబ్బారావుగారి తనయుడు సాయిబాబా. తండ్రి గారివద్ద అనేక సంగీత విషయాలను అభ్యసించి, రాగాలను లలిత సంగీతానికి అన్వయించడం, స్వరరచన చేయడం మొదలగు అంశాలపై దృష్టిసారించి, అనుభవం గడించి ఎన్నో లలిత గేయాలకు బాణీలను కూర్చాడు. సాయిబాబా తండ్రి గారి వద్ద నేను కూడా సంగీత, లయ సంబంధమైన విషయాలలో శిక్షణ పొందాను. చిన్నతనం నుండే ఆకాశవాణిలో బాలానందం కార్యక్రమాలలో పాడుతూ, అనేక



పాటల పోటీలలో పాల్గొని బహుమతులు పొందాడు సాయిబాబా. సుప్రసిద్ధ కవి వానమామలై వరదాచార్యుల వారు రచించిన "విప్రలబ్ధ" సంగీత రూపకానికి చిన్న నాటనే సంగీతం కూర్చి పెద్దల

'హాసం' ఫిబ్రవరి 1-15, 2002 సంచికలో తెలుగు చిత్రాలలోని కొన్ని రాగమాలికా గీతాలను పేర్కొనడం జరిగింది. ఏప్రిల్ 1-15, 2002 సంచికలో హిందోళ రాగం ఆధారంగా కొన్ని చిత్ర గీతాలను పేర్కొన్నాము. ఈ సంచికలో హిందోళ, హంసానంది రాగాల ఆధారంగా కొన్ని...

| పాట | చిత్రం | గానం | సంగీతం |
|---|---|---|---|
| **హిందోళ** | | | |
| 1. ఓంనమశ్శివాయ | సాగరసంగమం | ఎస్.జానకి | ఇళయరాజా |
| 2. రాజశేఖరా నీపై మోజు తీరలేదురా (కొంతభాగం) | అనార్కలి | ఘంటసాల, జిక్కి | ఆదినారాయణరావు |
| **హిందీ (మాల్‌కౌంస్ రాగం ఆధారంగా)** | | | |
| 1. మన్‌తడ్‌పత్‌హరి దర్‌శన్ కో ఆజ్ | బైజూబావ్‌రా | రఫీ | నౌషాద్ |
| 2. నిర్బల్‌సేలడాయి బల్‌వాన్‌కీ | తూఫాన్ ఔర్‌దియా | మన్నాడే | వసంత్‌దేశాయి |
| **హంసానంది** | | | |
| 1. వేదం అణువణువున నాదం | సాగర సంగమం | శైలజ, బాలు | ఇళయరాజా |
| 2. హాయిహాయిగా ఆమని సాగే (కొంతభాగం) | సువర్ణసుందరి | ఘంటసాల, జిక్కి | ఆదినారాయణరావు |
| 3. పుట్టబోయెడి బుల్లి బుజ్జాయి కోసమై (కరుణశ్రీ పద్యం) | ప్రైవేటు రికార్డు | ఘంటసాల | ఘంటసాల |

ఆశీస్సులు, మన్ననలు పొందాడు. 'స్వర తరంగిణి'' అనే సాంస్కృతిక సంస్థను ప్రారంభించి స్థాపక కార్యదర్శిగా వుంటూ అనేక సభలలో కేవలం లలిత సంగీత కార్యక్రమాలనే నిర్వహిస్తూ మంచి పేరు పొందాడు. ఆయా సభలలో ఎంతో మంది ప్రముఖ గాయనీ గాయకులను సత్కరించాడు. వారిలో శ్రీరంగం గోపాలరత్నం, నేను కూడా వున్నాము. అతని సంగీతంలో నేను కూడా చాలా పాటలు పాడాను. "హంసధ్వని" అనే మరొక సంస్థను నెలకొల్పి యితర ప్రాంతాల నుండి అభివృద్ధిలోకి వస్తున్న వారిని పిలిపించి పాడించేవాడు. సినీ ప్రముఖులైన ఎస్.పి. బాలసుబ్రహ్మణ్యం, ఎస్.జానకి, యస్.పి.శైలజ గార్లు సాయిబాబా నిర్వహించిన కార్యక్రమాలలో పాల్గొని అతని పాటలను పాడారు. 'కళాసాగర్' అనే ప్రసిద్ధ సంస్థ మద్రాసులో 'పి.వి.సాయిబాబా లలిత సంగీత విభావరి' కార్యక్రమాన్ని ఏర్పాటు చేయగా అందులో ప్రముఖ నేపథ్య గాయకులు ఎస్.పి. బాలసుబ్రహ్మణ్యం, ఎస్.జానకి, యస్.పి.శైలజ పి.సుశీల, రామకృష్ణ, జి.ఆనంద్, ఎం.రమేష్ ప్రభృతులు పాల్గొని విజయవంతం గావించారు. కీ॥శే॥ఎల్.వి.ప్రసాద్ గారి సత్కారాన్ని కూడా పొందాడు సాయిబాబా. 1972 నుంచి ఆకాశవాణిలో గాయకుడుగాను, 1976లో స్వరకర్తగాను గుర్తింపు పొంది నేటి వరకూ అసంఖ్యాకంగా లలిత గీతాలకు కర్ణపేయమైన సంగీతాన్ని అందిస్తూ ఎంతోమంది గాయనీ గాయకులను తీర్చిదిద్దాడు. అతనివద్ద శిక్షణ పొంది పేరు గాంచిన వారిలో కె.రామాచారి, శశికళ, సురేఖ, చంద్రకాంత మొదలైన వారున్నారు. ఎ.వి.ఎం. వారు రూపొందించిన భక్తి గీతాల క్యాసెట్ 'రామధ్యానసాగరము'', యింకా 'భావగీతాలు', 'సాయి భజనలు', 'సాయిశృతి', 'ప్రతివారమూ గురువారమే' మొదలగు క్యాసెట్లు సాయిబాబా సంగీత సారథ్యంలో వెలువడినాయి. ప్రముఖ రేడియో, సినీ గాయకులు వాటిలో పాడారు. 1995లో ఆకాశవాణిలో గ్రేడ్-1 కంపోజర్‌గా గుర్తింపు సాయిబాబాకు లభించినది. లలిత సంగీతానికి నిరంతరం సేవలందిస్తున్న ప్రముఖ స్వరకర్త సాయిబాబాను రసమయి, యువ కళావాహిని, రాగమాధురి మున్నగు సంస్థలు ఘనంగా సత్కరించాయి.


హాసం హాస్య-సంగీత పత్రిక

పాత సంచికలు కావలసిన వారు కాపీకి రూ॥ 10-00 చొప్పున మాకు పంపి పోస్టులో తెప్పించుకొనవచ్చును. లేదా మా ఆఫీసులో నేరుగా గాని, స్థానిక మార్గదర్శి (ఈనాడు గ్రూప్పు) ఏజెంటు ద్వారా గానీ 10 శాతం డిస్కౌంట్ సౌకర్యంతో పొందవచ్చును.



హాసం

కాపీలు దొరటకం లేదా? స్థానిక మార్గదర్శి ఏజెంటును (ఈనాడు గ్రూప్పు) అడగండి.


చదువులావు
మా ఇంట్లో వాటర్ ప్రోబ్లమే లేదు. కావస్తే చూడు

# 'హాసం' ద్వారా ఉగాది శుభాకాంక్షలు తెలుపండి

తెలుగు నూతన సంవత్సర సందర్భంగా ఓ మంచి నిర్ణయం తీసుకోండి. హాస్య సంగీతాభిమానులైన మీ బంధుమిత్రులలో ఓ 10 మందికి (ఇతర రాష్ట్రవాసులయితే మరీ మంచిది) 'హాసం'ను పరిచయం చేయండి. దానికి గాను మీరు చేయవలసినది వెరీ సింపుల్-మీరు ఎంపిక చేసిన ఆ 10 మంది పేర్లను ఈ కింది కూపన్‌లో నింపి - **హాసం, హాస్య-సంగీత పత్రిక**, 502, Sri Balaji Nilayam, 13-2-212, B.S.P. Colony, Motinagar, Hyderabad- 500 018 అడ్రసుకు వెంటనే పంపండి.

**మీ తరపున ఉగాది శుభాకాంక్షలు తెలుపుతూ వారికి ఏప్రిల్ 1-15, 2003 సంచికను ఉచితంగా పంపుతాం.**

**Name** :
**Address** :
Ph: e-mail ID :

**Name** :
**Address** :
Ph: e-mail ID :

**Name** :
**Address** :
Ph: e-mail ID :

**Name** :
**Address** :
Ph: e-mail ID :

**Name** :
**Address** :
Ph: e-mail ID :

**Name** :
**Address** :
Ph: e-mail ID :

**Name** :
**Address** :
Ph: e-mail ID :

**Name** :
**Address** :
Ph: e-mail ID :

**Name** :
**Address** :
Ph: e-mail ID :

**Name** :
**Address** :
Ph: e-mail ID :

మీ సంతకం ..................................
పేరు :
చిరునామా:

ఫోన్ : ఈమెయిల్ ఐడి :

**గమనిక**
మీరు పంపదలచిన 10 అడ్రసులను haasammag@hotmail.comకు ఈ-మెయిల్ ద్వారా పంపవచ్చును.

# దిసీజ్ ఖర్మ... దట్సాల్...!

సత్యమూర్తి BV



'ఆహో ఓహో ఏమి నిగ్రహం' అని తన స్నేహితులు ఉబ్బేస్తుంటారు, తాము మందు ముట్టుకోమని అనగానే



'ఖర్మ... ఇందుకా అంత తైరు కొట్టేరు' అని వాపోవడం మీ వంతవుతుంది.



తన గర్ల్‌ఫ్రెండ్ ఎదుట తన ప్రతాపాన్ని చూపించుకోవచ్చని,-తన గర్ల్ ఫ్రెండ్‌ని ఏడిపించిన వాడితో ఫైట్ చేస్తాడు హీరోలా.




ఆ దెబ్బలు తిన్నవాడు-ఆ ఊళ్లో పేరు మోసిన గూండా కొడుకని ఇప్పుడు తెలుస్తుంది.



దేముడి ఫోటోలతో ఉన్న కవర్ వస్తుంది. 'ఆహో.... ఈ వేళతో నా కష్టాలన్నీ గట్టెక్కాలని దేముడు అనుగ్రహిస్తున్నాడులాగుంది' అని మీరనుకుంటారు.



'ఆ కవరులో వెయ్యి మందికి ఈ ఉత్తరాన్ని కాపీ చేసి, పోస్ట్ చేయాలి, లేక పర్సనల్‌గా డెలివరీ చేయడం ఉత్తమం. లేకపోతే నీకు ఘోరమైన కీడు జరుగుతుంది' అని ఆ ఉత్తరంలో ఉంటుంది.

## జరిగిన కథ

అజయ్ అనే శ్రీమంతుడు, విజయ్ అనే పేదవాడు ఒక ఏడాదిపాటు తమ తమ స్థానాలను మార్చుకోవాలని నిశ్చయించుకుంటారు. అజయ్ స్థానంలో వచ్చిన విజయ్ మేనేజర్ భానోజి మోసం చేస్తున్నాడని గమనించి అతని కూతురు సరళతో ప్రేమ నటిస్తాడు. కానీ ఆమె తనంటే నిజంగా ఇష్టపడుతోందని అనిపిస్తుంది అతనికి. భానోజీ అనుచరులను ఉద్యోగంలోంచి తీసేసి, దుబారా తగ్గిస్తూ, భానోజికి ముకుతాడు వేస్తూంటాడు. విజయ్ స్థానంలో వచ్చిన అజయ్ చెల్లెలు మీనా కాపురం సరిదిద్దే ప్రయత్నంలో బావ బుజ్జిని బెదిరిస్తాడు. బుజ్జి భార్యను కలవడానికి చాటుగా వస్తూంటాడు. మోటారు మెకానిక్‌గా పని చేస్తున్న అజయ్‌కు తన కొలీగ్ ప్రకాష్ చెల్లెలు పద్మతో ప్రేమలో పడతాడు. భార్యను కలిసి వస్తున్న బుజ్జి తండ్రి కళ్లల్లో పడుతూంటే, తల్లి కాపాడుతుంది.

(ఇక చదవండి)

# అన్నపూర్ణా వారి ఇద్దరు మిత్రులు



## సీరియల్ - నెం 13

**రచన : ముళ్లపూడి వెంకటరమణ**



సాయంకాలపు నీరెండలో, డాబా మీద కూర్చొని సరళతో కబుర్లు చెబుతూ, నవ్వుతూ, నవ్విస్తూ, కాఫీ ఫలహారం తీసుకున్నాడు విజయ్.

"పగలూ, రాత్రీ ఇలా పనిచేసి, ఆరోగ్యం చెడగొట్టుకుంటారా? ఏ పార్కుకో పోయి హాయిగా కాస్సేపు తిరిగొద్దాం, రాకూడదూ?" అంది సరళ, అదునూ పదునూ చూసి మెల్లిగా.

"నీకు తెలియదు సరళా! నెత్తిమీద బోలెడంత పని-మనసులో పుట్టెడు దిగులు. సరదాలు, షికారులూ అంటే వుత్సాహం ఎక్కణ్ణించి వస్తుంది?" అన్నాడు విజయ్ నిట్టూర్చి.



"అదేమిటి అజయ్‌బాబూ! మీకు దిగులేమిటి?"

"నీ కర్థం కావు సరళా! అన్నీ డబ్బు చిక్కులు. ఇన్‌కంటాక్సు బాకీలు-ఏవేవో..."

"ఈ మాత్రానికే మనసు పాడుచేసుకుంటారా... మీ కభ్యంతరం లేకపోతే, నా నగలన్నీ యిచ్చేస్తా, తీసుకోండి!"

"నీ నగలిస్తావా?" అన్నాడు విజయ్ సంభ్రమాశ్చర్యాలతో.



సరళ, విజయ్ కళ్ళలోకి సూటిగా చూసింది. ఆమె చూపు, మాటలాగే తేటగా వుంది.!

"ఏం? ఎందుకివ్వగూడదూ!".. ఈనాడు మేము ఈ స్థితిలో ఉన్నామంటే, అంతా మీ నాన్నగారి చలవకాదూ? మీ నీడనే పెరిగాం, మా సర్వస్వం మీదే" అంది.



"సరళా!" అన్నాడు విజయ్ ఆశ్చర్యంగా.

ఆమె స్వరంలో, పలుకులో చిత్తశుద్ధి, కృతజ్ఞత కనిపించాయి విజయ్‌కి.

"మీ ఆపదకు ఆదుకోని ఈ నగలూ, నాణ్యాలూ నా కెందుకు చెప్పండి"

"మీ నాన్న గారికి తెలిస్తే?" అన్నాడు విజయ్.

"తెలియనవసరం లేదు. నా నగలేగా!"



విజయ్ నవ్వాడు. "అలా అంటే ఎలా? నిన్ను బంగారంలో ముంచెత్తాలని మీ నాన్నగారు తాపత్రయపడుతూంటే-"

"అదంతా ఆయన పిచ్చి. ఒక్కగానొక్క కూతుర్ని గదూ-అందుకూ అంత మమకారం. కాని, నాకు నగలూ, డబ్బూ, హోదా అలాంటి వ్యామోహాలు లేవు అజయ్‌బాబూ" అంది సరళ నిర్వికార స్వరంతో.



విజయ్‌కుమార్ ముగ్ధుడయి పోయాడు. భానోజీ గారి పట్ల తనకు గల అభిప్రాయాలను బట్టి, సరళ తత్వాన్ని గూడా పరీక్షించబోయినందుకు బాధపడ్డాడు.

"మాటవరసకన్నాను సరళా!

అంత అవసరం వచ్చినపుడు, నీ సహాయం తప్పకుండా తీసుకుంటాను. పోదాం పద. అలా వెళ్ళి గాలిపీల్చుకు వద్దాం" అన్నాడు లాలనగా.

వాళ్ళిద్దరూ మేడ దిగి కారెక్కి షికారు వెళ్ళగానే, లచ్చి లోపలికి పరుగెత్తింది.

"చిన్న దొర, చిన్నమ్మా మోటారు మీద యాడకోపోతుండరమ్మో!" అంది పెద్దమ్మగారి దగ్గరకెళ్ళి.

"అలాగా!" అంది అత్తయ్య. ఆవిడ మనసు చివుక్కుమంది...

* * *



బయట కారాగిన చప్పుడు విని, తలెత్తి చూసింది పద్మ-ఎవరా అని. ఎవరో తెలిసి సంతోషంగా చూసింది వాలకం వేషం గమనించి వింతగా చూసింది. లేచి వరండా చివరకివచ్చి నవ్వి చెయ్యందించి, హేళనగా ఎగాదిగా చూసింది. కారు దిగిన అజయ్ ఆమె చేయూతతో అరుగు మీద కెగిరి ఏమిటా చూపు అన్నాడు.

పద్మ పకాలున నవ్వింది.

"అంత నవ్వు వచ్చే సంగతేమిటో?"

"ఆఁ ఏంలేదు ఆ సిల్కు షర్టు, ఫులెన్ పాంటు, షూసు ఓహోహో, పిల్లజమీందారులా వున్నావు." అంది పద్మ నవ్వాపుకొని.

"రైట్ అలాగే అంటూవుండు. ఒకనాటికి నేను జమీందారునే అయిపోతాను" అన్నాడు అజయ్, కుర్చీలో వెనక్కి జేరబడి కాళ్ళు బారచాపి కూర్చుంటూ.



"కోరికలే గుర్రాలైతే-"

"మనం వాటిమీద స్వారీ చేస్తాం. అప్పుడు ఈ రాణీ సాహెబా-" అంటూ పద్మ బుగ్గమీద చిటిక వేశాడు అజయ్.

"ఆ.ఆ. శ్రుతి మించుతోంది... అన్నయ్యా అన్నయ్యా!"

"అన్నయ్యా? వస్తాడులే రాత్రి భోజనానికి" అన్నాడు అజయ్‌నవ్వి.



"అదేమిటి. సాయంకాలం నా డ్యాన్సుకి రాడా?"

"ఏమో నాకేం తెలుసు! బ్రదర్ ఈ పూట చచ్చేటంత చాకిరీ వుందీ-సాయంత్రం డాన్సు పెర్ఫార్మెన్సుకి పద్మను నువ్వు వెంట బెట్టుకు వెళ్ళు అని మరీ మరీ రిక్వెస్టు చేశాడు. ఏం చేస్తాం ఫ్రెండు గదాని సరే అనేశాను."

పద్మ నవ్వింది. ఒక్క క్షణం ఇద్దరూ మౌనంగా ఉండిపోయారు. తరువాత ఏం జోకు వెయ్యాలో తోచక.



"ఏమిటో విజయ్. ఇంతకాలం కష్టపడి అన్నయ్య నాకు చదువు చెప్పించాడు. నాక్కూడా ఏదైనా ఉద్యోగం దొరికితే..." అంది పద్మ సాలోచనలోచనలతో.

"వొద్దులే బాబూ. మా మగాళ్ళకే వుద్యోగాల్లేక చస్తున్నాం. ఇహ మీ ఆడపిల్లలు గూడా ఎగబడితే, చెప్పనా మా అవస్థ!"

తను మనసిచ్చినవాడి మనసు ఇదా అని ఉలికిపడి చూసింది పద్మ.

"ఏం విజయ్, నేను ఉద్యోగం చేయడం, నీ కిష్టం లేదా?"

అజయ్ నవ్వి, ఆమె భుజం తట్టాడు. "ఊరికే అన్నాను పద్మా! నాకెందు కిష్టముండదు? నీకు ఉద్యోగం వస్తే, నాకు మంచి పార్టీ ఇస్తావుగా! ఊఁ లేఁ ! టైమవుతోంది. బయల్దేరు" అన్నాడు.



సేవాసదన్‌కి చేరేసరికి ఆలస్యం అయింది. హాలు టాపు ఊడి చాలా యెత్తుగా వుంది. అదేవిటంది పద్మ. "ఇంకా ఉపన్యాసాలవుతున్నాయి కాబోలు! టాపు లేచిపోతోంది. నువ్వెళ్ళి డ్యాన్సు ఆరంభిస్తేగాని, హాలు కుదురుపడదు" అన్నాడు అజయ్. పద్మ కిలకిల నవ్వింది. ఆమె నృత్యం ఆరంభించడంతో, హాలు కుదురువడడంతో ఆగలేదు.



మంత్రముగ్ధం అయినట్టు కూర్చుంది. అజయ్ సగర్వంగా ముందు వరసలో కూర్చుని, చూసి ఆనందిస్తున్నాడు.

**ఓహో ఫేషన్ల సీతాకోకచిలుక**
**ఉన్నమాటంటేనే ఇంత ఉలుక**
**నీకు గోళ్ళపైన సీమరంగు మక్కువ**
**మన గోరింటాకు పేరంటేనే లోకువ**
**ఎన్నో షోకులు చేస్తావు - పెదవికి లిప్‌స్టిక్ వేస్తావు**
**మన తాంబూలం - అయ్యో పరువు తక్కువ**



**నేడు అమ్మాయి కూడ తొడుగుతుందిఫుల్‌పేంట్**
**అహ! అబ్బాయ్ గారికి రవికెల గుడ్డ బుష్‌కోట్**
**పాతవేషం మారింది - కొత్త ఫేషన్ వచ్చింది**
**అయ్యో! ఆడా మగా తేడా ఎగిరిపోయింది**
**నీవు విచ్చలవిడిగా ముచ్చటతీరా వుంటావు**
**నీవు నచ్చినదల్లా నాగరికతయే అంటావు**



**చీర ఉలిపొర జార్జెట్ నాగరికతయే అంటావు**
**నీకు హద్దూ పద్దూ లేకపోతే నవ్వులపాలవుతావ్**

ఫాషన్‌ల సీతాకోక చిలుకల మీద పద్మ విసుర్లు విసిరినపుడల్లా, హాలులో అటూ ఇటూ వున్న చిలకలకేసి చూస్తున్నాడు. ఓసారి చూసేసరికి విజయ్, సరళా కనిపించారు. తన సీటుకేసి వస్తున్నారు. దిగ్గునలేచి,



రెండోవైపునుంచి బయటకు జారుకున్నాడు అజయ్. అంతకన్న మార్గం మరోటి లేదు. ఇంకో నిముషం తరువాత స్టేజీ మీద నృత్యం చేస్తున్న పద్మ, ముందు వరసలో విజయ్ కోసం చూసి ఉలికిపడింది. అతని పక్కన యెవరో అమ్మాయి! పైగా అటు తిరిగి నవ్వుతూ మాట్లాడుతున్నాడు... పద్మకి ఒళ్లు జలదరించింది. ఆ తరువాత నృత్యం



యెలా ముగించిందో, ఇంటికి ఎప్పుడెలా చేరుకుందో ఆమెకు తెలీదు. ఇంటి దగ్గర అన్నయ్యను చూడగానే భోరున ఏడిచింది పసిపిల్లలా. అతను విస్తుపోయాడు. కాని పద్మ మాట మీద గురి కుదరలేదు.

"విజయ్ ఇలాటి పని చేశాడంటే నమ్మ లేకుండా వున్నాను" అన్నాడు.

"నా కళ్ళ ముందు జరిగిందే నువ్వు నమ్మనంటే, నే నేం చెప్పనన్నయ్యా!"



"నువ్వు తొందరపడకు పద్మా! ఇందులో ఏదో పొరబాటు ఉంది. విజయ్‌నినేను కనుక్కుంటాను" అన్నాడు ప్రకాష్.

మాటలోనే అజయ్ అక్కడ ప్రత్యక్షమయ్యాడు. "మైగాడ్! నువ్వు ఇంటికొచ్చేశావా? నీకోసం వెతికి వెతికి, కాళ్లు పీక్కుపోయాయి. తెలుసా?" అన్నాడు.

పద్మ ముఖం ముకుళించింది. లేచి, తల వంచుకుని చరచరా లోపలికి వెళ్లి తలుపు వేసుకుంది.

అజయ్ తెల్లబోయాడు. "అదేమిటి ప్రకాష్! పద్మ అలా వెళ్ళిపోయింది?" అన్నాడు.



"ఏమీ ఎరగనట్టు అలా అడుగుతావేం విజయ్? పద్మ మనసు చాలా సున్నితమైంది. నీ మీద ఎన్నో ఆశలు పెట్టుకుంది. చివరికిదా నువ్వు చేసేపని?"

"ఇంతకూ ఏమిటి ప్రకాష్ నువ్వంటూన్నది?"

"థియేటర్‌లో ఎవరో అమ్మాయిని పక్కన కూర్చోబెట్టుకున్నావుట. నిజమేనా?" అన్నాడు ప్రకాష్ సూటిగా.

"ఓ అదా!" అంటూ నవ్వాడు అజయ్.



"నువ్వుగూడా అలాగే అనుకున్నావా ప్రకాష్! పక్కన సీటు కాళీగా ఉంటే, ఎవరో అమ్మాయి కూర్చుంది. లేచిపొమ్మంటే వూరుకుంటుందా? పైగా టికెట్ కొనుక్కొచ్చింది. మనలాగా ఫ్రీపాసు కాదు."

"ఆ! అంతేనా!"

"ఊఁ అంతే. నువ్వు పద్మకన్నయ్య వనిపించావు. చాల్లేల్లే. ఊరుకో" అన్నాడు అజయ్. ఉత్తరక్షణంలో గదితలుపు నెమ్మదిగి సిగ్గుపడుతూ తెరుచుకుంది. ఇంకోక్షణంలో తలుపవతల పద్మ మొహం వికసించింది. ఇంకో క్షణంలో పద్మలోచనలు విప్పారి, పద్మాప్తుడిని చూశాయి...

ఆ క్షణాన, అతని సంజాయిషీ ఆమె పూర్తిగా నమ్మినా, అందులో సగమే నిజమనీ, మిగతా సగం నిజంలో దుర్భేద్యమైన రహస్యం ఏదో దాగివుందనీ ఆ మర్నాడుగాని పద్మకు తెలియలేదు. ఆనాడు ఆమె ఉద్యోగం అన్వేషిస్తూ, అజయ్‌బాబు బంగళాకి వెళ్ళింది. పర్సనల్ సెక్రటరీ పని కాళీ ఉందని ప్రకటన చేశారు వారు. హాలులో భానోజీగారు కనిపించారు. సర్టిఫికేట్లు చూసినా, మానినా,





అమ్మాయిని మాత్రం పరీక్షగా చూశారు. ఇలాంటి పిల్ల దరఖాస్తుచేస్తే, పడుచు పిల్లడు అజయ్ ఉద్యోగమే ఇస్తాడో, అర్థరాజ్యమే ఇస్తాడో... ఎవడి బుద్ధి ఎలా వక్రిస్తుందో?

"ఉహుఁ పావం కష్టపడి వచ్చారుగానీ, లాభం లేదమ్మా..." అన్నాడాయన.

"మీరు ప్రకటనలో వేసిన అర్హతలన్నీ నాకు వున్నాయండీ దయచేసి..." అంది పద్మ.

"నిజమే. కాని మాకు కావలసింది ఆఫీసు అనుభవంవున్నవాళ్లు. కొత్త గ్రాడ్యుయేట్స్ కాదు. మీరు వెళ్ళి రావచ్చు."

పద్మ దిగాలుపడిపోయింది.

అంతలో 'విజయ్' అటు వచ్చాడు. పద్మ అతన్ని చూసి గతుక్కుమంది. అతను తనను పలకరించలేదు.

"ఈవిడెవరు?" అన్నాడు హుందాగా.

'ఈయన విజయ్ కాదన్నమాట. ఇలాగే ఉన్న ఇంకో గిజయ్ ఇక్కడ యజమాని కాబోలు' అనుకొంది పద్మ.



"ఆఁ ఎవరో ఒక అప్లికెంట్ లెండి-మిస్ పద్మ" అన్నారు భానోజీగారు లేచి నిలబడి.

"ఎస్ ఎస్. మిస్ పద్మ! మీ అప్లికేషన్ జ్ఞాపకం ఉంది. బి.కామ్. పాసయ్యారు గదూ?" అన్నాడు విజయ్.

"అవును సార్. ఫస్ట్‌క్లాసులో" అంది పద్మ వినయంగా.

"గుడ్. టైపు, షార్టుహేండ్ వచ్చుగదా?"

"వచ్చండి. రెండూ హయ్యర్ పాసయ్యాను."

భానోజీగారు పొడి దగ్గు దగ్గి ఏదో చెప్ప బోయారు.

విజయ్, అవకాశం ఇవ్వలేదు.



"వెరీగుడ్, ఇకనేం?కావాలిసిన క్వాలిఫికేషన్స్ అన్నీ వున్నాయి... భానోజీగారూ, ఈవిడను పర్సనల్ సెక్రటరీగా తీసుకుందాం" అన్నాడు.

"తీసుకోవచ్చు. కానీ...ఆఫీసు పని బొత్తిగా..."

"దానికేముంది, నాలుగు రోజులు పనిచేస్తే, అదే అలవాట వుతుంది... వెంటనే అప్పాయింట్‌మెంటు ఆర్డరివ్వండి."

"థాంక్స్" అంది పద్మ-హృదయపూర్వకంగా.

"ఆల్‌రైట్. రండి అర్జెంట్ లెటర్సు వున్నాయి. డిక్టేటు చేస్తాను" అంటూ తన గదిలోకి సాగి పోయాడు విజయ్.

భానోజీగారు నివ్వెరబోయి, చాలా సేపు అలాగే నిలబడి పోయాడు.



పద్మచేరడం ఆయనకి తప్ప, అందరికీ ఆనందమే కలిగింది. ముఖ్యంగా సిబ్బందికి- అందులో వరహావతారంగారికి.

"శేషంగారూ! చూశారా! చూశారా! ఆ స్పీడు... అవి చేతివేళ్ళా-మెరుపు తీగెలా?...అబ్బ" అన్నాడాయన ముగ్ధుడైపోయి.

హెడ్ గుమాస్తాగారి సౌందర్య పిపాస సాహిత్యాభిరుచి కింది గుమస్తాల దగ్గర పబ్లీకున బయట పడేవి కావు.

"ఉహుఁ. నీకూ పుట్టిందీ దుర్బుద్ధి. అలా వాగితేనేగా కూర్మం గాడికి ఆ గతిపట్టింది. వెళ్లు వెళ్లు, వెళ్లవయ్యా, యూస్లెస్ టాక్సూ మీరును" అన్నాడాయన చురచురచూసి.



సాయంకాలం ఆనందాశ్చర్య సంభ్రమాలతో, సిగ్గుతో, బాధతో ఉక్కిరి బిక్కిరై కూర్చుంది పద్మ. అన్నయ్యా; "విజయ్" వచ్చే వేళైంది. మొన్న డాన్సు హాలులో, తను అనవసరంగా "విజయ్"ని అనుమానించింది. అతను ఎంచేతో తను కాదనీ, తనక్కడలేడనీ చెప్పకుండా, ఎవరో పిల్ల తనపక్కన కూర్చుందన్నాడు. నిజానికి అక్కడ కూర్చున్నది అజయ్‌బాబుగారన్నమాట. ఇదంతా ఇపుడు "విజయ్"కి ఎలా చెప్పాలో తేల్చుకోలేక, సతమత మవుతూ కూర్చుంది పద్మ.

అజయ్ ఒక్కడే వచ్చాడు. వస్తూనే హేళనగా నవ్వి, తలెగరేశాడు మొన్నటి తన అలకగురించి దెప్పిపొడవడం ఇంకా మానలేదు



**"హలో హలో ఓ అమ్మాయి, పాత రోజులు మారాయి-ఆడపిల్లా అలిగినచో-వేడుకొనడా అబ్బాయి"**

పద్మది పంతానికి పై చెయ్యి. **కోత లెందుకు పోవోయి** అంటూ శ్రుతి కలిపి పాటవరస అందుకుంది.

**హలో హలో ఓ అమ్మాయి-పాతరోజులు మారాయి ఆడపిల్ల అలిగినచో-**
**వేడుకొనడు అబ్బాయి**
**ఒహో బడాయి చాలోయి-కోతలెందుకు పోవోయి**
**ఆది నుంచీ లోకంలో-ఆడవారిది పైచేయి**
**నిజానిజాలు తెలియకనే-నిందవేసే పొరపాటు**
**నాటికీ నేటికీ-మీకు అలవాటే**
**బెట్టు చేసే మగవారి-గుట్టు మాకు తెలుసోయి**
**మనసులో మమతలు-పైకి రోషాలు**
**లడాయి చేసే స్త్రీజాతి-రాకమానదు రాజీకి**
**గెలుపుకోసం మగవారు- కాళ్ళబేరము లాడకపోరు.**
**హలో హలో ఓ అమ్మాయి అందుకొనుమా నా గుడ్‌బై**





పాటవరసను బట్టి మాటవరసకన్నా "గుడ్‌బై" నిజంగాననే కొట్టి పోబోయాడు అజయ్.

"మహాశయా, వెళ్ళేముందు ఒక్కమాట వినిపోండి" అంది పద్మ.

అతను కేవలం వినిపోవటాని కన్నట్టు ఆగాడు.



"నాకు ఉద్యోగం దొరికింది."

"ఎక్కడా?" అంటూ, ఆశ్చర్యంగా వెనక్కి తిరిగి వచ్చాడు అజయ్.

"తమ ఇంట్లోనే" అంది పద్మ తమాషాగా నవ్వి.

"ఏం వేళాకోళంగా ఉందా?"

"కాదు నిజం అజయ్‌బాబుగారని, ఒక జమీందారు. వారికి పర్సనల్ సెక్రటరీ. ఆయన అచ్చం మీలాగే వున్నారు. డాన్సులో వారిని చూసే మిమ్మల్ని అనవసరంగా అనుమానించాను... ఏమిటి ఆలోచిస్తున్నారు?"

"అంత పెద్దవాళ్ళ దగ్గర దొరకడం మంచిదే. కాని, ఇక యీ సామాన్య మానవుడు నీ కళ్ళకు కనిపిస్తాడా అని..." ఆమె వంక చూశాడు అజయ్ ఆమె కళ్లు చురచుర చూశాయి.

"ఎందుకేనా మంచిది, కొంచెం జాగ్రత్తగా వుండు. ఎప్పుడైనా వారే నేను అనుకొని-"



"-వెంటబడతాననుకున్నారా?"

"ఒకసారి పొరబడ్డావు చూడు. మళ్లీ-" అంటూ నవ్వాడు అజయ్

"షటప్" అంది పద్మ.

వెంటనే ఆమె నోరు మూసేశాడు అజయ్.

* * *



"నోరు తెరూ!" అన్నాడు బుజ్జి మీనా పక్కచేరి.

మీనా మొహం అటు తిప్పుకుంది.

"నీ కేం తెచ్చానో తెలుసా? చెప్పుకో చూద్దాం."

మీనా చూడబోయింది. చేతిలో పొట్లం వెనక్కి పెట్టేశాడు బుజ్జి.

- (ఇంకావుంది)



ఈ సినిమాలో ఇద్దరు నాగేశ్వరరావులూ ఒకే దృశ్యంలో వున్నా ఒకప్పుడు ఒకరి ముఖం, రెండో వారి వీపు కనబడతాయి. అలాంటి దృశ్యాలకు (వీపు చూపే నాగేశ్వరరావు పాత్రకు) జగన్నాధరావు అనే నటుణ్ణి తీసుకున్నారు. అలాంటి నటుణ్ణి 'డ్యూపు' అంటారు. మదరాస్ షూటింగ్‌ల్లో అతనే నటించాడు. ఆయన మేకప్‌లో నాగేశ్వరరావుగారిలాగానే వుండేవాడు. కను చీకట్లో సెట్ బయట కూచున్న ఆయన్ని చూసిన ఒక తారామణి నాగేశ్వరరావుగారనుకొని - కాని, 'డ్యూపు' నాగేశ్వర రావు నిర్ఘాంతపోయాడు.

హైద్రాబాద్ షూటింగ్‌కు మదరాస్ నించి అతణ్ణి ఎందుకు తీసుకువెళ్ళాలి అక్కడే ఎవర్నయినా చూద్దాం అనుకున్నారు. కాని ఆ వేషం నాకు దక్కింది. శ్రీ నాగేశ్వరరావుగారు మరో నాగేశ్వర రావును తీసుకుని రిట్జ్ హోటల్‌కు తీసుకువెళ్లే షాట్‌లో కూచున్న మరో నాగేశ్వరరావును నేనే!

ఆవిధంగా డ్యూపుకు డ్యూపుగా నటించిన తొలి నటుణ్ణి, ఆఖరి నటుణ్ణి నేనే! నిజంగా నేనే!!

- స్వామి చిత్రానంద (కె.వి.రావు), చెన్నై



# బాపు విశ్వరూపం 8

బొమ్మల కథ సబ్జెక్టు ఏదైనా సరే, అన్నిటినీ కలిపి కామిక్స్ అంటారు. కామిక్స్ రాయడం మాటలు కాదు. మాటలూ, బొమ్మలూ ఉండాలి. కథను నడుపుతూ ఎంత దృశ్యపరంగా చూపాలో తెలియాలి. కథలో కూడా కొంత కథకుడి పరంగా, కొంత సంభాషణల పరంగా చెప్పుకురావాలి. వీటన్నిటి మధ్యా సమన్వయం కుదిరినప్పుడే 'బొమ్మలకథ' పండుతుంది.

బొమ్మలు వేసినప్పుడు అన్నీ క్లోజప్ వేసినా బాగుండవు. సినిమా కెమెరాలా ప్రాముఖ్యత బట్టి ఫ్రేములు మార్చుకుంటూ, వాతావరణాన్ని, కథా నేపథ్యాన్ని ఎస్టాబ్లిష్ చేయాలి. చిత్రకారులందరికీ ఈ విద్య పట్టుబడదు.

బాపు గారు తెలుగునాట కామిక్స్‌కి మంచి ప్రచారం తెచ్చారు. బాపు గీసిన రకరకాల కామిక్స్ చూద్దాం.

ఆంధ్ర పత్రిక వీక్లీకై బాపు వేసిన మొదటి బొమ్మల కథ 'రాజు-రైతు' ఓ జానపద గాథ. →




జగత్ప్రసిద్ధమైన గలివర్ ట్రావెల్స్‌ను గీసారు (దీన్ని పంపినది శ్రీ ఎం.వి.అప్పారావు, రాజమండ్రి) ↓



మిస్టరీ, సస్పెన్స్, హారర్ కలిపిన డిటెక్టివ్ కథ - 'లంకెబిందెలు'




ఇతర గ్రహవాసులను కూడా పాత్రలు వేసి రాసిన కామెడీ సీరియల్ 'బంగారం-సింగారం'








ఒక ఆవిడ తన భర్త తాగుడు భరించలేక, ఏంచెయ్యాలని వాళ్ళమ్మని సలహా అడిగింది.

"ఓపని చెయ్యి. దెయ్యంలా వేషవేసుకొని, ఓ మూలదాక్కో. మీ ఆయన సాయింత్రం వచ్చేసరికి, అతని మీదకి సడన్‌గా దూకు. దెబ్బకి హడలి పోయి తాగుడు మానేస్తాడు"అని సలహా ఇచ్చింది వాళ్ళ అమ్మ.

ఆ రాత్రి ఆవిడ వాళ్ళ ఆయన ఇంట్లోకి వచ్చేసరికి గభాల్న దెయ్యంలా వాళ్ళ అమ్మ చెప్పినట్లు దూకింది.

బాగా తాగిఉన్న అతను ఇలా అన్నాడు "చూడు దయ్యం... నువ్వు నన్ను జడిపించలేవు, మాఅవిడ తెలుసునా నీకు, పెద్ద ముదురు, అలాంటి గయ్యాళితో నేను ఆరు సంవత్సరాలనుండి కాపురం చేస్తున్నాను, ఆవిడకే భయపడలేదు నేను, ఇంక నీకేం భయపడతాను చెప్పు," అన్నాడు తాపీగా.



రామారావు తన భార్య అరుణని రైల్ ఎక్కించి వచ్చి, ఆమె బయలుదేరిందని చెప్పడానికి అత్తగారింటికి ఫోన్ చేద్దామనుకున్న సమయంలో, అతని ఫోన్ రింగ య్యింది. ఆ ఫోను వాళ్ళ అత్తగారి దగ్గరనుంచి "అరుణ బయలు దేరిందా" అంటూ!

"నేను చేద్దామనుకుంటున్నాను ఇంతలో మీరే చేసారు" అన్నాడు రామారావు.

"అయితే ఆలస్యం ఎందుకు అల్లుడుగారూ త్వరగా ఫోన్ చేయండి" అని ఆవిడ రిసీవర్ పెట్టేసింది హాపీగా.



ఇద్దరు తెరమరుగైన కళాకారులు, ఒక ప్రసిద్ధ నటుడ్ని కలసి, మళ్లీ స్టేజి యెక్కే అవకాశాలు ఇప్పించమని కోరేరు.

"అలాగే రేపు సాయంత్రం నేను ఆడే డ్రామాలో పని చేయండి" అని అన్నాడా నటుడు.

"మా పాత్రలు ఎంతసేపుంటాయి?" అని అడిగేరు వాళ్ళు ఆతృతగా.

"త్రూ అవుట్ ఉంటాయి. ముందు నేను వచ్చి కొన్ని డైలాగ్స్ చెబుతాను, తెర పడుతుంది. తెర లేవగానే మళ్ళీ నేను పద్యాలు పాడుతాను. తెరపడుతుంది. తెరలేవగానే, నేను హీరోయిన్‌తో లవ్‌సీన్ నటిస్తాను....".

"...అది సరేసార్ మా పాత్రలేంటో కాస్త చెపుతారా"

"తెర దానంతట అది లేచి, దానంతట అది పడదుగా! అదే మీ పాత్ర...అటూ ఇటూ..చెరోడు!" అన్నాడా నటుడు కూల్‌గా.



ఒక స్త్రీ జైలు వార్డెన్ని కలసుకొని, "సార్, జైల్లో ఉన్న మా ఆయన పనిచేసి, చేసి అలసిపోతున్నాడు. కాస్త తేలికైన పనులు ఇవ్వండయ్యా" అని బతిమాలుకుంది.

"కష్టమైన పనులేమీ నేను మీ ఆయనకు చెప్పడంలేదే!, అయినా ఎందుకు అలసి పోతున్నాడు మీ ఆయన? మరీ చోద్యంగా ఉందే! " అన్నాడు వార్డెన్

"అదేంటయ్యా అట్లా అంటారు, రాత్రంతా సొరంగం త్రవ్వితే అలిసిపోరూ!?' అందావిడ విస్తుపోతూ.

ఈ జోక్‌లను పంపినవారు : పి.బి.కె.శ్యామలరావు, హైదరాబాద్

"మా ఆయనకు కోపం వస్తే తల వంచుకొని దొడ్లోకి వెళ్లిపోతారు!"



"ఎంత అదృష్టం!"

"ఏం అదృష్టం...!? తిరిగి కొంతసేపటికే, చేత్తో చింత బరికె పట్టుకుని వస్తాడు!"

"ముందు ఒక్కరే 'రేప్' చేశారని చెప్పి, ఆ తర్వాత ఆరుగురు 'రేప్' చేశారంటావేమిటి?"

"ఒక్కరు రేప్ చేసింది... నేను పోలీస్‌స్టేషన్‌కు వెళ్లకముందండి!"





"ఎందుకండీ వారానికోసారి వచ్చి ఒక్కొక్క పన్నే కట్టించుకుంటున్నారూ!?"

"నా భార్య కరాటే క్లాసు వారానికో సారేనండి!"

ఈ జోక్‌లను పంపించినవారు : బచ్చు వీర్రాజు, రాజమండ్రి.






తండ్రి : ఓరి బడుద్ధాయీ, చవటా! నీ చదువు కోసం ఎంత డబ్బు తగలెయ్యవలసి వస్తోందో నీకేమైనా ఒళ్లు పై తెలుస్తోందా?

కొడుకు : తెలుస్తోంది డాడీ! అందుకే నేను చాలా తక్కువ చదివి నీకు ఖర్చు అవకుండా చూస్తున్నాను.



ఒక అమ్మాయి తన స్నేహితురాలితో వాపోయింది - "మనం ఎంత ఎక్కువ చదివితే అంత ఎక్కువ జ్ఞానం పొందుతాం. జ్ఞానం పొందిన కొద్దీ మరపుకూడా ఎక్కువవుతుంది. మరచినకొద్దీ జ్ఞానశూన్యులం అవుతున్నాం. మరి అయితే ఎక్కువ చదవడం వల్ల ఏమిటి లాభం?"



ఒక కరంటు స్థంభం మీద ఒక బోర్డు రాసి పెట్టి ఉంది-

ఈ స్థంభం తాకరాదు. దీనిని తాకినచో కరంటు షాకు తగులును. మృత్యువు కూడా సంభవించును. ఈ నిబంధన ఉల్లంఘించి తాకిన వారు ప్రభుత్వముచే కఠిన శిక్షకు గురవుతారు.



ఓ ఆబ్సెంట్‌మైండెడ్ ప్రొఫెసర్ గారు తన దగ్గిర పనిచేసే అసిస్టెంటును పిలిచాడు,"చూడు సుందరం! మా పాత కొలీగ్ ఒకాయన్ని రైలెక్కించాలి. ఆయనకూ నాలాగే మతిమరుపు. స్టేషన్ వెళ్లాక కబుర్లలో పడి రైలు కదిలేముందు ఎవరు ట్రెయిన్ ఎక్కాలో మర్చిపోయి ఖంగారుపడ్డ సందర్భాలు ఉన్నాయి. ఈ సారి నువ్వు నాతో రా. ఎవరు రైలెక్కాలో ఖచ్చితంగా విడమరిచి చెప్పు."

రైల్వే ప్లాట్‌ఫాం మీద ప్రొఫెసర్లద్దిరూ కబుర్లలో పడ్డారు. గతంలా మాత్రం జరగలేదు. రైలు వెళ్లిపోయాకనే ప్రయాణం సంగతి గుర్తొచ్చింది ఇద్దరికీ! "అరెరే", అన్నాడు వెళ్లవలసినాయన.

"కంగారుపడకండి. మళ్లీ టిక్కట్టుకొందాం. ఎవరు వెళ్లాలో మా సుందరం కరక్టుగా చెప్తాడు" అంటూ "సుందరం..."అని కేకేశాడు మన ప్రొఫెసర్.

"మీతో వచ్చిన అబ్బాయాండి! అదేంటోగానీ రైలు కదిలేటప్పుడు కాస్సేపు బుర్రగోక్కుని, చివరికి ఆయనే రైలెక్కేశాడండి!" చెప్పాడు పక్కనున్న ఆసామీ.



ఓ పల్లెటూళ్లో తపాలా సౌకర్యం లేదు. పక్క ఊరికెళ్లి పోస్టు చేయాల్సిందే. ఒకాయన ఆ పనిమీదే బయలుదేరి దార్లో ఓ ముసలాయన కనబడితే 'బాబ్బాబు, ఆ చేత్తోనే ఈ ఉత్తరమూ పోస్టు వేసేద్దురూ" అంటూ ఇంటిముఖం పట్టాడు.

ఓ రెండు నెలలు గడిచినా దానికి జవాబు రాకపోయేసరికి "తాతగారూ, అవాళ ఉత్తరం..." అంటూ వాకబు చేయబోయాడు.

ముసలాయన చిరాకు పడ్డాడు. "కుర్రకారుకు అన్నిటికీ హడావుడే! ఇదిగో నయ్యా నీ బోడి ఉత్తరం! అంత తొందరైతే నువ్వే వేసుకో" అని జేబులోంచి తీసి మొహానకొట్టాడు.



ఇల్లు కాలిపోతున్నా ఏం పట్టకుండా ఉన్నతనితో పక్కింటాయన "ఏంటయ్యా! నీ ఇల్లు కాలిపోతుంటే ఇంత నిశ్చింతగా నిమ్మకు నీరెత్తినట్లు ఎట్లా ఉన్నావయ్యా?" అని చాలా బాధ పడిపోతూ తిట్టబోయాడు.

"నేను నిశ్చింతగా ఎక్కడ ఉన్నాను? చప్పున వాన కురిపిస్తావా,లేదా అని ఆ భగవంతుడిని ప్రార్థిస్తుంటేనూ!" అంటూ చికాకుపడ్డాడు ఆ ఇంటాయన.



తండ్రి కొత్తగా కొనుక్కొచ్చిన టీవీ చూసి కుర్రాడు గంతులేసాడు హాయిగా పాటలు చూడవచ్చుని. టీవీ ఆన్ చేసి ఐదు నిమిషాలైనా ఆ ఛాయలేమీ కనబడక తండ్రిని అడిగాడు.

"డాడీ, ఇదేం ప్రోగ్రాం?" అని.

"తెలుగులో వార్తలు" అన్నాడాయన.

వార్తయ్యేదాకా ఉగ్గబట్టుకుని, కాసేపయ్యాక మళ్లీ అడిగాడు."డాడీ, ఇదేం ప్రోగ్రాం?"

"ఇంగ్లీషులో వార్తలు"

"చచ్చాం! అయితే దీని తర్వాత లెక్కల్లో వార్తలు వస్తాయి కాబోసు" అని దిగాలుపడ్డాడు ఆ భావి భారత పౌరుడు.

ఈ జోకలను పంపించినవారు : జి.బి. లక్ష్మి, హైదరాబాద్

**అలనాటి ఆణిముత్యాల గురించి**
**నేటి తరానికి అనువైన శైలిలో తెలిపే**

**క్లాసిక్స్ రీటోల్డ్**

# నవ్వుటద్దాలు

**- ఆచార్య తిరుమల**

## తెలివికి గీటు రాళ్లు!

## దీని భావమేమి తిరుమలేశ!

పరీక్ష లేకుండా తెలివికి రాణింపులేదు, రాదు. పరీక్షల్లో నెగ్గిన తర్వాతే తెలివితేటలకి విలువ, గుర్తింపు పెరుగుతాయి. పరీక్ష అనేది భక్తుడికే కాదు భగవంతుడికి కూడా తప్పదు, మేధావుల వాదోపవాదాలన్నీ ఒక



విధంగా పరీక్షల్లాంటివే. నెగ్గినవాడు పండితుడు లేదా ఏ గుర్తింపూ లేదు. తర్క శాస్త్రంలో అంతర్గతంగా వుండేది అగ్ని పరీక్షకు

పరిష్కార మార్గమే. కాబట్టి, తెలివైన వాళ్ళంతా ప్రశ్నలు నమన్యలు కోరుకుంటారు. వాటికి సమాధానాలు చెప్పటానికి యిష్టపడతారు. ఇంకా తెలివైన వాళ్ళయితే వారిలో వారే ప్రశ్నించుకుని, సమాధానం వెదుక్కుని సిద్ధంగా వుంటారు. అదొక రకమైన తపస్సు. జ్ఞాన చర్య. తపస్సుల స్థితి అలాగే వుంటుంది. ఆ స్థితికి చేరుకుంటే పరీక్షకు భయపడే పనిలేదు. సరిగదా ఎటువంటి గడ్డు ప్రశ్ననైనా ఆహ్వానిస్తాం. నిజానికి, సమాధానం చెప్పటం కంటె ప్రశ్నించటానికే ఎక్కువ తెలివితేటలు కావాలి. ప్రశ్నించటమంటే చచ్చు పుచ్చు సమాధానాల కోసం వెర్రి మొర్రిగా ఏదోటి అడగటం కాదు. ప్రశ్నిస్తే ఎంత పండితుడైనా ఆలోచనలో పడిపోవాలి. లేదా ఆలోచనలకి పదును పెట్టాలి.

అదంత జటిలమైన విషయం కాబట్టే ప్రశ్నోపనిషత్తని మనకొక ఉపనిషత్తే పుట్టింది. ఒక జటిల సమస్యకి సమాధానం దొరికిన తర్వాత కలిగే ఆనందానికి యీ ప్రపంచంలో ఏదీ సాటిరాదని గుర్తించాలి. అటువంటి ఆనందాన్వేషణలోనే పొడుపుకథల సాహిత్యం పుట్టింది. పిల్లల నుండి విద్వాంసుల వరకు అలరిస్తున్న యీ సాహిత్యంలోని గడుసుదనాలు, అందాలు, చమత్కారాలు కోకొల్లలు. వాటిలో పద్య సాహిత్యం నురడి కొన్నిటిని పరిచయం చేస్తాను.

సుమారు నలభై సంవత్సరాల క్రితం మా వూళ్లో మా నాన్నగారి పుస్తకాల్లో "నానార్థ గాంభీర్య చమత్కారిక" అనే ఓ చిన్న పుస్తకం, ముట్టుకుంటే పొట్టు పొట్టుగా రాలిపోయేటంత శిధిలావస్థలోని పేజీలతో, కంటబడింది. చమత్కారిక అనగానే చదవాలని మనసు ఉవ్విళ్లూరింది. నాన్నగారి నడిగితే 'అదిప్పుడు నీకు అర్థం కాదురా, అక్కడ పెట్టెయ్, ఆ పుస్తకమిప్పుడెక్కడా దొరకదు. పాడు చెయ్యకు' అన్నారు నవ్వుతూ. నేనూరుకోలేదు జాగ్రత్తగా పద్యాలు రాసుకుంటానన్నాను. ఆయనూరుకున్నారు. నేనా పుస్తకాన్ని నాకు తెలిసినంతలో తప్పులు లేకుండా చూసుకుంటూ రాసుకున్నాను. అదో అద్భుత సంకలనం. అందులోని పద్యాలు అక్కడక్కడ చూశానుగానీ ఆ పుస్తకాన్ని మాత్రం చూడలేదు. అందులోని కొన్ని పద్యాలు నేటికీ నాకు అర్థం కావటం లేదు. చాలా పరిశ్రమ చెయ్యాలి. కానీ యిప్పుడు నాకా ఓపిక, తీరిక లేవు. అందులోని ఓ పద్యాన్ని చూడండి. బావ మరుదులు ఆవుని కొనటానికి పశువుల సంతకు వెళ్లిన సందర్భం.

**బావయు మరిదింగని యీ**
**యావులలో నొకటి బేరమాడు మనగ నే**
**యావని యడిగిన వాక్యము**
**గావలయుంభాషలైదుగా నొక పదమున్!!**

ఈ ఆవుల్లో అంటే "ఏ ఆవురా బావా?" అన్నాడా మరిది. ఆ 'ఏ ఆవురా బావా' అనే వాక్యంలో 'రమ్మ' లేదా 'రా' అనే మాట ఐదు భాషల్లో వస్తుంది.

ఏ=మరాఠీలో, ఆవు=తురకంలో, రా=తెలుగులో, బా=కన్నడంలో, వా=అరవంలో. ఎంత అర్థ చమత్కారమో చూశారా!

అలాగే, విశ్వదాభిరామ వినురవేమ మకుటం ఎంత ప్రాచుర్యం పొందిందో అంతకంటె కాస్తంత యెక్కువగానే "దీని భావమేమి తిరుమలేశ?" అనే మకుటం ప్రసిద్ధికెక్కింది. ఆ మకుటంతో నేను కొన్ని సమస్యాత్మక పద్యాలు చూశాను గానీ శతకం చూడలేదు. ఆ పద్యాలిలా వుంటాయి. చూడండి.

తలయు తోక గల్గి చెలగు నాలుక లేదు
కండ్లు రెండు గలవు కానరావు
పట్టి చూచినంత ప్రాణంబు లేదయా
దీని భావమేమి? తిరుమలేశ!!

దీనికి సమాధానం- పాము కుబుసం. మరోటి చూడండి.

చలన శక్తి గలదు జంతువు గాదది
చేతులెపుడు త్రిప్పు శిశువు గాదు
కాళ్ళు లేవు సర్వకాలంబు నడచును
దీని భావమేమి? తిరుమలేశ!!

దీని భావమేమిటంటే గడియారం. మరో పద్యం చూడండి. ఈపద్యంలో తమాషా ఏమిటంటే ప్రశ్న వున్నట్టుగా వుంటుంది. కానీ ప్రశ్న వుండదు. దేనికదే సమాధానమవుతూ వుంటుంది.

వంగతోట నుండు వరి మళ్ళలో నుండు
జొన్న చేల నుండు చోద్యముగను
తలుపు మూలనుండు తలమీద నుండును
దీని భావమేమి? తిరుమలేశ!!

అలా వుండేది ఏమిటా అని వెతుక్కుంటాం. కానీ అది వట్టి భ్రమ. ఆ భ్రమ తొలిగితే సమాధానం కనిపిస్తుంది. ఇక్కడ అర్థంలోనే సమాధానం ఉంది. చూడండి. వంగ-తోట నుండు, వరి-మళ్ళలో నుండు, జొన్న-చేల నుండు, తలుపు-మూలనుండు, తల-మీద నుండు అంటూ ఏవి ఎక్కడుంటాయో చెప్పాడంతే!

ఒక కవి అయిదక్షరాల పక్షిరాజు పదం తీసుకుని, అందులోని ఒక్కొక్క అక్షరాన్ని తీసేస్తూ చమత్కారాన్ని సాధించాడు.

పక్షి య్యెండు బరగు పంచాక్షరముల
వాని తలదీయ క్షుద్ర దేవత జనించు
వాని తలదీయ తక్కడ జాను మీరు
దాని ప్రథమాక్షరము దీయ దనరు నృపతి!!

ఐదక్షరాల పక్షి ఏమిటో తెలిస్తే మిగిలినవి వాటంతట అవే తెలిసిపోతాయి. ఆ పక్షి- కపోతరాజు, కపోతమంటే పావురం. ఇంక-క్షుద్రదేవత=పోతరాజు, తక్కెడ=తరాజు, నృపతి=రాజు, అని సులభంగానే తెలిసిపోతుంది.

వాక్యాలు తిన్నగా కుదుర్చుకోకపోతే పెడర్థాలు వచ్చే ప్రమాదాన్ని ఎంత చమత్కారంగా చెప్తూ వుందో యీ పద్యం చూడండి.

కొండమండు నెమిలి కోరిన పాలిచ్చు
పశువు శిశువు తోడ పలుక నేర్చు
వనితవేదములను వల్లించు చుండును
బ్రాహ్మణుండు కాకి పలలము దిను!!

పద్యంలోని పాదాల ప్రకారం నెమిలి పాలివ్వటం, పశువు శిశువుతో మాట్లాడటం, ఆడది వేదాలు వల్లించటం, బ్రాహ్మడు కాకి మాంసం తినటం అసందర్భ ప్రలాపాలు. కానీ అది సరికాదు. పద్యాన్ని-కొండనుండు నెమిలి, కోరిన పాలిచ్చు పశువు, శిశువుతోడ పలుక నేర్చు వనిత, వేదములను వల్లించు చుండును బ్రాహ్మణుండు, కాకి పలలము దిను, అని విరుచుకుంటూ చదివితే సరిపోతుంది. కావల్సినంత చమత్కారం పుట్టుకొస్తుంది.

కొన్ని పద్యాలున్నాయి. వాటిలో కొన్ని ప్రశ్నలుంటాయి. వాటి సమాధానాలు "వికటకవి" అనే మాటలా ఎటునుండి చదివినా ఒక్కలాగే వుంటాయి. చూడండి.

రాముడెవ్వారితో రావణు మర్దించె?
పరవాసుదేవుని పురమదేది?
రాజమన్నారు చే రంజిల్లు శరమేది?
వెలయగానుక వంటి విత్తదేది?
అల రంభ కొప్పులో అలరు మాలిక ఏది?
సభవారి నవ్వించు జాణ ఎవడు?
సీత పెండ్లికి నోలి చేసిన విల్లేది?
శ్రీకృష్ణుడే యింటఁ జెలగు చుండు?
అన్నిటికి జూడనైదేసి యక్షరములు
ఒనర నిరుదెస చదివిన నొక్కతీరె
చెప్ప గలిగిన నేనిత్తు చిన్న మాడ
చెప్ప లేకున్న నగుదునే చిన్నినవ్వు!!

ఈ ప్రశ్నలకి సమాధానా లిలా వరసగా వుంటాయి. గుర్తించండి

తోకమూకతో - రంగ నగరం-లకోలకోల (=వాడిబాణం)-జంబీరబీజం (నిమ్మవిత్తు)-మందారదామం- వికటకవి- పంచాస్య చాపం (శివధనుస్సు)-నంద సదనం. ఈ సమాధానాలు ఎటునుండి చదివినా ఒకలాగే వున్నాయి కదా!

కొన్ని పద్యాల్లో రెండేసి ప్రశ్నలకి ఒకటే సమాధానం వుంటుంది. అది ఎటునుండి చదివినా ఒక్కలాగే వుంటుంది. ఆ వింత పోకడ చూడండి.

రాజుల కెటువంటి రత్నముల్ ప్రియమయ్యె?
కాయలే చెట్లవి కరులు మ్రింగు?
ఈశ్వరుండెవ్వాని నెచ్చోట ధరియించె?
జారు డెవ్వారి నెసంగ గోరు?
ఎన్నెన్ని దినముల కేతెంచు పున్నమి?
జనయిత్రి పుత్రునే జాడమోయు?
బంధువు లెయ్యెడ బలిసి యేతెంతురు?
ఈతగాడెందున భీతిజెందు?
అన్నిటికి జూడ నైదేసి యక్షరంబు
లీవ లావల జూడంగ నేక విధము
సమ్మ తిగ జెప్ప భావజ్ఞ చక్రవర్తి
చెప్ప లేకున్న నగుదు నే చిన్ని నవ్వు!!

ఈ పద్యంలో ప్రియ మంటే యిష్టమని. కరులంటే ఏనుగులని. జారుడంటే వ్యభిచారని అనుకోవాలి. ఇప్పుడు చూడండి మొదటి రెండు ప్రశ్నలకి కలిపి సమాధానం-వెలగలవె. (వెల గల రత్నాలు, వెలగ చెట్ల కాయలు



అని అర్థం). తర్వాత రెండు ప్రశ్నలకి "నెల తలనె"-సమాధానం (చంద్రుని తలమీదనే, ఆడవారినే-అని అర్థం). తర్వాత రెండు ప్రశ్నలకి కలిపి "నెల నెలనె" అని సమాధానం. (ప్రతి నెల కడుపులో ఒక్కొక్క నెల అని అర్థం). తర్వాత రెండు ప్రశ్నలకి "కెల కులకె" అని సమాధానం. (దిక్కుల నుండి, ప్రక్కలని అర్థం).

ఒక పేరులో మూడేసి పేర్లు వచ్చేలా సమాధానాలుండాలన్న షరతుతో చమత్కరిస్తున్న యీ క్రింది పద్యాన్ని చూడండి.

**దశరథాగ్ర సుతుండు శశియు పట్టణం**
**బొక పేరు లోపల నుండ వలయు**
**దర్పకాంతకుడు నేత్రంబును మాలయు**
**నొక పేరు లోపల నుండ వలయు**
**వేల్పును త్రోవయు వెలయు ప్రసూనంబు**
**నొక పేరు లోపల నుండ వలయు**
**కనకంబు కార్పాస మొనర మహీజంబు**
**నొక పేరు లోపల నుండ వలయు**
**దీన యర్థంబు తెలియంగ బూనుకొనుచు**
**మది విచారించి పదునైదు మాసములను**
**సమ్మతిగ జెప్ప భావజ్ఞ చక్రవర్తి**
**చెప్పలేకున్న నగుదు నే చిన్ని నవ్వు!!**

సమాధానాలు చెప్పటానికి పదిహేను నెలల గడువిచ్చాడు. అప్పటికీ చెప్పలేకపోతే మన తెలివితేటలకి నవ్వుతాడట! ఈ పద్యానికి సమాధానాలెలా వుంటాయో చూడండి.

దశరథాగ్రసుతుడు=రాముడు, శశి=చంద్రుడు, పట్టణం=పురం - ఈ మూడు కలిపితే - 'రామ చంద్ర పురం' అవుతుంది.

దర్పకాంతకుడు=రుద్రుడు, నేత్రం=కన్ను, మాల=దండ - కాబట్టి దీనికి 'రుద్రాక్షమాల' - సమాధానమవుతుంది.

వేల్పు=దేవత, త్రోవ=దారి, ప్రసూనం=పుష్పం - కలిపితే 'దేవ దారి పుష్పం'. తర్వాత దానికి సమాధానం-కనకం=పైడి, కార్పాసం=పత్తి, మహీజం=చెట్టు - కలిపితే 'పైడి పత్తి చెట్టు' అని ఒక చెట్టు పేరొస్తుంది. సమాధానాలు చెప్పగలిగాం కాబట్టి మనమిప్పుడు భావజ్ఞ చక్రవర్తులమే అవుతాం కదా!

సంస్కృతంలో ఇలాంటి ప్రహేళికలు చాలా వున్నాయి. మచ్చుకో రెండు ముచ్చటిస్తాను.

**అనేక సుషిరం వాద్యం కాంతం చ ఋషి సంజ్ఞితం**
**చక్రిణా చ సదారాధ్యం యో జానాతి స పండితః!!**

చాలా రంధ్రాలతో అందంగా రుషి పేరుతో వుండి విష్ణువుచే గౌరవింపబడే వాద్యం ఏమిటో తెలిసిన వాడు పండితుడని శ్లోక తాత్పర్యం. రంధ్రాల వాద్య మనగానే వేణువనుకుంటాం. కానీ అది రుషి పేరుతో లేదు కాబట్టి దీనికి వేరే సమాధానం వెదకాలి. ఆ సమాధానమెంత గంభీరంగా వుందో చూడండి. వ+ఆద్యం=వాద్యం-అంటే వ కారం మొదట, క+అంతం=కాంతం-అంటే 'క' కారం చివర వుండి రుషి సంజ్ఞితం=రుషి పేరుతో వుండేది ఏమిటంటే - వ+ల్మీ+కం=వల్మీకం=పుట్ట-వాల్మీకి మహర్షికి సంబంధించింది, కాబట్టి విష్ణువుచే (రామునిచే) గౌరవింపబడేదని అంతరార్థం. ఇంతకీ యీ శ్లోకానికి 'వల్మీకం' సమాధానమని గుర్తించాలి.

చామర్తి కామశాస్త్రిగారు రామాయణ పరంగా రచించిన యీ శ్లోకాన్ని చూడండి.

**వాలినం రావణం రామం సుగ్రీవం చ విభీషణం**
**శత్రుఘ్నం భరతం హిత్వా సీతయా కిం ప్రయోజనమ్?**

వాలి సుగ్రీవులు, రావణ విభీషణులు, రామ భరత శత్రుఘ్నులు లేక సీతతో పని ఏమిటని శ్లోకార్థం. కానీ చమత్కారం వేరేగా వుంది. వాలినం=తోకకల, రావణం=రంకె వేసే, రామం=అందమైన, సుగ్రీవం=మంచి మెడగల, విభీషణం=భయంకరమై, శత్రుఘ్నం=శత్రువుల్ని చంపే, భరతం=బరువుమోసే ఎద్దును, హిత్వా= విడిచినచో, సీతయా=నాగటి చాలుతో, కిం ప్రయోజనం=ఏమి లాభం?-అంటే-అందమైన మెడ, తోక గలిగి భయంకరమైన రంకెలతో బలిసి బరువులు మోసే యెద్దు లేకుండా నాగలితో పనేమిటని తాత్పర్యం. సీత వల్ల రామాయణంలోని విశిష్ట పాత్రలిలా రైతు కుటుంబ సభ్యులు కావటం విశేషం.

ఒక కవి చుక్కల్ని పద్యంలో పొదిగి చూపించాడు. చూడండి.

**నక్షత్రము పేరిట సతి**
**నక్షత్రము చేతబూని నక్షత్ర విభున్**
**నక్షత్రమునకు రమ్మని**
**నక్షత్రము పైనవేసి నాథుని బిలిచెన్!!**

ఈ పద్యానికి సందర్భమేమిటో తెలియకపోతే అర్థంకాదు. ఇది చంద్ర వంశపు రాజైన అభిమన్యుడు యుద్ధానికి బయలుదేరే ముందు భార్య ఉత్తర వీర తిలకం దిద్దటానికి పిలిచే ఘట్టం. అశ్విని, భరణి మొదలైన 27 నక్షత్రాల్లో 'ఉత్తర' ఒకటి. నక్షత్రము పేరిట సతి 'ఉత్తర', నక్షత్రము చేతబూని అంటే 'భరణి' చేతబట్టి. నక్షత్రమునకు రమ్మని అంటే 'మూల'కు రమ్మని, నక్షత్రము పైన వేసి అంటే 'హస్త' (చేయి) మీద వేసి నక్షత్ర విభుడైన చంద్రుని వంటి నాథుని వీర తిలకం దిద్దటానికి పిలిచిందని తాత్పర్యం. చూశారా? ఉత్తర, భరణి, మూల, హస్త నక్షత్రాలతో కవి చేసిన చిత్ర-విచిత్రం! ఇలా ఎన్నెన్నో పద్యాలున్నాయి. చివరిగా ఒక్క పద్యం చెప్పి ముగిస్తాను.

**ఏమీనన తా బేలన**
**నాముంగిటి కేల రాడు నరహరి పిన్నా**
**రామల ముమ్మారంపిన**
**ప్రేమను మరి బుద్ధి సెప్పి పిలవవె కలికీ!!**

ఓ కలికీ! ఆ నరహరి వట్టి బేల పిన్నవాడు. నా కోసం ముగ్గురు రామలను పంపాడు. నా ముందుకెందుకు రాడు? నేనేమీ అనను. ప్రేమతో బుద్ధి చెప్పి పిలుచుకురా. అని ఓ గడుసు పిల్ల తన చెలికత్తెతో తన కోసం ప్రయత్నిస్తున్న ఓ గడుగ్గాయికి కబురుపెట్టటం పద్యభావం. అంతతోనే ఆగితే యీ పద్యం దండుగ. కానీ యీ పదాల పూలలోని గుబాళింపు చూడండి: ఈ పద్యంలో కవి దశావతార వర్ణన చేశాడు. ఏ 'మీనన' లో 'మీన' అంటే మత్స్యావతారం, 'తాబేల'న అంటే కూర్మావతారం, నా ముం'గిటిలో 'కిటి' అంటే వరహావతారం, 'నరహరి' అంటే నరసింహావతారం. 'పిన్న' అంటే వామనావతారం. ముమ్మారంపిన రామలు అంటే పరశురామ, శ్రీరామ, బలరామావతారాలు 'బుద్ధి' సెప్పిలో బుద్ధావతారం, 'కలికీ' అంటే కల్కి అవతారం.

ఇలాంటి పద్యాలన్నీ మన తెలివికి గీటురాళ్ళు! జాగ్రత్త పెట్టండి!



| నెం. | పాట | చిత్రం పేరు | సం॥ | సంగీత దర్శకుడు | రచన | గానం |
|---|---|---|---|---|---|---|
| 164 | దేవుడే ఇచ్చాడు వీధి ఒకటి | అంతులేని కథ | 1976 | ఎమ్.ఎస్.విశ్వనాథన్ | ఆత్రేయ | కె.జె.ఏసుదాసు |
| 165 | కళ్ళలో వున్నదేదో కన్నులకే తెలుసు | అంతులేని కథ | 1976 | ఎమ్.ఎస్.విశ్వనాథన్ | ఆత్రేయ | ఎస్.జానకి |
| 166 | అరె ఏమిటి లోకం | అంతులేని కథ | 1976 | ఎమ్.ఎస్.విశ్వనాథన్ | ఆత్రేయ | యల్.ఆర్.ఈశ్వరి |
| 167 | ఊగుతుంది నీ ఇంట ఉయ్యాల | అంతులేని కథ | 1976 | ఎమ్.ఎస్.విశ్వనాథన్ | ఆత్రేయ | సుశీల |
| 168 | తాళి కట్టు శుభవేళ | అంతులేని కథ | 1976 | ఎమ్.ఎస్.విశ్వనాథన్ | ఆత్రేయ | ఎస్.పి.బాలు |
| 169 | సన్నజాజి తీవలోయ్ | అనురాగం | 1963 | పెండ్యాల | మల్లాది | పి.భానుమతి |
| 170 | శరణం భవకరుణా మయ | అనురాగం | 1963 | పెండ్యాల | నారాయణ తీర్థ | పి.భానుమతి |
| 171 | విన్నపాలు వినవలె | అనురాగం | 1963 | పెండ్యాల | అన్నమయ్య | పి.భానుమతి |
| 172 | ప్రేమా పిచ్చి ఒక్కటే | అనురాగం | 1963 | పెండ్యాల | ఆత్రేయ | పి.భానుమతి |
| 173 | అమ్మా అమ్మా అనే మాటలో | అనురాగం | 1963 | పెండ్యాల | ఆత్రేయ | ఘంటసాల |
| 174 | జాణైన యెద్దురా | అనురాగం | 1963 | పెండ్యాల | కొసరాజు | పిఠాపురం, మాధవపెద్ది |
| 175 | పదే పదే కన్నులివే బెదురునెందుకు | అనురాగం | 1963 | పెండ్యాల | సి.నారాయణ రెడ్డి | ఘంటసాల, సుశీల |
| 176 | సొగ చెలో నిలబడి | అనురాగం | 1963 | పెండ్యాల | సి.నారాయణ రెడ్డి | బి.గోపాలం, జమునారాణి |
| 177 | ఖుషీ ఖుషీగా నాతో రావే | అనురాగం | 1963 | పెండ్యాల | కొసరాజు | పి.బి.శ్రీనివాస్, స్వర్ణలత |
| 178 | పాల పిట్ట పాల పిట్ట | అత్తలు - కోడళ్ళు | 1971 | కె.వి.మహదేవన్ | ఆత్రేయ | ఎస్.పి.బాలు, సుశీల |
| 179 | ఈ వీణ పలికించు ఎన్ని రాగాలో | అత్తలు - కోడళ్ళు | 1971 | కె.వి.మహదేవన్ | ఆత్రేయ | సుశీల |
| 180 | అమ్మమ్మో అత్తమ్మో | అత్తలు - కోడళ్ళు | 1971 | కె.వి.మహదేవన్ | సి.నారాయణ రెడ్డి | సుశీల |
| 181 | చిరు రవికందం | అత్తలు - కోడళ్ళు | 1971 | కె.వి.మహదేవన్ | ఆత్రేయ | ఎస్.పి.బాలు |
| 182 | బలెబలే బావయ్యో | అత్తలు - కోడళ్ళు | 1971 | కె.వి.మహదేవన్ | అప్పలాచార్య | ఎస్.పి.బాలు, స్వర్ణలత |
| 183 | చుక్కల్లో చంద్రుడు ఒక్కడే ఒక్కడే | అత్తలు - కోడళ్ళు | 1971 | కె.వి.మహదేవన్ | సి.నారాయణ రెడ్డి | ఎల్.ఆర్.ఈశ్వరి |
| 184 | డుడుం డు గంగిరెడ్డు | అవేకళ్ళు | 1967 | వేదా | కొసరాజు | సుశీల |
| 185 | ఎవరు నీవారు తెలుసుకోలేవు | అవేకళ్ళు | 1967 | వేదా | దాశరథి | ఘంటసాల |
| 186 | చకిని పార్క్ వుంది | అవేకళ్ళు | 1967 | వేదా | కొసరాజు | పిఠాపురం, ఎల్.ఆర్.ఈశ్వరి |
| 187 | ఓ..ఓ..ఎంతటి అందం విరిసే ప్రాయంలో | అవేకళ్ళు | 1967 | వేదా | దాశరథి | ఘంటసాల, సుశీల |
| 188 | ముల్లోలాలుకు చిన్నది | అవేకళ్ళు | 1967 | వేదా | దాశరథి | ఘంటసాల, సుశీల |
| 189 | ఓ ప్రియతమా నీ దానరా | అవేకళ్ళు | 1967 | వేదా | దాశరథి | సుశీల |
| 190 | మా ఊళ్ళో ఒక పడుచుంది | అవేకళ్ళు | 1967 | వేదా | కొసరాజు | ఘంటసాల, పిఠాపురం |
| 191 | చెలి చెంతకు పిలుచుకో | అవేకళ్ళు | 1967 | వేదా | దాశరథి | ఎల్.ఆర్.ఈశ్వరి |
| 192 | జిత్తుమారి ఓ అత్త కూతురా | అయిన వాళ్ళు | 1976 | శ్రీ రాజ్ | దాశరథి | రామకృష్ణ, సుశీల |
| 193 | చెంపా చెంపా రాసుకుంటూ | అయిన వాళ్ళు | 1976 | శ్రీ రాజ్ | కొసరాజు | రామకృష్ణ, సుశీల |
| 194 | గోవిద గోవింద అనరా | అయిన వాళ్ళు | 1976 | శ్రీ రాజ్ | గోపి | ఎమ్.రామారావు |
| 195 | కాలిపోయింది కన్నెతనం | అయిన వాళ్ళు | 1976 | శ్రీ రాజ్ | గోపి | ఎస్.పి.బాలు |
| 196 | లక్ష్మీమహితాదనురూప | బంగారు కుటుంబం | 1971 | సత్యం | శ్లోకమ్ | సుమిత్ర |
| 197 | జీవితం వరమే | బంగారు కుటుంబం | 1971 | సత్యం | వీటూరి | ఘంటసాల |
| 198 | చెలి పోసిట పోసిన మల్లియలు | బంగారు కుటుంబం | 1971 | సత్యం | సి.నారాయణ రెడ్డి | ఎస్.జానకి |
| 199 | పిల్లలి ఉయాలలో | బంగారు కుటుంబం | 1971 | సత్యం | సి.నారాయణ రెడ్డి | ఎస్.పి.బాలు, సుశీల |
| 200 | మిమి ఎలోన్ | బంగారు కుటుంబం | 1971 | సత్యం | సి.నారాయణ రెడ్డి | ఎల్.ఆర్.ఈశ్వరి |
| 201 | యవ్వనం చక్కని పువ్వురా | బంగారు కుటుంబం | 1971 | సత్యం | ఆరుద్ర | ఎస్.జానకి, వసంత |
| 202 | అన్నపూసన్నిధి | బంగారు గాజులు | 1968 | టి.చలపతిరావు | సి.నారాయణ రెడ్డి | సుశీల |
| 203 | చెల్లెలు పెళ్ళి కూతురాయెనే | బంగారు గాజులు | 1968 | టి.చలపతిరావు | సి.నారాయణ రెడ్డి | ఘంటసాల |

( P.T.O. )

| నెం. | పాట | చిత్రం పేరు | సం॥ | సంగీత దర్శకుడు | రచన | గానం |
|---|---|---|---|---|---|---|
| 204 | వలపు ఏమిటి ఏమిటి | బంగారు గాజులు | 1968 | టి.చలపతిరావు | ఆరుద్ర | సుశీల, బృందం |
| 205 | ఏగలేక ఉన్నాను రా మావా | బంగారు గాజులు | 1968 | టి.చలపతిరావు | సి.నారాయణ రెడ్డి | ఘంటసాల, ఎల్.ఆర్.ఈశ్వరి |
| 206 | విన్నవించుకోనా చిన్న కోరిక | బంగారు గాజులు | 1968 | టి.చలపతిరావు | దాశరథి | ఘంటసాల, సుశీల |
| 207 | ఆగండి అ ఆలు వస్తే గాని | బంగారు గాజులు | 1968 | టి.చలపతిరావు | కొసరాజు | మాధవపెద్ది, వసంత |
| 208 | జాజిరి జాజిరి జిక్కల మావా | బంగారు గాజులు | 1968 | టి.చలపతిరావు | సి.నారాయణ రెడ్డి | ఎల్.ఆర్.ఈశ్వరి |
| 209 | బంగారు తల్లి పండిందోయ్ | బంగారు తల్లి | 1971 | ఎస్.రాజేశ్వరరావు | ఆత్రేయ | ఘంటసాల, సుశీల & కోరస్ |
| 210 | ఛల్ ఛల్ బండి చలాకి బండి | బంగారు తల్లి | 1971 | ఎస్.రాజేశ్వరరావు | కొసరాజు | ఘంటసాల, ఎల్.ఆర్.ఈశ్వరి & కోరస్ |
| 211 | ధాన్యవే తల్లి | బంగారు తల్లి | 1971 | ఎస్.రాజేశ్వరరావు | తాపీ ధర్మారావు | ఘంటసాల |
| 212 | పల్లె సీమ మన పంట సీమ | బంగారు తల్లి | 1971 | ఎస్.రాజేశ్వరరావు | దాశరథి | ఘంటసాల, సుశీల, పిఠాపురం, స్వర్ణలత |
| 213 | శ్రమించే రైతుల జీవనాలు | బంగారు తల్లి | 1971 | ఎస్.రాజేశ్వరరావు | శ్రీశ్రీ | ఘంటసాల |
| 214 | తరలింది బంగారు బొమ్మ | బంగారు తల్లి | 1971 | ఎస్.రాజేశ్వరరావు | దేవులపల్లి | పి.లీల, కోరస్ |
| 215 | వచ్చిందయ్యా పండగా | బంగారు తల్లి | 1971 | ఎస్.రాజేశ్వరరావు | కొసరాజు | సుశీల, పిఠాపురం, హరిరావు |
| 216 | ఎంతైనా బరువు ఈ బ్రతుకు | బంగారు తల్లి | 1971 | ఎస్.రాజేశ్వరరావు | దేవులపల్లి | సుశీల, వసంత, లత |
| 217 | ఇన్నాళ్లు లేని సిగ్గు | బంగారు తల్లి | 1971 | ఎస్.రాజేశ్వరరావు | సి.నారాయణ రెడ్డి | ఘంటసాల, జానకి |
| 218 | బల దర్పంతో (పద్యం) | బంగారు తిమ్మరాజు | 1964 | ఎస్.పి.కోదండపాణి | వీటూరి | పి.బి. శ్రీనివాస్ |
| 219 | హ్రీంకారాసన | బంగారు తిమ్మరాజు | 1964 | ఎస్.పి.కోదండపాణి | శ్లోకమ్ | పి.బి.శ్రీనివాస్, జానకి |
| 220 | కోడె కారు చిన్నవాడా | బంగారు తిమ్మరాజు | 1964 | ఎస్.పి.కోదండపాణి | వీటూరి | పి.బి.శ్రీనివాస్, జానకి |
| 221 | లేడిని సీత చూడకపోతే | బంగారు తిమ్మరాజు | 1964 | ఎస్.పి.కోదండపాణి | వీటూరి | మాధవపెద్ది, పట్టాభి, స్వర్ణలత |
| 222 | నాగమల్లి కోనలోన | బంగారు తిమ్మరాజు | 1964 | ఎస్.పి.కోదండపాణి | వీటూరి | జమునారాణి |
| 223 | నిండు చందమామ | బంగారు తిమ్మరాజు | 1964 | ఎస్.పి.కోదండపాణి | ఆరుద్ర | జేసుదాసు |
| 224 | రాగ భోగాల తేలించు దొరవని | బంగారు తిమ్మరాజు | 1964 | ఎస్.పి.కోదండపాణి | వీటూరి | సుశీల, బృందం |
| 225 | శ్రీమన్నభీష్ట వరదాఖిల | బంగారు తిమ్మరాజు | 1964 | ఎస్.పి.కోదండపాణి | సంప్రదాయగీతం | పి.బి.శ్రీనివాస్, వైదేహి |
| 226 | స్థిరమైన ముక్తికి (పద్యం) | బంగారు తిమ్మరాజు | 1964 | ఎస్.పి.కోదండపాణి | వీటూరి | ఎమ్.సత్యం |
| 227 | భలే భలే బాగుంది ఒళ్లు తెలిపోతుంది | బంగారు తిమ్మరాజు | 1964 | ఎస్.పి.కోదండపాణి | వీటూరి | జమునారాణి |
| 228 | ఈ వింత పులకింత | బంగారు తిమ్మరాజు | 1964 | ఎస్.పి.కోదండపాణి | వీటూరి | ఎస్.జానకి |
| 229 | బావంటే బావ భలే మంచి బావ | భాగ్యదేవత | 1959 | మాస్టర్ వేణు | కొసరాజు | జమునారాణి, బృందం |
| 230 | హరే హరే రామ్ | భాగ్యదేవత | 1959 | మాస్టర్ వేణు | కొసరాజు | ఘంటసాల |
| 231 | మదిని హాయి నిండెగ | భాగ్యదేవత | 1959 | మాస్టర్ వేణు | శ్రీశ్రీ | ఘంటసాల, పి.సుశీల |
| 232 | మరి కొంచెం నిద్దుర కానీ | భాగ్యదేవత | 1959 | మాస్టర్ వేణు | తాపీ | సుశీల |
| 233 | ఓ మాతా ఎటు చూసిన చీకటే | భాగ్యదేవత | 1959 | మాస్టర్ వేణు | తాపీ | సుశీల, మాధవపెద్ది |
| 234 | పాపం ఒక చోట ఫలితం ఒక చోట | భాగ్యదేవత | 1959 | మాస్టర్ వేణు | తాపీ | మాధవపెద్ది |
| 235 | తలచిన తలపుల ఫలము | భాగ్యదేవత | 1959 | మాస్టర్ వేణు | కొసరాజు | జమునారాణి |
| 236 | వేడుకదే కన్నులోన | భాగ్యదేవత | 1959 | మాస్టర్ వేణు | శ్రీశ్రీ | ఘంటసాల, జమునారాణి |
| 237 | ఉంటే దాగునా అంటే ఆగునా | భాగ్యదేవత | 1959 | మాస్టర్ వేణు | కొసరాజు | మాధవపెద్ది, జమునారాణి |
| 238 | జంతర్ మంతర్ మామా | భలే అల్లుడు | 1977 | జె.వి.రాఘవులు | కొసరాజు | ఎస్.పి.బాలు, కోరస్ |
| 240 | అయ్యయ్యో పిచ్చి తల్లి | భలే అల్లుడు | 1977 | జె.వి.రాఘవులు | ఆత్రేయ | ఎస్.పి.బాలు |
| 241 | నిదురపోంది పాపల్లారా | భలే అల్లుడు | 1977 | జె.వి.రాఘవులు | ఆత్రేయ | సుశీల |
| 242 | ప్రేమిస్తే ఏమౌతుంది | భలే అల్లుడు | 1977 | జె.వి.రాఘవులు | ఆత్రేయ | ఎస్.పి.బాలు, సుశీల |
| 243 | సూత్రంలేని సుందరులారా | భలే అల్లుడు | 1977 | జె.వి.రాఘవులు | ఆత్రేయ | ఎస్.పి.బాలు, కోరస్ |
| 239 | బెల్లం కొట్టిన రాయి | భలే అల్లుడు | 1977 | జె.వి.రాఘవులు | ఆత్రేయ | ఎస్.పి.బాలు, ఎస్.జానకి |

సేకరణ: పూసరాజు శేషరావు, విశాఖపట్నం

గత సంచికలో మరికొన్ని




గత సంచికలో రాజ్‌కపూర్ తెలుగులో నిర్మించిన 'ప్రేమలేఖలు' సినిమా గురించి రాస్తూ సెమీ డబ్బింగ్ ప్రక్రియను గురించి ప్రస్తావించటం జరిగింది. ఆ కోవలోనే పేర్కొనదగిన మరొక చిత్రం-

# ఆలీబాబా 40 దొంగలు

1955లో విడుదలైన ఈ చిత్రంలోని పాటల వరకూ తెలుగు ప్రేక్షకుల కోసం వేరేగా చిత్రీకరించారని చెబుతారు. ఇదే పేరుతో ఎన్.టి.ఆర్., జయలలిత కాంబినేషన్‌తో 1970లో మరొక చిత్రం వచ్చినా - ఈ ఆలీబాబా 40 దొంగలు టైటిల్‌ని పేరడీ చేస్తూ 'ఆలీబాబా అరడజను దొంగలు' అంటూ ఈ కథతో సంబంధం లేకుండా ఇంకొక చిత్రం వచ్చినా - వీటన్నిటికీ ప్రేరణ మోడరన్ థియేటర్స్ వారు తమిళ (తెలుగు) భాషలో నిర్మించిన 'ఆలీబాబా 40 దొంగలు' చిత్రమేనని చెప్పక తప్పదు. ఎం.జి.ఆర్., భానుమతి హీరోహీరోయిన్‌లుగా నటించిన ఈ రంగుల చిత్రానికి సంగీతం సుసర్ల దక్షిణామూర్తి. ఈ చిత్రానికి ముందు 1954లో మహిపాల్, షకీలా తో 'ఆలీబాబా చాలీస్‌చోర్' అనే ఓ హిందీ చిత్రం వచ్చింది. ఆ చిత్రానికి యస్.యన్.త్రిపాఠీ, చిత్రగుప్త సంగీతాన్నిచ్చారు. వారు స్వరపరిచిన ఆ చిత్రంలోని పాటలలో ఓ అయిదిటిని తెలుగు, తమిళ వెర్షన్‌లకు తీసుకోవడం జరిగింది. ఆ పాటలతో పాటు స్వరపరిచిన మరో నాలుగు పాటలు కూడా ఆ రోజుల్లో బాగా పాపులర్ అయ్యాయి. వెరసి తొమ్మిది పాటలూ ఇవి.

అందంలో పందెమేస్తా
అందర్నీ ఓడిస్తా ॥అందంలో॥
మందార మకరందాలు అందెల్లో చిందిస్తా ॥అందంలో॥
మేలైన జాతి రోజా యీ మెరుగే చూడండ్
ఎవరైనా చేరవస్తే మెరుగంతా మారునోయ్
ముళ్లన్నీ గుచ్చునోయ్ ॥ఎవరైనా॥
ఓ... యీలేసి సైగచేసే వేషాలు చాలునోయ్ ॥ఈలేసి॥
యీ వింతచేతలన్నీ నా చెంత సాగవోయ్ ॥అందంలో॥
ఒయ్యారి ఒంపులన్నీ ఒలికించే రాణినోయ్
ఆటంటే మోజులేదా అబలంటే మోజులా
అబలంటే మోజులా ॥ఆటంటే॥
ఓ...కులకాంతలు ఏవగించే పరకాంత దాసులోయ్ ॥కుల॥
తందానా పాటపాడి తైతక్కలాడేరే ॥అందం॥





## ఈసారి ఈ ఫీచర్ స్పాన్సర్ చేసినది

'మా టీవీ'లో ప్రతీ ఆదివారం రాత్రి 9.00కు

ప్రసారమవుతున్న

## 'ఆలస్యం అమృతం విషం'

కామెడీ సీరియల్ తరపున

## శ్రీ శివాజీ రాజా

ఈ పాటను భానుమతి పాడి అభినయించగా సన్నివేశ ప్రాధాన్యంగా ఆమెతో పాటు సారంగపాణి, తంగవేలు, మరికొంత మంది ఉపపాత్రధారులు కనిపిస్తారు. ఈ పాటకి హిందీ చిత్రంలో ఆశాభోస్లే పాడిన 'దేఖోజీ చాంద్‌నిక్‌లా పీఛేఖజూర్‌కే' అనే పాట ట్యూన్‌ని తీసుకున్నారు. తమిళ చిత్రంలో ఈ ట్యూన్‌కి పల్లవి - అళగాన పెణ్ణునాన్- అంటూ వస్తుంది. భానుమతి హిట్స్‌లో ఒకటైన 'అందెంలో పందెమేస్తా' పాట ట్యూన్ క్యాచీగా వుండటం చేత ఆ రోజుల్లో చాలా మంది నోట నానేది. ఈ పాటకు సంబంధించి ఓ తమాషా సంఘటన వుంది. భానుమతి తను రాసిన 'అత్తగారు' కథల ద్వారా తన నిజ జీవితంలోని అత్త గారికి చాలా పాపులారిటీని తెచ్చిపెట్టేరు. అప్పుడప్పుడు ఆవిడ భానుమతితో పాటు షూటింగ్‌లకు వెళ్లేవారు. ఈ పాట షూటింగ్‌కి ముందు భానుమతి తను మేకప్ అవుతూ స్క్రిప్ట్‌ని ఆవిడ చేతికిచ్చారట. ఆవిడ ఆ స్క్రిప్టుని చూస్తూ - తన ట్యూన్‌లో ఒణుకుతున్న గొంతుతో తనలో తాను పాడుకోవటం మొదలుపెట్టారట. అది తెలియని తక్కినవాళ్ళు "భానుమతిగారూ! పెద్దమ్మ గారు అందంలో పందెం వేసి అందర్నీ ఓడిస్తానంటున్నారు... మీ అత్తగారే మీతో పోటీపడుతున్నారు బాబోయ్" అంటూ గొల్లున నవ్వడంతో - ఇదంతా భానుమతి గారు కావాలనే చేశారని అర్థం చేసుకుని - పాట కాగితం పడేసి - భానుమతి గారి దగ్గరకొచ్చి 'ఏమే ఇందుకా నన్ను పాట చదవమన్నావ్?' అంటూ బుగ్గ పొడిచి బోసినోటితో నవ్వారట.

దౌలత్ : రావేరావే తారాజువ్వా రంగేళిరవ్వా నా రంగేళిరవ్వా
నీకూ నాకూ ఈడూ జోడూ ఏమంటావ్ గువ్వా?
నువ్వేమంటావ్ గువ్వా?

బుల్ బుల్ : పోరా పోరా తస్సాదియ్యా పోకిరి మావయ్యా
ఓ పోకిరి మావయ్యా
ఉల్వామాటలు విన్నానయ్యా ఒద్దంటామియ్యా
నే నొద్దంటామియ్యా ॥రావే॥

బుల్ బుల్ : రవ్వాలేదు - గువ్వా లేదు
మస్కా లెందుకు పోపోరా
యీ మస్కాలెందుకు పోపోరా.

దౌలత్ : మస్కారాయుడు కాడే దౌలత్ మాట నమ్మవే నా ప్యారీ
నామాట నమ్మవే నా ప్యారీ

బుల్ బుల్ : వస్తా మళ్ళీ రైరో, రస్తా ఛోడో వ్యాపారీ రస్తాఛోడో వ్యాపారీ ॥రావే॥

బుల్ బుల్ : అల్లిబిల్లి గారడీలు నా చెంత సాగవోయ్ నా చెంత సాగవోయ్ ॥అల్లి॥

దౌలత్ : కల్లోకూడ నీపై మోజే కాదంటే నే నొల్లనే కాదంటే నే నొల్లనే ॥కల్లో॥
అల్లాతోడు మెళ్ళో తాళి కట్టేతీరుతా-ఒట్టు కట్టేతీరుతా ॥పోరా॥










ఈ పాటను తోలేటి రాయగా పిఠాపురం నాగేశ్వరరావు, జిక్కి పాడేరు. సారంగపాణి, ఎం.ఎన్.రాజంపై చిత్రీకరించారు. ఇక్కడ ఎం.ఎన్.రాజం గురించి కొంచెం చెప్పాలి. ఈవిడ చిన్న చితకా వేషాలేస్తూ క్రమక్రమంగా గుర్తింపు తెచ్చుకుని తెలుగులో 'మాబాబు' అనే చిత్రంలో అక్కినేని నాగేశ్వరరావుకు రెండవ భార్యగా నటించింది కూడా. ప్రస్తుతం తెలుగులో డబ్ అవుతున్న కొన్ని తమిళ సీరియల్స్‌లో నటిస్తోందీమె. ఈ పాటకు హిందీ చిత్రంలో మహమ్మద్ రఫీ, షంషాద్ బేగం పాడిన 'చల్లో చల్లో చల్లో చల్లే హమ్ బబూల్ కె పలే' అనే పాట ట్యూన్‌ని తీసుకున్నారు. సరదాగా సాగిపోయే ఈ పాటలో 'ప్యారీ-వ్యాపారీ' అనే పద ప్రయోగం కాస్త తమాషాగా అనిపిస్తుంది.

అ: ప్రియతమా! మనసుమారునా?
ప్రేమతో, సిరులు నిలచి మీరునా?

ఆ: తేనెలూరే, పాటలన్నీ
తీరుగా నీటిపైన వ్రాతలే కదా! ॥తేనె॥

అ: ఖుదాపై బాస చేతునే
హృదయమే నీది మధుర భాషిణీ
ప్రియతమా! మనసుమారునా?
ప్రేమతో, సిరులు నిలచి మీరునా?

అ: నా మనోహరీ
వినుము నీ గులామునే

ఆ: ఓ మనోహరా
కొనుము నా సలాములే ॥అ: నా మనోహరీ॥
తేనెలూరే పాటలన్నీ
తీరుగా నీటిపైన వ్రాతలే కదా

అ: జవ్వనీ నీవులేని జన్మమే వృధా

ఆ: సుందరా నీవులేని అందమే వృధా ॥జవ్వనీ॥

ఆ: వలపుమీర తనివితీరా
హాయిగా ప్రణయసీమ
సాగిపోదమా ॥వలపు॥

ఇ: ప్రియతమా మనసు మారునా
ప్రేమతో సిరులు నిలచి మీరునా ॥ప్రియతమా॥
ప్రియతమా...









ఆల్‌టైమ్ హిట్‌సాంగ్ ఇది. భానుమతి-ఎ.ఎం.రాజా కలిసి పాడిన పాటలలో చాలా మందికి ఎక్కువ కాలం గుర్తుండిపోయిన పాట ఇది. ఈ పాటను భానుమతి, ఎం.జి.రామచంద్రన్‌పై చిత్రీకరించారు. తమిళ వెర్షన్‌లో 'మాసిలా ఉణ్మైకాదలే' అంటూ మొదలయ్యే ఈ పాటకు హిందీ చిత్రంలో మహమ్మద్ రఫీ, ఆశాభోస్లే పాడిన 'ఏ సభా వున్‌సె కెహ జరా' పాట ట్యూన్‌ని తీసుకున్నారు. తెలుగు లేదా తమిళ గీతాన్ని, హిందీ గీతాన్ని పక్కపక్కన పెట్టుకుని వినటం తటస్థిస్తే ఖచ్చితంగా హిందీలో సమకూర్చిన గీతమే హాయిగా వినసొంపుగా వుందనిపిస్తుంది. అందుకు కారణం-తెలుగు తమిళ వెర్షన్‌లలో తాళగతిలో వేగాన్ని కొంచెం పెంచారు. ఈ 'ప్రియతమా మనసు మారునా' పాటలోని రెండవ చరణంలోని - జవ్వని నీవు లేని జన్మమే వృధా/సుందరా నీవు లేని అందమే వృధా' వాక్యాలలోని శబ్ద సౌందర్యం ఆకట్టుకుంటుంది. హిందీ పాటలోని - జిందగీ... తూ నహీ తో జిందగీ నహీ/చాందినీ... తూ నహీతో చాందినీ నహీ' అనే వాక్యాలు ఇందుకు ప్రేరణ కావొచ్చు. ఇక హిందీ పాటకి తెలుగు (తమిళ) పాటకి ఇంటర్‌లూడ్స్‌లో కూడా తేడా వుంది. తెలుగుపాట ఇంటర్లూడ్ వింటుంటే 'సంతానం' (1955) సినిమాలో ఘంటసాల పాడిన 'చల్లని వెన్నెలలో చక్కని కన్నె సమీపములో' పాట యొక్క ఇంటర్లూడ్స్ నడిచిన పద్ధతి గుర్తు వస్తుంది.

ఇద్దరు : ఇలా ఆడేది పాడేది కాసుకే
సుబ్బు : దగాచేసేది కొందరు కాసుకే
సాయి : కళ్ళుమూస్తారు, నమ్మించి వేస్తారు టోపీ
కాసుకే, కాసులకే ॥ఇలా॥
సాయి : పళ్ళులేనట్టి పండుముసలి
అల్లుణ్ణి చూసి, తమ పిల్లగొంతు
కోస్తారు చాలా మంది ॥పళ్ళు॥
ఇద్దరు : అంతా కాసులకే దాసులనీ
తెలుసుకో... ॥అంతా॥ ఓ... ॥ఇలా॥
సుబ్బు : బాటసారుల్ని చేరబిలచి
దగాను తలచి
పరించుతారు పాఠాలు
చాలామంది ॥బాట॥
ఇద్దరు : అంతా కాసులకే-దాసులనీ
తెలుసుకో... ॥అంతా॥ ఓ... ॥ఇలా॥



ఈ పాటను ఆరుద్ర రాయగా జమునారాణి బృందం పాడేరు. అప్పటి నృత్య తారలైన సాయి, సుబ్బులక్ష్మి అభినయించారు. ఎం.జి.ఆర్., భానుమతి, యం.జి.చక్రపాణి (యం.జి.ఆర్. అన్న పాత్రధారి నిజ జీవితంలో కూడా అన్నగారే), విద్యావతి (యం.జి.ఆర్. వదిన పాత్రధారిణి), అప్పటి హాస్యనటుడు రాజగోపాల్, సారంగపాణి, యం.యన్.రాజం తదితరులు కూడా ఈ నృత్య గీతంలో కనిపిస్తారు. ఇది చాలా మంచి ట్యూన్. ఇవాళ విన్నా కూడా ఎంతో ఫ్రెష్‌గా ఫీలవుతాం. ఇటీవల వస్తున్న రీ మిక్సింగ్ సాంగ్స్‌కి పనికివచ్చే పాట ఇది. 'కళ్ళుమూస్తారు నమ్మించివేస్తారు టోపీ కాసుకే' అనే లైను వచ్చినప్పుడు వినిపించే ట్యూన్ సలిల్ చౌధురి శైలిని గుర్తుకు తెస్తుంది. జమునారాణికి గల మంచి పాటలలో ఒకటైన ఈ పాటకు ఇంకా ఎంతో గుర్తింపురావలసివుంది.

హెచ్.ఎం.వి.వారు ఈ 'ఆలీబాబా 40 దొంగలు' లోని పాటలని, ఎన్.టి.ఆర్. 'ఆలీబాబా 40 దొంగలు' లోని పాటలని కలిపి ఓ కాంబినేషన్ క్యాసెట్‌గా విడుదల చేయబోతున్నారట. అది గనుక విడుదలయితే శ్రోతలలో ఎక్కువ మంది ఈ పాటను అభిమానించే అవకాశం వుంది. ఈ పాట తమిళ వెర్షన్ 'ఇలా ఆడువదుం పాడువదుం కాసుక్కు' అని మొదలవుతుంది.

నిను విడబోను - నిజముగను ॥2॥
కపటమంతా కనుగొనినాను
ఎపుడో నేను ॥నిను॥
పిలువగనే - ప్రేమమీర
చెంత చేర చింతించవలదె
మోసగించ మిగులలేరు
ఆడమనసు తెలియలేరు
వగలు గొలిపి వలపు తెలిపి
వమ్ము చేసిన వదలబోను ॥నిను॥
మనసు కలిపే - మాటలాడి
వంచన చేయ వంచించగలను
మంచి మనసని ఎంచినపుడే
కొంచెమైనా తెలియలేదు
కోరుకొనిన ప్రేమనేడు
దూరమైతే నే నోర్వలేను ॥నిను॥



ఈ పాటను ఆరుద్ర రాయగా భానుమతి స్వీయగానంతో నృత్యం చేసి అభినయించారు. ఎం.జి.ఆర్, ఎం.జి.చక్రపాణి, విద్యావతి, సుశీల (ఎం.జి.ఆర్. చెల్లెలు పాత్రధారిణి), సారంగపాణి, యం.యన్.రాజం కూడా కనిపిస్తారీ పాటలో. తమిళ వెర్షన్ 'ఉణ్మై విడమాట్టే' అనే పల్లవితో మొదలువుతంది.

చరణాలలో - మోసగించి మిగులలేరు ఆడమనసు తెలియలేదు - అనే లైను దగ్గర జతపడ్డ ట్యూన్ వినండి. ఈ కోవలో తెలుగులో ఎన్నో పాటలు వచ్చాయని అనిపిస్తుంది. సుసర్ల హిట్స్‌లో ఇదొకటి.

సాకీ : అల్లా, నీ కరుణవల్లే, గులామ్మై, వచ్చెనే
యోగం, మహారాజరాజభోగం
చవిచూడరా సుఖించరా!...
పల్లవి : ఖుషీ ప్రపంచం-నీకే సొంతం
సెయ్యర-సెయ్యర-సెయ్యరా
నువు జల్సా సెయ్యర - సెయ్యర - సెయ్యరా!
చరణం: నశీబులో సిరి రాసేవుంటే...
ఫకీరుమారు - అమీరుగా
చేత్తో పైసా - విసిరావంటే
స్వర్గం భూమికి జారునురా
దాచకురా!
దాచకురా, ఒక కాసైనా - ఇక -సెయ్యర
సెయ్యర, సెయ్యరా, నువు జల్సా
చరణం: నల్లని మీసం తెల్లబారినా
చిల్లర.కోర్కెలు చావవురా
ముదుసలి పళ్ళు రాలిపోయినా
ముద్దూ ముచ్చట తీరదురా
నిజమేరా
నిజమేరా, నీ పంట పండెరా - సెయ్యర
సెయ్యర - సెయ్యరా - నువు జల్సా
చరణం: రూకలు చూస్తే కాకుల్లాగ
చక్కని చుక్కలు వాలునురా
పక్కన చేరి...
పక్కన చేరి - టక్కులు చూపి
హుక్కా చేతికి - యిస్తారురా
భామలతో...
భామలతో - సయ్యాటలాడరా
భళిర -భళిర-భళిరా
నువు జల్సా - సెయర, సెయర సెయరా



ఈ పాటను అప్పటి హాస్యనటుడు తంగవేలు అభినయించారు. ఈ పాటకు మూలం మళ్ళీ హిందీ చిత్రంలోని - ఫటీ హుయీ కిస్మత్ కీ కాఫర్ సియెజ సియెజ సియెజ అనే పాట! ఈ హిందీ పాటను మహమ్మద్ రఫీ పాడేరు. తమిళ వెర్షన్‌లో - ఉల్లాస ఉలగం ఉణక్కే సొంతం, సెయ్యడ సెయ్యడ సెయ్యడ సెయ్యడ నీ జల్సా సెయ్యడ సెయ్యడ సెయ్యడ' - అనే పల్లవితో వచ్చిన పాటను మన ఘంటసాల పాడేరు. దొరికితే ఈ తమిళ గీతాన్ని సంపాదించి వినండి - ఘంటసాల నోట తమిళ భాష ఎంత బాగా పలికిందోనని అనుకుంటూ - ఇవాళ పరభాషా గాయకుల నోట తెలుగుకు పట్టిన గ్రహణాన్ని తల్చుకుంటూ బాధపడని తెలుగువాడుండని అనిపిస్తుంది. (ఈ పాటను తెలుగులో పాడింది పిఠాపురం నాగేశ్వరరావు అని కొందరు, కాదు ఘంటసాలేనని మరికొందరు అంటున్నారు. ఈ పాట 'హాసం' కలెక్షన్స్‌లో లేనందువల్ల, ఈ విషయమై ఈ వ్యాసకర్తకు సరియైన సమాచారం ఈ వ్యాసం రాసే ఆఖరి నిముషం వరకు లభించనందువల్ల స్పష్టంగా పేర్కొనలేకపోతున్నందుకు మన్నించాలి.)

సలాం బాబు సలాం బాబు రండి చూడండీ
వన్నె చిన్నె లన్ని చూప వచ్చితిమండి ॥సలాం॥
ఓ............. ఓ............
చుక్కల్లో వెలుగులే చూపిస్తాం చూపులో
పువ్వుల్లో జిలుగులే రువ్వేస్తాం నవ్వులో
చుక్కల్లో వెలుగులే చూపిస్తాం చూపులో
పువ్వుల్లో జిలుగులే రువ్వేస్తాం నవ్వులో
తళుకులివే -బెళుకులివే
తళుకులివే - బెళుకులివే - బలే బలే చూడరే
రేపే లేదురా - నేడే నీదిరా ॥2॥
చిటికైనా - నీ సౌఖ్యం విడబోకురా ॥సలాం॥
కస్తూరి గంధాలు కురిపిస్తాం సొంపులో
హరివిల్లు అందాలు అందిస్తాం ఒంపులో
కస్తూరి గంధాలు కురిపిస్తాం సొంపులో
హరివిల్లు అందాలు అందిస్తాం ఒంపులో
ఒంపులివే - సొంపులివే
ఒంపులివే - సొంపులివే -బలే బలే చూడరే
రేపే లేదురా - నేడే నీదిరా ॥2॥
చిటికైనా, నీ సౌఖ్యం విడబోకురా ॥సలాం॥



ఈ పాటను తోలేటి రాయగా జిక్కి, బృందం పాడేరు. తంగవేలు ప్రధాన పాత్రధారిగా కనిపించే ఈ సన్నివేశంలో వహీదా రెహమాన్ నృత్యం చేస్తూ అభినయించింది. తమిళంలో ఈ పాట పల్లవి - సలం బాబు సలాం బాబు ఎన్నై పారంగో- అని వుంటుంది. ఇది కూడా చాలా మంచి ట్యూనే.... ఫ్రెష్‌నెస్ విషయంలోనూ, రీమిక్సింగ్ విషయంలోనూ 'ఇలా ఆడేది పాడేది కాసుకే' పాటకు పేర్కొన్న లక్షణాలన్నిటినీ ఈ పాటకు కూడా అన్వయించుకోవచ్చు. జిక్కిగారు ఇవాళ ఇస్తున్న స్టేజి ప్రోగ్రామ్‌లలో ఈ పాటను కూడా చేరిస్తే మంచి రెస్పాన్స్ వచ్చి ఈ సినిమా పాటల పట్ల కొంత మంది దృష్టి అయినా పడుతుందని ఈ వ్యాసకర్త అభిప్రాయం.

సాకీ : నీ సుగుణాల చూచియే
జిందాబాద్ అందునోయి
సిరి చూచి కాదోయి -
నా మనసునే దోచి, నీ
వలపుశ్రీల నింపినావు -
ప్రియతమా - ఏలుకోవోయి.

పాట : అమీరువో - గరీబువో -
విభేద మెందుకు
ఒహో ప్రేమికా - ఓహో ప్రేమికా
సరాగముల - సాగు ముందుకు ॥అమీ॥
హాయిలేని జీవితాన - రేయి ముసిరినా
మాయమైన చందమామ - మరల వెలిగెను
హాయిలేని జీవితాన - రేయి ముసిరినా
మాయమైన చందమామ - మరల వెలిగెను
నిను జాబిలి - విరాళితో - వరించె తారక ॥ఒహో॥
సిరులు పోయి పేదనైతి - మరులు కలిగెను
మరులు వినా మరలిపోవు - సిరులు కోరను
సిరులు పోయి పేదనైతి - మరులు కలిగెను
మరులు వినా మరలిపోవు - సిరులు కోరను
అనురాగమే - అపారమై తరించె జీవిక ॥ఒహో॥











## పాత్రలు-పాత్రధారులు

| | | |
|---|---|---|
| ఆలీబాబా | : | ఎం.జి.రామచంద్రన్ |
| మార్జియానా | : | పి.భానుమతి |
| సలీమా | : | విద్యావతి |
| బుల్ బుల్ | : | యం.యన్.రాజం |
| అయేషా | : | సుశీల |
| అబ్బుహుసేన్ | : | పి.యస్.వీరప్ప |
| దౌలత్ | : | కె.సారంగపాణి |
| గులాం | : | కె.ఎ.తంగవేలు |
| కాశింఖాన్ | : | యం.జి.చక్రపాణి |
| షేర్‌ఖాన్ | : | నందారాం |
| హమీద్ | : | దేవర్ |
| అబ్దుల్లా | : | సౌందర్ |
| సిపాయిలు | : | గుండుమణి |
| " | : | గోపాల్ |
| " | : | ముత్తు |
| " | : | జానకిరాం |



ఈ పాటను భానుమతి పాడగా యం.జి.ఆర్., భానుమతి అభినయించారు. హాయిగా పాడుకోదగ్గ పాటలలో ఇదొకటి. సాకీ కన్న పల్లవి, పల్లవి కన్న చరణాలు ఆకర్షణీయంగా రూపొందిన ఈ పాటను భానుమతి పాడిన మంచి పాటలలో లిస్టులోకి ఎందుకు తీసుకోరో అర్థం అవదు. ఈ పాట తమిళ పల్లవి - ఎనై-అన్నైనాలె ఆళ వంద అళ భూపతి- అని వుంటుంది.

చినదాన పసందుగ నాట్యం చేసెదనోయ్
చేతికి రానోయ్ ॥చిన॥
సరసాల పసా - సరదాల నిషా
చిరునవ్వుల భావము తెలుసా
చిరునవ్వుల భావము తెలుసా
నా అందంలో - ఈ సందడిలో
కానున్నది కానగ లేవోయ్
కొనచూపుల చూసిన కోరిక లూరేనోయ్
మనసీయను లేవోయ్ ॥చిన॥
నా కన్నులతో - ఈ వన్నెలతో
నిను బందీ చేసితినోయీ
నిను బందీ చేసితినోయీ
నా పాశములో పడిపోయితివోయ్
నిను విడుదల చేయుట లేదోయ్
పదునైన కటారి మిటారి విలాసములోయ్
స్వర్గము చూపెదనోయ్ ॥చిన॥



ఈ పాటను భానుమతి స్వీయగానంతో నృత్యం చేస్తూ అభినయించగా ఎం.జి.ఆర్., సారంగపాణి, యం.యన్.రాజం, అప్పటి విలన్ పి.యస్.వీరప్ప సన్నివేశంలో కనిపిస్తారు. ఈ పాటకు హిందీ చిత్రంలో ఆశాభోస్లే పాడిన - షర్మాకె లటాకె మై ఏక్‌ఝులక్ దిఖ్‌లావూఁ - అనే పాట ట్యూన్‌ని వాడుకున్నారు. తమిళంలో - ఎన్నాటమిలే ఒరువేట యిలా తానే - అనే పల్లవితో ఈ పాట వుంటుంది. భానుమతి రంగురంగుల డ్రస్సులు మారుస్తూ నాట్యం చేస్తున్న ఈ గీతాన్ని ఇప్పుడు చూసినా సరే హుషారుగా వుంటుంది.

సినిమాలో వున్న 9 పాటలూ హిట్ కావడం ఆ రోజుల్లో పెద్ద విశేషమేమీ కాకపోయినా ఓ సెమీ డబ్బింగ్ చిత్రంలోని పాటలు హిట్ కావటం మాత్రం విశేషమే... అందుకు ఉదాహరణ అతి త్వరలో ఈ పాటలు ఓ కాంబినేషన్ క్యాసెట్ రూపంలోనైనా రాబోవటమే! ■


## మా టీవీ సమర్పించు



జడ్జి: వి.వి.సుబ్రహ్మణ్యశర్మ

MAA TV

## పాడాలని వుంది



సూత్రధారి : యస్పీ బాలసుబ్రహ్మణ్యం



జడ్జి వై.పి. ప్రసాద్

కార్యక్రమాల వివరాలు

### 16వ ఎపిసోడ్- 15-03-03 రాత్రి 8.30 గం॥లకు



1. రాగచైతన్య
   - షిరిడీయే మా పండరి (శ్రీసాయి మహిమ)
   - నీ నవ్వు చాలు (నువ్వు నాకు నచ్చావ్)
   - సరికొత్త చీర (పెళ్ళి పుస్తకం)



2. కరుణ
   - వైష్ణ భార్గవి వాగ్ధవి (స్వాతికిరణం)
   - రామసక్కనోడమ్మ (రాజకుమారుడు)
   - కోయిల పాట బాగుందా (నిన్నే ప్రేమిస్తా)



3. కిషోర్
   - ఘల్లు ఘల్లు (స్వర్ణకమలం)
   - రుక్కు రుక్కు రుక్కుమణి (పెళ్ళి)
   - తెలుసా మనసా (క్రిమినల్)



4. సరస్వతి
   - సావరహే తవదీనా (విప్రనారాయణ)
   - నెల్లూరి నెరజాణా (ఒకే ఒక్కడు)
   - మనసా తుళ్ళి పడకే (శ్రీవారికి ప్రేమలేఖ)

### 17వ ఎపిసోడ్- 22-03-03 రాత్రి 8.30 గం॥లకు



1. రేవతి
   - నీవేరా నా మదిలో (అంతా మన మంచికే)
   - అత్తా రొయ్యలెక్కడే (జానపద గీతం)
   - మీర జార గలడా (శ్రీకృష్ణ తులాభారం)



2. గణేశ్
   - మధుమాస వేళలో (అందమే ఆనందం)
   - కిల కిల నవ్వేటి (జానపద గీతం)
   - మెరిసే మేఘ మాలిక (దీక్ష)



3. కమల ప్రియ
   - సన్నగ వీచే చల్లగాలి (గుండమ్మకథ)
   - బుంగా ఖరీచ్చి (జానపద గీతం)
   - నా కంటి పాపలో (వాగ్దానం)



4. రమణభరద్వాజ్
   - ప్రియతమా నా హృదయమా (ప్రేమ)
   - అత్తరు సాయిబు సచ్చినోడు (జనపద గీతం)
   - మది శారదాదేవి (జయభేరి)

**రచన: చంద్రబోస్** (1) **గానం : ఎస్.పి.బాలు, మాళవిక**

ఆ: లాలలలాల... లాలలలాల... లాలలాలాలా లలలాలా లలలాలా లల లాలాలాలాలా
నువ్వునేను కలిసుంటేనే నాకెంతో ఇష్టం నువ్వునేను మనమైతేనే ఇంకెంతో ఇష్టం
నువ్వు నన్ను ప్రేమించావని నేన్నిన్ను ప్రేమించానని తెలిశాకా...
నువ్విక్కడుండి నేనక్కడుంటే నువ్విక్కడుండి నేనక్కడుంటే ఎంతో కష్టం... ॥నువ్వు॥
ఆ: ఎగరేసిన గాలిపటాలే ఎదలోతుకు చేరుతాయని
అ: రుచిచూసిన కాకిఎంగిళ్లే అభిరుచులను కలుపుతాయని
ఆ: తెగతిరిగిన కాలవగట్లే కథ మలుపులు తిప్పుతాయని
అ: మనమాడిన గుజ్జనగూళ్లే ఒకగూటికి చేర్చుతాయని
ఆ: లాలించి పెంచినవాడే ఇకపై నను పరిపాలిస్తాడని తెలిశాకా....
నువ్విక్కడుండి నేనక్కడుంటే నువ్విక్కడుండి నేనక్కడుంటే ఎంతో కష్టం ॥నువ్వు॥
అ: ఆ బడిలో పాఠాలే మన ప్రేమని దిద్దుతాయని
ఆ: ఆ రైలు పట్టాలే పల్లకిని పంపుతాయనీ...
అ: రాళ్లల్లో మన పేర్లే శుభలేఖలు చూపుతాయనీ..
ఆ: ఆ బొమ్మల పెళ్లిళ్లే ఆశీస్సులు తెలుపుతాయనీ...
అ: తనకై నే నేర్పిన నడకలు ఏడడుగులుగా ఎదిగొస్తాయనీ తెలిశాకా..
నువ్వక్కడుండి నేనిక్కడుంటే నువ్వక్కడుండి నేనిక్కడుంటే ఎంతో కష్టం ॥నువ్వు॥

**రచన: చంద్రబోస్** (2) **గానం : ఎస్.పి.చరణ్, మాళవిక**

అ: ఒక తోటలో ఒక కొమ్మలో ఒక పువ్వు పూసింది
మహారాణిలా మహాలక్ష్మిలా ఆ పువ్వు నవ్వింది అలాగే నవ్వుతూ ఉండాలనీ...॥2॥
నింగినేల, వాగు,వంక, చెట్టు చేమ, గువ్వ గూడు ఆశీర్వదించాలి
కో: లలలాలల...లాలల లాలలాలాల ॥ఒక తోటలో॥
అ: ఎన్నో రంగుల పువ్వు ఎండ కన్నే ఎరగని పువ్వు
సుందరమైన పువ్వు పలు సుగుణాలున్న పువ్వు
ఏ గుడిలో అడుగుపెట్టునో... దేవుడు చల్లగ చూడాలి
ఆ పువ్వుకు పూజలు చేయాలి దేవుడి గుండెల గుడిలో ఆ పువ్వే...హాయిగ ఉండాలి...
కో: లలలాలల...లాలల లాలలాలాల ॥ఒక తోటలో॥
ఆ: నీరును పోసి పెంచి పందిరల్లే నీడనిచ్చి ఎండా వానల్లోనా
ఆదరించే తోటమాలి ఆ పువ్వుకి తోడు ఉండగా...
దేవుడు వేరే లేడు కదా...తోటమాలే పువ్వుకి దేవుడుగా...
మాలికి పువ్వుకు మధ్యన అనుబంధం ఎన్నడూ వాడదుగా...అ: ॥ఒక తోటలో॥

**రచన: చంద్రబోస్** (3) **గానం : కౌసల్య డి.ఐశ్వర్య**

వల్లంకి పిట్ట వల్లంకి పిట్ట మెల్లగ రమ్మంట
చిన్నారి పాప పొన్నారి పాప తోడుండి పొమ్మంట
తను నవ్విందంటే ఇంకేం కావాలి నిదరోతూ ఉంటే...తను పక్క నుండాలి...
ఈ బంగరు పాపను కంటికి రెప్పగా కాచుకోవాలి ॥వల్లంకి॥
గరిసని సమ గరిసా ॥2॥
సగమ నినిప మగమా ॥2॥



అ: పి పి పీ పీ పిల్లా నిను మెప్పిస్తానే నీ పెద్దళ్లను ఒప్పిస్తానే
పిడికెడంత నడుముదాన పెళ్లికి సై అంటే పిఠాపురం నుండి నేను పల్లకి తెప్పిస్తానే
కో: డుంమారే డువ్వ డుండుం డంమారే డవ్వ డండం...
అ: నేనేమో మాష్టారిని నువ్వేమో స్టూడెంట్‌వి
ఇద్దరికి కుదిరేనే పిల్లా మన కథ సుందరకాండేనే పిల్లోయ్
ఆ: పాఠాలే వినకున్నా ప్రయివేట్‌కి రాకున్నా బెత్తంతో కొట్టద్దే సారూ..
కొడితె మెత్తంగా కొట్టులే సారూ...
అ: బెంచి మీద నిలబెట్టను, గోడకుర్చీ వేయించను నా ఒళ్లో కూర్చోవే పిల్లా..
నీకిక వంద మార్కులేస్తానే పిల్లా...
కో: మాష్టారూ... మాష్టారూ... నీకెందుకు ఈ పాడు బుద్దులు
పెద్దోళ్లకి తెలిసిందా అవుతుంది నీ బొక్కు బద్దలు...
ఆ: మ...మ...మ....మామయ్యొది మొగల్తూరు
అ: మీ నాన్నది పాలకొల్లు...నాకు తెలుసు... కో: హైస్సా...హైస్సా...హైస్సా...హైస్సా...
ఆ: నా లాంటి పిల్లతోటి కళ్యాణం కోరుకుంటే పెళ్లానివి నువ్వేనోయ్ సారూ...
నీకు పెనిమిటి నేనవుతానోయ్ సారూ...
అ: అతిలోక సుందరి నా జతకొచ్చి వాలుతుంటే అన్నిటికి దూకేనే పిల్లా...
అటు ఇటు అయినా పర్లేదే పిల్లా...
ఆ: నాలాంటి కన్నెతోటి కాపురమే చేశావో కథ అడ్డం తిరుగుతుంది సారూ...
ఆపై నీ కడుపే పండుతుంది సారూ...
కో: మాష్టారూ...మాష్టారూ...స్టూడెంటు మీకు కాదు జోడు
మామయ్యకి తెలిసిందో మిమ్మల్ని వెంటబడిస్తాడు ॥ఆ:మామయ్యది॥

**రచన: చంద్రబోస్** (7) **గానం : ఎస్.పి.చరణ్, సునీత**

అ: గంగా...నీ ఉరుకులె రాగంగా... నా గుండెల మోగంగా...
సరిగమలే సాగంగా... మధురిమలో మునగంగా...
గంగా...నిజంగా నువ్వే నాలో సగభాగంగా..
ఆ: నీ ఉరుకులె రాగంగా...నా గుండెల మోగంగా...
సరిగమలే సాగంగా... నాలో సగభాగంగా... ॥నీ ఉరుకులే॥
అ: నువ్విచ్చిన మనసే క్షేమం...నువ్వు పంచిన ప్రేమే క్షేమం...
నువ్వయ్యి నేనున్నాను క్షేమంగా...
ఆ: మనమాడిన ఆటలు సౌఖ్యం... మనసాడిన మాటలు సౌఖ్యం...
మనువయ్యే కలలున్నాయి సౌఖ్యంగా...
అ: నీ చెవి వినని ఈ సందేశం నా చదువుకు భాగ్యంగా...
ప్రతిపదమున నువ్వు ప్రత్యక్షం శత జన్మలలోనూ కలగని సౌభాగ్యంగా... ॥గంగా...॥
ఆ: నువు పంపిన జాబుల పూలు నా సిగలో జాజులుకాగా...
దస్తూరి నుదుటన మెరిసే కస్తూరిగా...
అ: నీ లేఖల అక్షరమాల నా మెడలో హారంకాగా
చేరాతలు నా తలరాతను మార్చంగా...
ఆ: నువ్వు రాసిన ఈ ఉత్తరమే నా మనసుకు అద్దంగా...
నువ్వు చేసిన ఈ సంతకమే
మన ప్రేమకు పసుపు కుంకుమ అద్దంగా.. అ: ॥గంగా...॥



**రచన: సామవేదం షణ్ముఖశర్మ** (1) **గానం : చిత్ర**

నవ మన్మథుడా అతి సుందరుడా నువు చూసిన ఆ ఘనుడు
అక్కా ఎవరే అతగాడు ఇట్టే నీ మనసుని దోచాడు
శ్రీరాఘవుడా ప్రియ మాధవుడా నువు వలచిన ఆ ప్రియుడు
చెల్లీ ఎవరే అతగాడు తుళ్లే నీ వయసుకి జతగాడు
గోరు వెచ్చని ఊపిరి వేయి వేణువులూదగా తొలిముద్దు చిందించెనే
వీణ మీటిన తీరుగా ఒళ్లు ఝల్లనె హాయిగా బిగి కౌగిలందించెనే
రతి రాగాలే శృతి చేశాడే జత తాళాలే జతులాడాడే
తనువంత వింత సంగీతమేదో పలికే ॥అక్కా ఎవరే॥ ॥శ్రీరాఘవుడా॥
వాడి చూపుల వాడితో వేడి ఆవిరి రేపెనే నిలువెల్ల తారాడెనే
చాటుమాటున చోటులో ఘాటు కోరికలూపెనే ఒడి చేరి తల వాల్చెనే
జడలాగాడే కవ్వించాడే నడుం ఒంపుల్లో చిటికేశాడే
అధరాలతోనె శుభలేఖ రాసె మరుడే ॥చెల్లీ॥ ॥నవ॥

**రచన: వేటూరి** (2) **గానం : బాలు, చిత్ర**

కిల కిల కిల కిల కిల పడుచుకోకిల పలికె ప్రియగీతిక పెళ్లికిలా
కల కల కల కల కల వలపు దాఖలా తెలిపె శుభలేఖల సరిగమలా
మెరుపుల చెల్లి మా పిల్లకి మేఘాలన్ని పూ పల్లకి
ఏడేడు వర్ణాల ఆషాడవేళ ॥కిల కిల॥
వేచి వేచి వేడెక్కే ఆ వేచి వున్న పండక్కే నే పరుగులు తీస్తున్నా
కాచుకున్న కానుక్కే నే కాచుకొన్న వేడుకే నే నెదురై నిలుచున్నా
కాదే ఔనై కవ్విస్తే కన్నె పిలుపై కబురొస్తే కొమ్మచాటు కోకిలమ్మ గట్టి మేళాలెన్నోపెట్టి
కాళ్లు కడిగి కన్నెనిచ్చి పేరంటాలే ఆడేవేళ ॥కిల కిల॥
జాజులమ్మ కన్నుల్లో ఆ సందె సూరీడున్నట్టే నీ తహ తహ చూస్తున్నా
ఒంటినిండ ఊపొచ్చి ఒంపులెన్నో ఊరించే నీ తకధిమి వింటున్నా
కాయే పండై కలిసొస్తే అది పండేనోపై చిలకొస్తే తోటలోని పూలన్నీసిరి తోరణాలై దీవిస్తుంటే
గోరువంక పెళ్లి మంత్రాలెన్నో చదివే సుముహూర్తానా ॥కిల కిల॥

**రచన: సిరివెన్నెల సీతారామశాస్త్రి** (3) **గానం : బాలు, చిత్ర**

ఆ: హృదయమనే కోవెల తలుపులు తెరిచే తాళం ప్రేమా ప్రేమా - ప్రేమా ప్రేమా...
అ: ఆ... త్యాగమనే దేవత సన్నిధి వెలిగే దీపం ప్రేమా ప్రేమా - ప్రేమా ప్రేమా
ఆ: అణువుణువును చెలిమికి అంకితమిచ్చును ప్రేమ
అ: తను నిలువున కరుగుతు కాంతి పంచునది ప్రేమ
ఆ: గగనానికి నేలకి వంతెన వేసిన వానవిల్లు ఈ ప్రేమ ప్రేమా ప్రేమా - ప్రేమా ప్రేమా
ఆ: ఇవ్వడమే నేర్పగల ఈ ప్రేమ తన కొరకు ఏ సిరిని అడగదు కదా
అ: నవ్వడమే చూపగల ఈ ప్రేమ - మంటలనే వెన్నెలగ మార్చును కదా
ఆ: గాలికి, గంధము పూయడమే పూలకు తెలిసిన ప్రేమ కథ
అ: రాలిన పూవుల జ్ఞాపకమే కాలం చదివే ప్రేమ కథ
ఆ: ప్రియమైన తనవారి సుఖశాంతులే కోరి మురిసేటి గుణమే ప్రేమా
ప్రేమా ప్రేమా - ప్రేమా ప్రేమా ॥హృదయమనే॥



కన్నుల కలయిక కలనే కలుగక మలుపొకటే కళ్యాణం
టట్టడార టట్టడం టట్టడార టట్టడం॥2॥ ॥సరిగమపదనిస॥
గళము కోసమె గాత్రమున్నది స్వరము కోసమె సరళి వున్నది
పొరుగు కోసమె పేపరున్నది అతిథి కోసమె తిథులు వున్నది
పూత కోసమె మావి వున్నది కూత కోసమె కోయిలున్నది
కోత కోసమె కరెంటు వున్నది పెళ్లి కోసమె పేరంటమున్నది
తాళి కోసమె ఆలి వున్నది జారిపోవుటకె చోళీవున్నది
బ్రహ్మచారికై మెస్సులున్నవి ఖర్మకాలుటకె బస్సులున్నవి
నగల కోసమె మెడలు వున్నవి సుముహూర్తానికి చూపులున్నవి
సరిగమప్పాపనిస రాగం త్వరపడుతున్నది మాఘం
తకధిమి॥4॥ తాళం ఎపుడెపుడన్నది మేళం
హృదయ నాదమై మధురదాహమై ఎదలు దోచుటకె పాటలున్నవి
పాలము లోపల కుప్పకుప్పగా కూలిపోవుటకె ఫ్లయిటులున్నవి
రామకోటికే బొమ్మలున్నది ప్రేమ కాటుకే భామలున్నది
క్యూల కోసమె రేషన్లుఉన్నది కునుకు కోసమె ఆఫీసులున్నది
మధురవాణి మా వెంట వున్నది నాట్యరాణి మా ఇంట వున్నది
కీరవాణిలా ఆర్టు వున్నది బాలులోని టాలెంటు వున్నది
నీయమందుటకె బందరున్నది ఒకటయ్యేందుకె ఇద్దరున్నదీ
ససస స్సాస్సాస్స సామ్మారీసనిప సరిగమపదనిస రాగం
పనిపమపా మ్మారీ నిపమరిస నీనీ ససా నిసరిమపమరిస నిసరిమపమరిస రాగం
పాస్నీస పాస్నీస పనిపనిపమ మాప్పాని మాప్పాని సనిపమరిస సరిగమ పదనిస రాగం
ఆ... సరిగమపదనిస రాగం ఆ...ఆ...ఆ...ఆ...ఆ... ఆ.... ఆఆఆఆఆఆఆఆ

**రచన: వేటూరి** (9) **గానం : బాలు, చిత్ర**

అభ్రపథమ్మున విభ్రమ విలసిత శుభ్రకౌముదీ దీపికా
దుగ్ధాంభోనిధి జనిత లలిత సౌందర్య ముగ్ధశ్రీ నాయికా
చెమ్మచెక్క చెమ్మచెక్క చారడేసి మొగ్గా ఎర్రబడ్డ కుర్రబుగ్గ ముద్దుపేరు సిగ్గా
లేత పెదవులే పగడ కాంతులు బొట్టు ఎరుపులె పొద్దు పొడుపులు
రామ చిలక ముక్కు పుడక రమణి పాప... ఓఓఓ ॥చెమ్మ॥
తారలెన్ని వున్న ఈ తళుకే నిజం చలన చిత్ర మీవు చక్కని చక్కెర శిల్పం
మనసు తెలుసుకుంటె అది మంత్రాలయం
కనులు కలుపుకుంటె అది కౌగిలికందని ప్రణయం
ముందు నువ్వుపుట్టి తరువాత సొగసుపుట్టి పరువానికి పరువైన యువతీ
వయసు కన్ను కొట్టి నామనసు వెన్నుతట్టి మనసిచ్చిన మరుమల్లెకు మరిదీ
దోరసిగ్గు తోరణాల తలుపుతీసి... ఓఓఓ ॥చెమ్మ॥
చిలిపి మనసు ఆడే ఒక శివతాండవం పులకరింత కాదు అది పున్నమి వెన్నెల కెరటం
పెదవి చాటు కవిత మన ప్రేమాయణం వలపు ముసురు పడితె పురివిప్పిన నెమలిపింఛం
అందమారబెట్టే అద్దాల చీరకట్టే తడియారిన బిడియాల తరుణీ
మనసు బైటపెట్టి మౌనాలు మూటకట్టే మగసిరిగల దొరతనమెవరిదనీ
బొడ్డుకాడ బొంగరాలు ఆడనీయి... ఓఓఓ ॥చెమ్మ॥

**రచన: వేటూరి (5) గానం : కీరవాణి, గంగ, కల్పన, శ్రీవర్ధిని**

అ: ఓం...జీవన వాహినీ...పావనీ...
కలియుగమున కల్పతరువు నీడ నీవని
కనులు తుడుచు కామధేను తోడు నీవని
కో: వరములిచ్చి భయము తీర్చి శుభము గూర్చు గంగాదేవి
అ: నిను కొలిచిన చాలునమ్మా సకల లోక పావని
భువిని తడిపి దివిగ మలచి సుడులు తిరుగు శుభగాత్రీ గంగోత్రి...
కో: గంగోత్రి... అ: గంగోత్రి... కో : గంగోత్రి...
కో: గంగోత్రి...గల గల గల గంగోత్రి హిమగిరి జని హరి పుత్రి ॥2॥
అ: జీవన వాహినీ...పావనీ... ఆ....ఆ....ఆ....ఆ....
మంచుకొండలో ఒక కొండవాగులా ఇల జననమొందిన విరజా వాహినీ...
కో: సానిదగరిసనిదపమగరి సరి సరి గమ గమ గరిస
అ: విష్ణు చరణమే తన పుట్టినిల్లుగా శివగిరికి చేరిన సుర గంగ నీవనీ...
కో: ససససరిసరి గరిగమగమ దప దప దప దప గరి సరి సరి సరి
అ: అత్తింటికి సిరుల నొసగు అలకనందవై సగర కులము కాపాడిన భాగీరథివై
బదరీవన హృషికేశ హరిద్వార ప్రయాగముల మణి కర్ణిక
తన లోపల వెలసిన శ్రీ వారణాసి గంగోత్రి...
కో: గంగోత్రి... అ: గంగోత్రి... కో : గంగోత్రి...
కో: గల గల గల గంగోత్రి హిమగిరి జని హరిపుత్రి....
కో: పసుపు కుంకుమతో... పాలు పన్నీటితో... శ్రీగంధపు ధారతో...
పంచామృతాలతో...అంగాంగం తడుపుతూ...దోషాలను కడుగుతూ...
గంగోత్రికి జరుపుతున్న అభ్యంగన స్నానం
అ: అమ్మా...గంగమ్మా...కృష్ణమ్మకు చెప్పమ్మా కష్టం కలిగించొద్దని
యమునకు చెప్పమ్మా సాయమునకు వెనకాడొద్దనీ...
గోదారికీ...కావేరికి...ఏటికి.... సెలయేటికి...కురిసేటి జడివానకి...
దూకే జలపాతానికి...నీ తోబుట్టువులందరికీ...చెప్పమ్మా...మా గంగమ్మా...
జీవ నదివిగా... ఒక మోక్ష నిధివిగా... పండ్లు పూలు పసుపులా పారాణి రాణిగా...
కో: శివుని జటలనే తన నాట్య జతులుగా జలక మాడు సతులకు సౌభాగ్య దాత్రిగా...
అ: గండాలను పాపాలను కడిగివేయగా... ముక్తి నదిని మూడు మునకలే చాలుగా
జలదీవెన తలకుపోసే జననీ గంగాభవాని
ఆమె అండ మంచు కొండ వాడని సిగ పూదండ...గంగోత్రి...
కో: గంగోత్రి... అ: గంగోత్రి... కో: గంగోత్రి...
గల గల గంగోత్రి హిమగిరి జని హరిపుత్రి ॥3॥
అ: జీవన వాహినీ...పావనీ...

**రచన: చంద్రబోస్ (6) గానం: మనో, సునీత**

ఆ: మ్మ...మ్మ...మ్మ...మ్మ...మ్మ...మ్మా...మ్మ...మ్మ...
మామయ్యది మొగల్తూరు మా నాన్నది పాలకొల్లు ॥2॥
మనువాడే ఈడు నాకు వచ్చిందంటూ
మగవాళ్ల మధ్యన తిరగొద్దంటున్నారు
మామయ్యా...మా నాన్నా... ॥మామయ్యది॥



పాప్పా మగమ్మామ్మా గసగ్గాగ్గా సనిసా ॥2॥
చిరు చిరు మాటలు పలికే వేళ చిలక దిష్టి
బుడి బుడి అడుగులు వేసే వేళ హంస దిష్టి
వెన్నెలమ్మలా నవ్వేవేళ జాబిలి దిష్టి
జాబిలమ్మలా ఎదిగేవేళ దిష్టి చుక్క దిష్టి
ఇరుగు దిష్టి పొరుగు దిష్టి నా దిష్టి దేవుని దిష్టి
ఏ దిష్టి తనకు తగలకుండా నువ్వే చూడాలి ॥వల్లంకి॥
ఆటలాడగా చిట్టి చేతిలో బొమ్మ నవుతా... ఆకలేయగా బుల్లి బొజ్జలో బువ్వ నవుతా...
స్నానమాడే చల్లని వేళ వేన్నీళ్లవుతా...ఎక్కెక్కి ఏడ్చేవేళ కన్నీళ్లవుతా...
నేస్తాన్నవుతా...గురువు అవుతా...పనిమనిషి తనమనిషవుతా...
నే చెప్పే ప్రతిమాటకు నువ్వే సాక్ష్యం అవ్వాలి...వల్లంకి పిట్ట వల్లంకి పిట్ట మెల్లగ రమ్మంట...
మా మంచిపాట సిమ్మాద్రి పాట మనసారా వినమంట
తన తియ్యని పాటే అమ్మ పాడేలాలీ...తన తోడే ఉంటే అది దీపావళీ...
మా ఇద్దరి స్నేహం వర్ధిల్లాలని దీవెనలివ్వాలి ॥వల్లంకి పిట్ట॥

**రచన: చంద్రబోస్ (4) గానం : ఎస్.పి.చరణ్, శ్రీవర్ధిని, డి ఐశ్వర్య**

కో: చిక్‌బుక్...చిక్‌బుక్...చిక్‌బుక్...
అ: గంగోత్రి కో: చిక్‌బుక్...చిక్‌బుక్...చిక్‌బుక్...
ఇ: రైలుబండి రైలుబండి కూతలోనె పాట ఉంది పాటలోని స్వరాలన్నీ ॥కో: చిక్ బుక్॥
ఆ: సరిగమ సరిగమ సరిగమపదనిస
ఇ: రైలుబండి రైలుబండి నడకలోనే నాట్యం ఉంది నాట్యంలోని జతులన్నీ
కో: చిక్‌బుక్...చిక్‌బుక్...చిక్‌బుక్... ఆ: తకదిమి తకదిమి తకదిమి తకజణు
ఆ: అలసట లేని సంగీతాన్ని వినిపిస్తుందండీ...
మనుషుల మధ్య దూరాలన్నీ చెరిపేస్తుందీ రైలుబండి... ॥కో:చిక్‌బుక్॥
అ: కేరళలోన కొబ్బరి నీళ్లు తాగిస్తుందండీ...
కర్ణాటక బిసిబేళ బాతు తినిపిస్తుందండి
ఆ: ఆంధ్రలోన పెసరట్టు ఉప్మా పార్శిల్ కట్టించి
మహారాష్ట్రల్లో మధ్యాహ్నానికి రోటీ ఇస్తుంది ॥కో:చిక్‌బుక్॥
ఇ: ఆగ్రా సౌధం చూపించి సిమ్లా ఆపిల్ అందించి...
హరిద్వారులో అడుగేసి హృషికేష్‌లో తిప్పించి
గంగోత్రికి చకచకమంటూ పరుగులు తీస్తుంది...
కో: కూకూ....కూ.....కుకుకుకూ....... అ: గంగోత్రి ॥కో:చిక్‌బుక్॥
ఆ: ఎండల్లోన మండుతు ఉన్నా నీడను మనకిచ్చి
వానల్లోన తానే తడిసి గొడుగవుతుందండీ... ॥కో:చిక్‌బుక్॥
ఆ: రాత్రంతా తను నిద్దరమాని మేల్కొంటుందండీ
అమ్మల్లే మనకూయలూపి జోకొడుతుందండీ... ॥కో:చిక్‌బుక్॥
ఇ: సెలవులు తనకు వద్దంటూ స్నేహితులను మనకందిస్తూ...
అందరి భారం మోసేస్తూ... కోరిన తీరం చేరుస్తూ...
మతమూ కులమను భేదం తనకు లేవంటుందండీ...
మానవ జాతిని ఒకే తాటిపై నడిపిస్తుందండీ...
కో: చిక్‌బుక్...చిక్‌బుక్...చిక్‌బుక్... అ: గంగోత్రి ॥రైలుబండి॥



ఏక్ దో తీన్ సాంగుతో యవ్వనాల ఎరవేసిన మాధురీదీక్షితా
వెన్నపూస వన్నెలతో జున్ను ముక్క బుగ్గలున్న జూహీచావ్‌లానా
అరేబియన్ గుర్రమంటి నలక నడుము నగమానా
హోయ్‌కుస్తా బహారనిపించే కుర్ర పిల్ల ఖుష్‌బూనా
నీ మగసిరి మెచ్చుకుంది మమతాకులకర్ణా
నీ టాపు లేపింది టాబూనా శిల్పాశెట్టి లాంటి చిలకభామా
శ్రీదేవిలాంటి చందమామా... హేహేహే... మోహిని రూపిణి రేవతీనా
చెప్పర నాయనా ప్రియారామనా ఒక్క ముక్క చెప్పచాలు మోగుతాది పెళ్లిడోలు ॥రమ్యకృష్ణ॥
కుర్రోళ్ళు ముసలోళ్ళూ వెర్రెక్కి వేడెక్క నవ్వుల రోజానా
శోభనపు పెళ్లికూతురల్లె తెగ సిగ్గుపడే సొగసరి మీనానా
బెల్లం ముక్క లాంటి బుల్లి గడ్డమున్న సౌందర్యా యువకులకి పులకరింత పూజాభట్టేనా
రవ్వలడ్డులాంటి పిల్ల మాలాశ్రీయా దేశాన్నే ఊపేసిన భాగ్యశ్రీయా
మనీసా కొయిరాలా పోలికలోనా మతిపోయే మధుబాలా మాదిరిగానా
అంజలి రంజని శుభశ్రీయా ఊర్వశి కల్పన ఊహలానా
హింటు ఇస్తె చాలు మాకు జంట నీకు చేస్తాము ॥రమ్యకృష్ణ॥

**రచన: చంద్రబోసు (7) గానం : నాగూర్‌బాబు, కీరవాణి, శ్వేతనాగ, చంద్రబోసు**

జిక్కు జిక్కు జిక్కుమంటు వంట యింట నక్కాము
లక్కు మాకు దక్కునంటు ఇక్కడొచ్చి పడ్డాము
కొంటెదాని జాడ లేక గంటె చేత పట్టాము పిట్ట నేడు కానరాక పిండి రుబ్బుతున్నాము
అయినా- చిక్కలేదు చిన్నదాని ఆచూకీ చెప్పరాని ఆశలన్ని హుష్‌కాకి॥చిక్కలేదు॥
దప్పళాలు గుప్పుమంటు గొప్పగుంది మా వంట అప్పడాలు చేయకుండ తప్పలేదు ఈ పూట
ముక్కుపైన చక్కిలాలు సుబ్బరంగ బొబ్బట్లు చక్కనైన చుక్క కొరకు లెక్కలేని ఇక్కట్లు
పెరుగుపచ్చడి పులిహోర పొంగలి సాపాటు రెప్పపాటులో రెడీ
నాభి సుందరి నాలోని వూపిరి వరించి చేరుటెప్పుడో ఒడీ
స్వీటులెన్నో హాటులెన్నో టీటుగానె వండినాము
రోష్టులోన టేస్టులన్ని రెస్టులేక నింపినాము - అయినా ॥చిక్కలేదు॥
చిటికెలోన సిద్ధమయ్యె జాంగిరీలు ఎంచక్కా
గుటకలోన కరిగిపోవు గులాబ్‌జామ ఈ పక్క
పాలకోవ పంచదార పాయసాలు ఓపిగ్గా పెళ్లి విందులోన వండి వార్చినాము భేషుగ్గా
నేతి బూరెలు లేలేత గారెలు భలేగ కొలువు తీరివున్నవీ
పూతరేకులు కచోరి అరిసెలు వూరించి రుచులు పెంచుతున్నవీ
మచ్చవున్న మాయలేడి వేటకొచ్చి వేడినాము స్వచ్ఛమైన నెయ్యిలోన వంటకాలు వేపినాము
చిక్కలేదు చిన్నదాని ఆచూకీ చెప్పరాని ఆశలన్ని హుష్‌కాకీ
రుబ్బి రుబ్బి రుబ్బలేక హబ్బబ్బో బొబ్బలెక్కె చేతులన్ని ఓయబ్బో
పిల్లమాట దేముడెరుగు బామ్మర్దీ ఒళ్ళు హూనమయ్యి దురద తీరింది

**రచన: చంద్రబోసు (8) గానం : బాలు, కీరవాణి, శ్వేతనాగ, చంద్రబోసు, శ్రీలేఖ**

సరిగమ పదనిస రాగం త్వరపడుతున్నది మాఘం
తకథిమి తకథిమి తాళం ఎపుడెపుడన్నది మేళం
వన్నెల బొమ్మకు వెన్నెల మావకు కన్నులు కలసిన వైనం



ఆ: ఏ జతనో ఎందుకో విడదీసి వెంటాడి వేటాడు ఆటే ప్రేమా
అ: మౌనముతో మనసునే శృతిచేసి రాగాలు పలికించు పాటే ప్రేమ
శాశ్వత చరితల ఈ ప్రేమ మృత్యువు ఎరగని చిరునామా
ఆ: శ్వాసను మంగళహారతిగ వెలిగించేదీ ఈ ప్రేమా
మరణాన్ని ఎదిరించి మరుజన్మగా వచ్చి కరుణించు వరమే ప్రేమా
ప్రేమా ప్రేమా - ప్రేమా ప్రేమా ॥హృదయమనే॥

**రచన: సిరివెన్నెల సీతారామశాస్త్రి (4) గానం : బాలు, చిత్ర**

సౌందర్యలహరి సౌందర్యలహరి సౌందర్యలహరి స్వప్నసుందరీ - నువ్వే నా ఊపిరి
శృంగారనగరి స్వర్ణమంజరి - రావే రసమాధురి
వన్నెచిన్నెల చిన్నారి నీ జంటకోరి ఎన్ని జన్మలు ఎత్తాలే ఈ బ్రహ్మచారి
కలనుంచి ఇలచేరి కనిపించు ఓ సారి... ॥సౌందర్య॥
పాల చెక్కిళ్ళు - దీపాల పుట్టిళ్ళు ॥పాల॥ అదిరేటి అధరాలు హరివిల్లులు
ఫక్కున చిందిన నవ్వులలో లెక్కకు అందని రతనాలు
యతికైన మతిపోయె ప్రతిభంగిమ ఎదలోనె పురివిప్పి ఆడింది వయ్యారి ॥సౌందర్య॥
నీలికన్నుల్లు - నాపాలి సంకెళ్ళు॥నీలి॥ నను చూసి వలవేసి మెలివెయ్యగా
ఊసులు చెప్పిన గుసగుసలు శ్వాసకు నేర్పెను సరిగమలు
కలగంటి తెలుగింటి కలకంఠిని కొలువుంటె చాలంట నాకంట సుకుమారి ॥సౌందర్య॥

**రచన: వేటూరి (5) గానం : బాలు, చిత్ర, బృందం**

కాబోయే శ్రీవారికి...ప్రేమతో... రాసిపంపుతున్న... ప్రియరాగాలై ఈ లేఖ
మా పెరటి జాంచెట్టు పళ్ళన్ని కుశలం అడిగెనే తోట చిలకమ్మ నీ కోసం ఎదురే చూసే
నిను చూసినాక నిదురైన రాక మనసే పెళ్లి మంత్రాలు కోరిందని
బిగి కౌగిట హాయిగ కరిగేది ఏనాడని... అంటూ ॥మా పెరటి॥
నిన్ను చూడందె పదే పదే పడే యాతనా తోట పూలన్నీ కనీవినీ పడేను వేదనా
నువ్వు రాకుంటే మహాశయా మదే ఆగునా పూల తీగల్తో పడే ఉరే నాకింక దీవెన
చూసే కన్నుల ఆరాటం రాసే చేతికి మొహమాటం
తలచి వలచి పిలచి అలసి నీ రాక కోసం
వేచివున్న ఈ మనసుని అలుసుగ చూడకనీ...అంటూ ॥మా పెరటి॥
పెళ్లి చూపుల్లో నిలేసిన కథేమిటో మరీ జ్ఞాపకాలల్లో చలేసిన జవాబు నువ్వని
సందె పొద్దుల్ల ప్రతీ క్షణం యుగాలయ్యినా నీటి కన్నుల్ల నిరీక్షణం నిరాశ కాదని
తప్పులు రాస్తె మన్నించు తప్పక దర్శన మిప్పించు ఎదటో నుదుటో ఎచటో మజిలీ
నీ మీద ప్రాణం నిలుపుకున్న మా మనవిని విని దయచేయమనీ...అంటూ॥మా పెరటి॥
సప మనిప గాగా మరీ సాసస నిసరిసరీపగా ॥2॥

**రచన: జొన్నవిత్తుల (6) గానం : నాగూర్‌బాబు, కీరవాణి, శ్వేతనాగ**

నీ అక్కకు మొగుడైనందుకు నీకు పెళ్లి చేసే బాధ్యత నాది
ఓరి బామ్మర్దీ... నీ కలలోకొచ్చిన చిన్నదీ... ఎవరదీ.. ఎలాగుంటదీ...
రమ్యకృష్ణలాగ వుంటదా చెప్పర కన్నా చెప్పర నాన్నా
రంభలాగ రంజుగుంటదా చెప్పర కన్నా చెప్పరనాన్నా
ఇంద్రజ ఆమని లుక్కు వుందా శోభన గౌతమి షేపు వుందా
చెప్పకుంటె దాని జాడ ఎట్ట తెలుసుకోమురా ॥రమ్యకృష్ణ॥



అశ్వినిదత్



కె.రాఘవేంద్రరావు



అల్లు అరవింద్



యం.యం.కీరవాణి

పాఠక పుస్తక ప్రియులకోసం సినీ సంగీత విశ్లేషకుడు **'రాజా'** పర్యవేక్షణలో **'హాసం'** అందిస్తున్న ప్రత్యేక కానుక ఇది






వేటూరి



చంద్రబోస్

## తారాగణం

అల్లు అర్జున్, అదితి అగర్వాల్, సుమన్, ప్రకాష్‌రాజ్, భరణి, సీత, ప్రగతి, శకుంతల, బ్రహ్మానందం, ఎం.యస్.నారాయణ, ఎ.వి.ఎస్, శోభ, సునీల్, మాస్టర్ తేజ, బేబీ కావ్య

## సాంకేతిక నిపుణులు

| | |
|---|---|
| కథ | : చిన్నికృష్ణ |
| సంగీతం | : యం.యం.కీరవాణి |
| ఎడిటర్ | : కోటగిరి వెంకటేశ్వరరావు |
| ఫోటోగ్రఫీ | : చోటా కె.నాయుడు |
| ఫైట్స్ | : విజయన్ |
| మాటలు | : విశ్వనాథ్ |
| ఆర్ట్ | : అశోక్ |
| పాటలు | : వేటూరి, చంద్రబోస్ |
| స్టిల్స్ | : దాసు |
| క్యాషియర్ | : సతీష్ |
| ప్రొడక్షన్ కంట్రోలర్ | : చంద్రమోహన్ |
| కో-డైరెక్టర్ | : రాంబాబు |
| అసోసియేట్స్ | : విజయ్‌బాబు, కె.శ్రీను |
| పి.ఆర్.ఓ. | : యల్.వేణుగోపాల్ |
| పబ్లిసిటీ డిజైనర్ | : సురేష్ బుజ్జి |
| ఎగ్జిక్యూటివ్ ప్రొడ్యూసర్ | : కె.సత్యసాయిబాబా |
| సమర్పణ | : అల్లు అరవింద్ |
| నిర్మాత | : సి.అశ్వినిదత్ |
| దర్శకత్వం | : కె.రాఘవేంద్రరావు, బి.ఎ. |



## సాంకేతిక నిపుణులు

| | |
|---|---|
| రచన | : సత్యానంద్ |
| రికార్డింగ్, రీ-రికార్డింగ్ | : ఎవియం "జ" |
| ప్రాసెసింగ్ & ప్రింటింగ్ | : రామానాయుడుకలర్ లేబోరేటరీస్ |
| డబ్బింగ్ | : ప్రసాద్ డబ్బింగ్ థియేటర్ |
| ఆప్టికల్స్ | : ప్రసాద్ ప్రొడక్షన్స్ ప్రై లి. |
| ఎఫెక్ట్స్ | : ప్రకాష్ |
| స్టూడియోస్ | : అన్నపూర్ణ, రామానాయుడు |
| స్టిల్స్ | : దాసు |
| పబ్లిసిటీ డిజైన్స్ | : ఈశ్వర్ |
| పి.ఆర్.ఓ. | : బి.ఎ.రాజు |
| ఆపరేటివ్ కెమెరామెన్ | : అమర్, |
| కాస్ట్యూమ్స్ ఛీఫ్ | : గాలీబు |
| మేకప్ | : మల్లిఖార్జునరావు, కుమార్ |
| ప్రొడక్షన్ కంట్రోలర్ | : వి.చంద్రమోహన్ |
| ప్రొడక్షన్ ఎగ్జిక్యూటివ్ | : సి.భాస్కర్‌రాజు |
| అసోసియేట్ డైరెక్టర్ | : వెంకటేశ్వరరావు |
| అసిస్టెంట్ డైరెక్టర్స్ | : యస్.విజయబాబు, కె.శ్రీను |
| కో-డైరెక్టర్ | : బి.సూర్యప్రసాద్ |
| ఆర్ట్ | : శ్రీనివాసరాజు |
| ఎడిటింగ్ | : కె.ఎ.మార్తాండ్, వెంకటేష్ కె. |
| డైరెక్టర్ ఆఫ్ ఫోటోగ్రఫీ | : వి.జయరాం |
| సంగీతం | : యం.యం.కీరవాణి |
| నిర్మాణత | : కె.యస్.బాబు |
| నిర్మాత | : సి.అశ్వనీదత్ |
| దర్శకత్వం | : కె.రాఘవేంద్రరావు |

మార్చి 23 హీరో శ్రీకాంత్ పుట్టినరోజు సందర్భంగా శుభాకాంక్షలతో హాసం అందిస్తున్న కానుక ఇది



శ్రీకాంత్






కె.రాఘవేంద్రరావు

## తారాగణం

శ్రీకాంత్, దీప్తి భట్నాకర్, రవళి, బ్రహ్మానందం, శివాజీరాజా, బాబూమోహన్, తనికెళ్ల భరణి, ఏ.వి.యస్, బాలయ్య, రాజా రవీంద్ర, సుత్తివేలు, చిట్టిబాబు, అనంత్, గుండు హనుమంతరావు, విశ్వేశ్వరరావు, పెరుమాళ్ళ శ్రీరామచంద్రమూర్తి, కోవెలమూడి సుబ్బారావు, శ్రీలక్ష్మి, అనిత, అలేఖ్య, రజిత, రాధాబాయి మరియు కైకాల సత్యనారాయణ



అశ్వినిదత్



వేటూరి



కీరవాణి



చంద్రబోస్



అల్లు అరవింద్



ఫోటోచూశారుగా... పల్లెటూళ్ళో... ఓ ఎత్తు అరుగుల పెంకుటింట్లో... ఉయ్యాల బల్లేసుకుని హాయిగా కూర్చున్నట్టు లేదూ... నిజానికి ఉయ్యాల బల్ల తప్పితే మిగిలినవేవీ నిజం కాదు. అదొక పెంకుటిల్లూ కాదు. అక్కడ ఎత్తు అరుగులూ లేవు. అదున్నది పల్లెటూళ్ళోనూ కాదు. మరేది నిజం అంటే ఆ ఉయ్యాల బల్లమీద కూర్చున్న ఎల్.బి.శ్రీరామ్ కి ఉన్న టేస్ట్ నిజం. సంపాదించిన డబ్బుకి అభిరుచిని (నాన్‌కమర్షియల్‌గా) జతచేయగల స్పందన నిజం. ఆయన గుండెల్లో తను పుట్టిపెరిగిన ఇల్లూ, ఆ వాతావరణం, వాటి మీద మమకారం నిజం. అందుకే ఇటీవల హైదరాబాద్‌లో అన్నపూర్ణ స్టూడియో ఎదురుగా ఉన్న అపార్ట్‌మెంట్‌లో తను కట్టించుకున్న ఓ ఫ్లాట్‌లో- తన బెడ్‌రూమ్‌లో- కిటికీ వున్న భాగాన్ని ఇలా ప్రత్యేకంగా రూపొందించుకున్నారాయన. అదేంటీ- ఎన్నో సినిమాలకు డైలాగులు రాసేసి, ఎన్నెన్నో విజయవంతమైన చిత్రాల్లో నటించేసి, ఎంతో పాపులర్ అయిపోయిన ఎల్.బి.శ్రీరామ్ ఇప్పుడిల్లు కట్టుకోవటం ఏంటి - ఈ పాటికే ఆయనకెన్నో ఇళ్ళు ఉండి ఉండాలి కదా- అనే సందేహం రావొచ్చు- దానికి జవాబుని ఆయన స్టయిల్‌లో డైలాగ్‌ని నొక్కుతూ చెప్పాలంటే- 'మ్మ్రర్ద్దే జ్జీవితం అంటే'!

వాస్తవానికి ఎల్.బి.శ్రీరామ్ రచయితగా గత పదకొండు సంవత్సరాలుగా రాసింది 40 సినిమాలకు మాత్రమే! అయన తండ్రిగారు వెంకట్రామశాస్త్రి గారు సోమయాజి. అంటే స్వయాన యజ్ఞం చేయటమే కాకుండా 50-60 యజ్ఞాల్ని చేయించారు కూడా! వేదాల్ని క్షుణ్ణంగా అధ్యయనం చేసి వేదపరీక్షాధికారిగా వ్యవహరించి రాష్ట్రపతి అవార్డును అందుకొన్న మహానుభావుడాయన. 86 సంవత్సరాలు బతికారు. ఆయన కొడుకులు ఏడుగురూ నాటకాలంటే విపరీతమైన ఇష్టం వున్నవారే. అలా నాటకాల్లోకి ఎంటరైన ఎల్.బి.శ్రీరామ్ తన జీవితాన్ని 40 రూపాయల జీతంతో ప్రారంభించారు. కాళ్ళుజాపితే వేళ్ళు కొట్టుకుపోయి, చేతులు జాపితే స్విచ్చ్‌కున్న కరెంటు తీగలు తగిలి చస్తామేమోనన్నంత భయం కలిగించే ఓ చిన్న రూమ్ కి అద్దెకింద 20 రూపాయలు పోయేవి. నాటకాలకి ఇంకో పది రూపాయలు పోయేవి. మిగిలిన 10 రూపాయలతో ఎలా బతికేవాడో ఏమోగానీ మొత్తానికి 'మ్మ్రర్ద్దే జ్జీవితం అంటే' అనే డైలాగుని ఒత్తి ఒత్తి పలికే స్టేటస్‌కి తగ్గ ఘోరానుభవాల్ని ఆరోజుల్లోనే చవి చూశేశాడాయన.పైగా బాల్య వివాహం కూడా... ఆ తర్వాత సంగతులిక వేరే చెప్పాలా...!?

అలా జీవితాన్ని ప్రారంభించిన 'లంక భద్రాద్రి



శ్రీరామ్' సొంతూళ్లో లంకంతకొంప వున్నా సొంత కాళ్ళమీద నిలబడి సొంతిల్లు కట్టుకోవటం మీద ఓ ఆశయం, కాయకష్టం మీద ఓ విలువ, సొంత 'తలకాయ కష్టం మీద' నమ్మకంవున్నవాడు కనుక మొట్టమొదట సహనం రుచి మరిగాడు. కన్నీటిని చేయకు వృథా - వంతెన కట్టి పుట్టించు విద్యుత్తు సదా - అని అనుకుంటూ వాటిని సహనంతో కలుపుకుని తాగేసి 'బ్రేవో'అంటూ త్రేన్చాడు. ఓర్చిన పసరుకు తేటనీరు అన్న సూక్తికి నిదర్శనంగా ఇవాళ తేటనీరు లాంటి స్వచ్ఛమైన జీవితాన్ని, అచ్చమైన విజయాన్ని అందుకున్నాడు. అందుకు ఆయన నూతన గృహప్రవేశమే సాక్ష్యం. ఎంతమంది కష్టపడ్డవాళ్ళు లేరు వాళ్ళందరూ ఇళ్ళు కట్టుకోలేదా.. అని అంటే... ఉన్నారు... కానీ ఓ ఇండిపెండెంట్ ఇంటిని కట్టుకోవటంవేరు. మర్రిచెట్టు తనకు జన్మనిచ్చిన భూమిని ఊడలతో స్పృశించినట్టు... తను పుట్టిన పెరిగిన ఇంటి వాతావరణం అనుక్షణం గుర్తుండేలా... బిల్డర్ కట్టియిచ్చిన ఫ్లాట్‌లో కొంతభాగాన్ని మలచుకోటం వేరు. అందర్నీ నవ్వించే ఎల్.బి.శ్రీరామ్‌లోని ఈ స్పందనా గుణం కమనీయం గమనీయం. ■

---

జర్నలిజం నుంచి పాటల రచయితగా అడుగుపెట్టి రాణించిన వారెందరో వున్నారు. చటుక్కున చెప్పమంటే- మొన్న ఓ వేటూరి సుందర్రామ్మూర్తి, నిన్న కులశేఖర్, నేడు భాస్కరపట్ల రవికుమార్. ఇట్లు శ్రావణి సుబ్రహ్మణ్యంలోని 'రామసక్కని బంగారుబొమ్మ రాసలీలకు వస్తావా' అనే పాటతో హిట్లు కొట్టడం మొదలుపెట్టిన భాస్కరభట్ల రవికుమార్‌కి పాటలు రాయడమంటే విపరీతమైన ఇష్టం. పాటల మీద మోజుతోనే ఓ ఫ్రెండుని 'నీ ఖర్చులు నేనుపెట్టుకుంటాను నాకు హైద్రాబాద్ చూపించరా' అని బ్రతిమాలి అతగాడితో హైద్రాబాద్ వచ్చి త్యాగరాజ గానసభలో సిరివెన్నెల సీతారామశాస్త్రి గారికి జరిగిన ఓ సన్మానం చూశాడు. దాంతో పాటలు రాయాలన్న కోరిక మరింత ఉధృతం అయిపోయింది. రాజమండ్రి గోదారినీళ్ళు తాగిన 'మనసు' కదా... 'అలజడి' ని తట్టుకోలేకపోయింది. రాయడానికి ఎక్కువగా అవకాశం వున్న ప్రదేశం - పత్రికేనని గ్రహించి 'ఈనాడు'లో సాంస్కృతిక విలేకరిగా ఉద్యోగం సంపాదించాడు. అలా సాంస్కృతిక కార్యక్రమాలను చూస్తూ ఎక్కువగా అవదానాలను, సమస్యాపూరణాలను స్టడీ చేసేవాడు. దాంతో భాషపై పట్టు అతనిలోని పట్టుదలతో పాటు పెరిగింది. అక్కడితో ఆగలేదు హైద్రాబాద్‌కి వచ్చి'సితార' రిపోర్టర్‌గా జాయినయ్యాడు. హీరోలతో కాకుండా ఎక్కువగా సాంకేతిక నిపుణులతో పరిచయాలు పెంచుకునేవాడు. ఈలోగా తనికెళ్ళభరణి ఇంట్లో ఉగాది నాడు జరిగిన కవిసమ్మేళనం లాంటి కలయికలో తనవంతు కవితను చదివాడు. అక్కడికి హాజరయిన సంగీత దర్శకుడు చక్రి ఆ కవితను విని పెద్ద ఫాన్ అయిపోయాడు. తను సంగీత దర్శకత్వం వహించే ప్రతి సినిమాలో పాటలు రాయిస్తానని ప్రామిస్ చేశాడు. పూర్తి ఏకాగ్రత కావాలంటే ఉద్యోగం రిజైన్ చెయ్యక తప్పదని నిశ్చయించుకున్నాడు రవికుమార్. నెలకు పదివేలిస్తాను రైటర్‌గా పైకిరా - అంటూ వెన్నుతట్టి వెన్నెముకలా నిలిచాడు చక్రి. అంతే ఆ మోరల్ సపోర్ట్‌తో పూర్తిస్థాయి రచయితగా తన ప్రయత్నాలు ప్రారంభించాడు. ఇప్పటికి 45 చిత్రాలలో రాశాడు. హిట్లు ఇచ్చాడు. ఏ సంస్థనుంచి బైటకొచ్చాడో ఆ సంస్థ తీసే చిత్రాలలోనే రాయబోతున్నాడు కూడా. ఇంటిపేరులోనూ ఒంటిపేరులోనూ సూర్యుణ్ణి నింపుకున్న భాస్కరభట్ల రవికుమార్ మరింత ప్రకాశించాలని అతని పాటలెన్నో వెలుగు చూడాలని 'హాసం' ఆకాంక్షిస్తున్నది. ■



# ఎస్కేపాలజీ

## రాబీ విలియమ్స్ కొత్త ఆల్బమ్





కొత్తగా విడుదలయిన రాబీ విలియమ్స్ ఐదవ ఆల్బమ్ 'ఎస్కేపాలజీ'. 'పేరు వింతగా ఉందే' అంటే "హౌడినీ అనే మెజీషియన్‌ను ఒక పెట్టెలో పెట్టి తాళాలు వేసి నీటిలో ముంచివేసినా తప్పించుకునేవాడు. ఆ విద్యను ఒక కళగా, ఒక శాస్త్రంగా అభ్యసించాడాయన. హాలీవుడ్ హిల్స్‌లో డ్రైవ్ చేస్తుండగా అది గుర్తుకువచ్చి 'ఎస్కేపాలజీ' అన్నమాట స్ఫురించింది. అదే కొత్త ఆల్బమ్‌కు పేరుగా నిర్ణయించాను" అన్నాడు రాబీ విలియమ్స్.

రాబీ విలియమ్స్ గాయకుడు మాత్రమే అయితే ఆల్బమ్ పేరు గురించి ఇంత తన్నుకునేవాడు కాదేమో! అతను పాటలు రాస్తాడు కూడా. 1997 సెప్టెంబరులో విడుదలయిన అతని మొదటి ఆల్బమ్ 'త్రూ ఎ లెన్స్' లో అన్ని పాటలు రాబీ గై చాంబర్ (అతని భాగస్వామి కూడా) కలిసి రాసినవే. అదేవిధంగా ఏడాధి తర్వాత వెలువడిన 'ఐ హేవ్ బీన్ ఎక్స్‌పెక్టింగ్ యూ' అనే రెండో ఆల్బమ్ లో కూడా ఇద్దరూ రాశారు.

కైలీమినోగ్ ఆల్బమ్ 'కైలీ' ఆల్బమ్‌లోని 'కిడ్స్'(కైలీ, రాబీ యుగళగీతం) పాట ఇంకో రెండు పాటలు కూడా రాబీ, గై కలిసి రాశారు. కొత్త ఆల్బమ్ 'ఎస్కేపాలజీ'లో కూడా చాలా భాగం పాటలు వీళ్లిద్దరూ కలం పట్టినవే! 'కమ్ ఆన్‌డన్' అనే సింగిల్ మాత్రం రాబీ, న్యూయార్క్ బూట్స్ కలిసి రాశారు. 'నాన్స్ సాంగ్' అనే పాట రాబీయే స్వయంగా రాశాడు. "నన్ను పెంచిన మా నాయనమ్మ 5 సంవత్సరాల క్రితం పోయింది. నేను పూర్తిగా రాసిన తొలిగీతం నేను అభిమానించే వారి గురించి ఉండడం న్యాయం కదా" అన్నాడు రాబీ.

ఇంగ్లండులోని 1974లో పుట్టిన రాబీ బాల్యంలోనే తన కళను ప్రదర్శించాడు. 'టేక్ దట్' అనే గ్రూపు 1990లో ఇంగ్లండులో చాలా ఫేమస్. తన 17వ యేట రాబీ ఆ గ్రూపులో చేరి 8 నంబర్ వన్ సింగల్స్ సంపాదించుకోగలిగాడు. ఆ గ్రూపుతో ఇమడలేక జూన్ 1995 లో విడిపోయాడు. మరుసటి ఏడాది ఆ గ్రూపు చీలిపోయింది కూడా!

'ఫ్రీడమ్' అనే సింగిల్ తర్వాత అతని మొదటి ఆల్బమ్ రిలీజయ్యింది. అది ఓ మాదిరిగా విజయవంతం అయింది. కాని దాంట్లో 'ఏంజిల్స్' అనే సింగిల్ మాత్రం బాగా హిట్ అయింది.

రెండో ఆల్బమ్ 'ఐ హేవ్ బీన్ ఎక్స్‌పెక్టింగ్ యూ' అక్టోబరు 1998 లో రిలీజయ్యి వెంటనే సక్సెసయింది.

ఈ రెండు ఆల్బమ్స్‌లోని హైలైట్స్ తీసుకుని 'ది ఇగో హేజ్ ల్యాండెడ్' అనే పేర అమెరికాలో రిలీజ్‌చేశారు.

మూడో ఆల్బమ్ 'సింగ్ వెన్ యూ ఆర్ విన్నింగ్' ఆగస్టు 2000 లో విడుదలయింది. మొదటి రెండింటి లాగానే ఇదీ బ్రిటన్‌లో 20 లక్షల కాపీలు అమ్ముడుపోయింది.

నవంబరు 2001 లో రిలీజయిన నాలుగో ఆల్బమ్ 'స్వింగ్ వెన్ యూ ఆర్ విన్నింగ్' ఓ ప్రయోగమే! ఫ్రాంక్.సినాట్రా, డీన్‌మార్టిన్, శామీ డేవిస్(జూ) వంటి తన అభిమాన గాయకులు పాడిన పాటలను పాడి రిలీజ్ చేశాడు. ఒరిజినల్ పాటలను పాడిన స్టూడియోలోనే, ఒరిజినల్ మ్యూజిషియన్స్ సహకారంతోనే రికార్డు చేశాడు. దానిలో మొదటి పాట 'ఐ విల్ టాక్ హాలీవుడ్ విల్ లిజన్' రాబీ, గై కలిసి రాశారు. అంతేకాక నికోల్ కిడ్‌మన్‌తో ఓ డ్యూయట్ పాడడమే కాకుండా స్వర్గీయ ఫ్రాంక్ సినాట్రా పాటతో గొంతు కలిపి (సినాట్రా వారసులు అనుమతి ఇచ్చారు) ఓ పాట పాడాడు.

అయిదో ఆల్బమ్ ఎస్కేపాలజీ రికార్డింగు కూడా వింత పోకడలు పోయింది. ఓ పాట పాడేటప్పుడు సూపర్‌మ్యాన్ డ్రస్ వేసుకున్నాడు. (ఆ పాట చివరకు ఉపయోగించలేదనుకోండీ) చాలా పాటలు ఏ దుస్తులు లేకుండా పాడాడు (ఎందుకని అడిగితే దానివల్ల నిస్సహాయ స్థితిలో పాడిన ఎఫెక్ట్ వస్తుందన్నాడు) ఆల్బమ్ ఆర్ట్‌వర్క్‌కై 15 అడుగుల గాజు సిలిండర్‌లో నీళ్లు నింపి అడుగున ఊపిరిబిగించి కూచున్నాడు.

పబ్లిసిటీకి లోపమేమి చేసినట్టులేదు కానీ ఆల్బమ్‌ను శ్రోతలు ఎలా రిసీవ్ చేసుకుంటారో చూడాలి-

**- కమ్యూనికేటర్ ఫీచర్స్**



# కొమ్మ కొమ్మకో సన్నాయి...



చక్కని సాహిత్యం, శ్రావ్యమైన సంగీతం, శాస్త్రీయమైన సంగీత సాహితీ స్వరూపం కరువు అవుతున్న ప్రస్తుత కమర్షియల్ యుగంలో 'గంగోత్రి' చిత్రం ద్వారా ఒక మంచి పాటను, ఒక సత్సాహిత్యాన్ని- శాస్త్రీయ మైనటువంటి సంగీతానికి బాసటగా చక్కని గీతాన్ని రాసే అవకాశం నాకు కలిగింది.

ఈ గంగోత్రి పాట (బహుశా టైటిల్ సాంగ్ అనొచ్చేమో) దీనిని దర్శకుడు రాఘవేంద్రరావు గారు తనకు జన్మనిచ్చిన తల్లి తండ్రులకు అంకితం చేస్తే, నేను ఈ పాట రచయితగా నా తరపునా, సంగీత దర్శకుడు చిరంజీవి కీరవాణి పక్షాన... నాముందు తరానికి చెంది... శ్రీ రాఘవేంద్రరావుకు సంగీత సాహితీ సేవలు అందించిన మహానుభావులు ఆత్రేయ గారికి, కె.వి. మహదేవన్ గారికి, చక్రవర్తి గారికి ఈ పాటను నేను నాకు నేనుగా, నాలో నేనుగా అంకితం చేసుకుంటున్నాను.

## 'ఈ అవకాశం అపురూపం'

### గంగోత్రి టైటిల్ సాంగ్ గురించి వేటూరి




ఈసారి ఈ ఫీచర్ని సమర్పించినవారు



సురభి మ్యూజిక్

1-9-289/3/1/ఎ,
విద్యానగర్, పోస్టాఫీసు దగ్గర,
మెగా సిటీ నెం.774,
హైదరాబాద్-500 044
ఫోన్: 27616880



ఈ పాట ఇంత పవిత్రంగా ఉండటానికి కారణం - పతిత పావనము, పరమ పవిత్రము అయినటువంటి గంగోత్రిని గురించి రాసింది కావడం. అటువంటి పాట రాయించి శత చిత్ర దర్శకుడు అయిన రాఘవేంద్రరావు తన నూరో చిత్రాన్ని గంగానదికి అర్ఘ్యం ఇచ్చినట్టయింది.

ఈ పాటలో కీరవాణి సంగీత వైదుష్యం, సమయస్ఫూర్తి ఎంతగానో కన్పిస్తుంది. అదేమిటంటే... అమృత వాహిని అయినటువంటి గంగోత్రిని ఏ రాగం అభిషేకించగలదు? ఏ రాగామృతంతో అభిషేకించాలి? దానికి ఆకాశగంగతో తుల్యమైనటువంటి, అంతకన్న అపురూపమైనటువంటి, అరుదైనటువంటి అమృతంతో మాత్రమే అభిషేకించాలి. అందుకే 'అమృత వర్షిణి' రాగాన్ని ఎన్నుకొని కీరవాణి ఈ గీతానికి సంగీతాభిషేకం చేశాడు. అందుకు తద్వారా ఎండి మోడై తొలకరి జల్లుల కోసం, మోడువారి మోము వాచి ఎదురు చూస్తున్న అనేక తరులతాగుల్మాదులతోపాటు, వన దేవతలతో పాటు, సంగీత సాహితీ బృందావన దేవతలైనటువంటి శ్రోతలు, రసజ్ఞులైన శ్రోతలు కూడా తడిసి, తనిసి- తృప్తి చెంది పునర్జీవనం పొంది- (ఇంకా సంగీత శ్రావ్యతా మధురిమ పూర్తిగాపోలేదు.) అది ఎక్కడ అవకాశం వచ్చినా ఆకులురాలే కాలం నుంచి, వేసవి గాడ్పుల నుంచి, శిశిర శిథిలాల నుంచి తిరిగి వసంతం వచ్చినట్టే ఈ మధురిమ... మెలోడి... అనేది ఎంత నిద్రాణమై ఉన్నా దాని టైమ్ వచ్చేటప్పటికి అది బైటికి వచ్చి స్వయం ప్రకటన చేసుకోగలదని- నిరూపించటానికే ఈ గీతం నిదర్శనంగా నిలిచిపోతుంది. అందుకు అటువంటి అమృత వర్షిణి రాగంలో దీనికి బాణీ కట్టినటువంటి కీరవాణి అభినందనీయుడు.

ఇక ఈ సన్నివేశం రాఘవేంద్రరావు గారు నాకు చెప్పినప్పుడు కీరవాణి నాకు ట్యూన్ వినిపించినప్పుడే నేను బదరికా హిమ ప్రాంతంలోనూ, హృషికేశం, హరిద్వారంలోనూ ఆ శీతల పునీత గంగా ప్రవాహంలో అభ్యంగన మాచరించిన అనుభవం కలిగింది. ఆ అనుభవాన్ని నా చేతనైన మేరకు అక్షరాల రూపంలో పొదిగి ఈ గీతం రాయటం జరిగింది.

ఇటీవల టెక్నిక్ మరీ శృతి మించడంతో సాహిత్య ప్రయోజనాలు కొన్ని దెబ్బతింటున్నాయని చెప్పకతప్పదు. ఏదన్నా గీతం రచించినపుడు అది పాడేవారు వారు తెలుగువారు అయినా, మరొక భాష వారు అయినా పాడటం జరుగుతోంది. ఏది ఏమైనా కొన్ని కొన్ని శబ్దాలు, వాటి ఫొనెటిక్స్ దెబ్బతినడం జరుగుతోంది. అదేవిధంగా ఎన్నో పాటలలో- ఇది నాకు అర్థం కావటం లేదు, అంటే ఏమిటండీ - వంటి ప్రశ్నలు సామాన్యంగా కవులకు ఎదురవుతుంటాయి. ఉదాహరణకి 'హిమగిరిజని' అని నేను రాస్తే 'హిమగిరిదరి' అని వినబడటం జరుగుతోంది అని ఈ పాటలోనే కొందరు నన్ను అడగటం జరిగింది. 'హిమగిరిజని' అంటే "హిమగిరిలోంచి జన్మించినది".



తర్వాత హరిపుత్రి ప్రయోగం అని చేశాను ఈ పాటలోనే! నిజానికి విష్ణుపది గంగ. విష్ణు పాదాల నుండి ఉద్భవించినది. విష్ణు పాదమైనా, విష్ణు కరమైనా విష్ణువే గనుక. విష్ణువు పాదాల నుండి ఉద్భవించినది విష్ణువు గనుక విష్ణువులో నుండి జన్మఎత్తినదే అవుతుంది కనుక హరిపుత్రి అనటంలో తప్పులేదని భావించి చేసిన ప్రయోగం అది. అదే విధంగా 'విరజా వాహిని'అని కూడా గంగా నదిని వర్ణించాను. హరిద్వారంలో నుంచి, బదరీ నారాయణం నుంచి, భారత మైదానాలలోకి ప్రవహించేటువంటి ఈ మహానదిని 'విరజానది' అనడంలో ఔచిత్యం పెద్దలు గ్రహిస్తారని నేను అనుకుంటున్నాను.

అదే విధంగా విష్ణు చరణవే తన పుట్టినిల్లుగా శివగిరికి చేరిన సురగంగ నీవని... ఆకాశంబున నుండి శంభుని శిరంబు అందుండి శీతాద్రిసు శ్లోకమైన హిమాద్రి నుండి... అనే పద్యం గుర్తు పెట్టుకుంటే, గంగానది ఎన్నెన్ని దశలలో ఏయే క్షేత్రాల ద్వారా, ఏఏ పేర్లతో వచ్చి సాగర సంగమం చేసిందో, ఎక్కడ ఎక్కడ ఏ మహత్కార్యం ఆవిడ వల్ల జరిగిందో మనకు పురాణాలలో తెలుస్తుంది. అలక నంద, భాగీరథి పేర్లతో ఆ గంగామాత ఏ విధంగా వారణాసి క్షేత్రానికి చేరి అనేక మంది కలినరుల కల్మషాల్ని, కిల్బిషాల్ని హరించే పావనతోయాలతో సాగిపోయి సాగర సంగమం చేసిందో మనకు తెలుస్తుంది.

నాకు చెప్పిన సన్నివేశంలో అక్కడ కథానాయిక అభ్యంగన స్నానం చేస్తూ, గంగానదిలో పసుపు, కుంకుమలతో, పాలు, పన్నీటితో, శ్రీగంధంతో, పంచామృతాలతో ఈ కథానాయిక చేస్తున్న స్నానమే గంగమ్మకి జరుగుతున్న అభ్యంగనం అభిషేకం కనుక ఆ వర్ణనను ఆ విధంగా రాయటం జరిగింది.

**పసుపు కుంకుమతో...**
**పాలు పన్నీటితో...**
**శ్రీగంధపు ధారతో...**
**పంచామృతాలతో...**
**అంగాంగం తడుపుతూ...**
**దోషాలను కడుగుతూ...**

**గంగోత్రికి జరుపుతున్న**
**అభ్యంగన స్నానం**

ఈ స్నానం చేస్తూ, ఈ అభిషేకం చేస్తూ ఆవిడను కోరుకుంటున్న వరాలు ఏమిటి...

**అమ్మా...గంగమ్మా...**
**కృష్ణమ్మకు చెప్పమ్మా కష్టం కలిగించొద్దని**
**యమునకు చెప్పమ్మా**
**సాయమునకు వెనకాడొద్దనీ...**
**గోదారికీ...కావేరీకి...**
**ఏటికి.... సెలయేటికి...**
**కురిసేటి జడివానకి... దూకే జలపాతానికి...**
**నీ తోబుట్టువులందరికీ...**
**చెప్పమ్మా...మా గంగమ్మా...**
**జీవ నదివిగా... ఒక మోక్ష నిధివిగా...**
**పండ్లు పూలు పసుపులా**
**పారాణి రాణిగా...**

ప్రవహిస్తున్న తల్లీ ఈ విధమైన వరాన్ని మాకు ప్రసాదించవలసింది అని ఆ కన్నె పడుచులు, మాంగల్య దేవతలు, వీళ్లందరు అభ్యర్థించడం జరుగుతుంది.

ఆమె

**శివుని జటలనే తన నాట్య జతులుగా**
**జలక మాడు సతులకు సౌభాగ్య దాత్రిగా...**
**గండాలను పాపాలను కడిగివేయగా...**
**ముక్తి నదిని మూడు మునకలే చాలుగా**
**జలదీవెన తలకుపోసే జననీ గంగాభవాని**

ఇక్కడ జలదీవెన తలకు పోసె జననీ గంగాభవాని అని రాసాను. జలదీవెన దుష్టసమాసం అనవచ్చు. జీవగర్ర, వంటిదే ఈ జలదీవెన కూడా!

ఆడవాళ్ళు పాడే నోముల పాటలలో, జానపదాలలో, నలుగు పాటలలో ఇటువంటి చక్కని దేశీయమైన సమాసాలు రావటం పరిపాటి గానే ఉంది. పైగా అటువంటి నిబద్ధత లేని రోజుల్లో జలదీవెన అన్నమాట వ్యాకరణ దోషమనో, భాషా దోషమనో అనుకోవలసిన పని లేదు. ఆ విషయం తెలిసినవారికి చలామణి ఈ రోజుల్లో లేదు. మనం భాషను ఎంత సాంకర్యం చేస్తే అంత గొప్పవాళ్ళం కావడానికి అవకాశాలున్న రోజులివి.

పోతే ఈ చక్కని గీతం సాహిత్య పరంగా చాలా గొప్పది కాకపోవచ్చు కాని సంగీత పరంగా మాత్రం అక్షరాలకు ఒక ఆయువు దొరికి అవి సచేతనమై, ఒక ప్రవహించే గంగానదిలా సుడులు తిరుగుతూ కొండకోనల్లోంచి ఉరవడిగా, వడివడిగా పరుగులు తీస్తూ వస్తున్న గంగమ్మను, ఆవిడ ఉరుకులలో పరుగులలో వినిపించే స్వరలహరికలను, అలా మానస శ్రవణానికి వినిపింపజేసే చక్కని సంగీతంతో చేయికలుపుతూ సాగిన సాహిత్యం ఇది. ఈ అవకాశం అపురూపం, అరుదైనటువంటి ఓ సంఘటన. దీనికి సంబంధించి నేను ఎంతో వరకు కృతకృత్యుణ్ణయ్యానో, శ్రోతలు, ప్రేక్షకులే ప్రమాణం.

నదులను గురించి 'సిరిసిరిమువ్వ'లో 'గోదారల్లే ఎన్నెట్లో గోదారల్లే' పాట దగ్గర్నుంచి నిన్న మొన్నటి చిత్రాల వరకూ 'సీతారామయ్యగారి మనమరాలు'లో 'గోదారి గంగ భూదారి గంగ' అని వర్ణిస్తూ ఓ పడవ పాట రాసినా, తర్వాత 'ఆశాజ్యోతి' చిత్రంలో రమేష్‌నాయుడు సంగీత దర్శకత్వంలో 'ఏరెల్లిపోతున్నా నీరుండి పోయింది నీటిమీద రాతరాసి నావెళ్లిపోయింది' అని రాసినా 'దశతిరిగింది'అనే చిత్రంలో 'అందాల నా కృష్ణవేణి... శృంగారరస రాజధాని..' అనే యుగళగీతాన్ని రాసినా, అటు తర్వాత 'జీవనగంగ' చిత్రంలో 'తానేడ పుట్టిందో తల్లి గంగమ్మ మా వాడకొచ్చింది తరలి గంగమ్మ'అనే పాట రాసినా,'మరో సీతకథ' అనే చిత్రంలో 'ఎందరు ఏడ్చిన ఏడుపులో కృష్ణాగోదావరి... ఎందరి ఆరని కన్నీళ్లో అంతులేని కడలి'అనే గీతాన్ని రాసినా, 'నా వాలు జడకృష్ణవేణి', 'నా సిగ పూలు ఎన్నెలా గోదారి' అని ప్రయోగాలు చేసినా, నదుల గురించి రాయాలన్నా, ఇవన్నీ నదులతో నాకు గల వ్యక్తిగతమైన అనుబంధాన్ని వాటిపై నాకుగల అనురాగాన్ని వ్యక్తీకరించుకోవటానికే!

ఇవి జీవనదులు... మన జాతి జీవనంలో ఇవి ప్రాణనదులు. మన నవనాడులు ఈ మహానదులే. రవీంద్రనాథ్‌టాగూర్ పద్మానది మీద రాసిన అనేకానేక గీతాలు బెంగాల్‌లో పడవవాళ్లు పాడుకుంటూ పరవశించి పోయినటువంటి సందర్భాలు మనం బెంగాలీ నవలలు చదివినప్పుడు తెలుస్తూ ఉంటుంది.

నది మనకు తల్లి వంటిది. ఏ నదీ తీరంలో ఎవరు పుడతారో వాళ్ళకి ఆ నది ఓ తల్లిగా, తన ఒళ్లోపెట్టుకు లాలించే కన్నతల్లిగా కన్పిస్తుంది. ఆ ఋణానుబంధమే కవితా ప్రబంధంగా వచ్చినటువంటి, ప్రబంధాలు కూడా మహాకవులు పూర్వం రాశారు. వారి వారసత్వంలో అనేక మంది కవులు.... 'ఏటిలోని కెరటాలు ఏరువిడిచి పోవు, ఎదలోని మమకారం ఎక్కడికీ పోదు' అన్న ఆరుద్ర వంటి కవులు... పూర్వకవులు... మహానుభావులు ఎందరో ఈ విధంగా తరంగిణీ తరంగ గానం చేసినటువంటి వారే.

అదే కోవకు చెందినటువంటి ఒక పాట ఈ కృతకయుగంలో సినిమాలలో మళ్లీ రాసే అవకాశం నాకు రావటం, అనిర్వచనీయమైన అనుభూతిని కలిగించటమే కాక ఓ చిరస్మరణీయంగా మిగిలిపోయే తీపి గుర్తుగా ఉండిపోతుంది.

**-వేటూరి సుందరరామ్మూర్తి** ■


## అంతేరా... బామ్మర్దీ!



"అనగనగా హైదరాబాదు. ఆ నగరంలో ఒక అబ్బాయి. ఒక అమ్మాయి. అదీ కథ!"

"ఇదేం కథ?"

"హైదరాబాదులో బసవరాజు ఒక పెద్ద పారిశ్రామికవేత్త. రంగనాథం ఒక మామూలు సగటు మనిషి. వాళ్లిద్దరూ ప్రాణ స్నేహితులు. అదీ కథ!"

"ఇది కథ ఎందుకవుతుంది?"

"బసవరాజుకి ఒక కూతురు. రంగనాథానికి ఒక బామ్మర్ది. ఇద్దరికీ ఉడ్ హావుస్ రచనలంటే చాలా చాలా ఇష్టం. అంచేత ఉడ్ హావుస్ పుణ్యమాని ఇద్దరూ ప్రేమలో పడ్డారు!"

"అదీకథ అనొద్దు!"

"బసవరాజు కంపెనీలో మిస్టర్ పాణి ఒక పి.ఆర్.ఓ.! పేపరు రీడింగు ఆఫీసరు!"

"పి.ఆర్.ఓ. అంటే పబ్లిక్ రిలేషన్స్ ఆఫీసరు గదా? పేపరు రీడింగు ఆఫీసరంటావేమిటి?"

"ఈ కథ మొత్తం పేపరు రీడింగు అనే విన్యాసమ్మీద ఆధారపడి వుంది! ఈ కథపేరు- అంతేరా... బామ్మర్దీ! -అదీ కథ!"

ఇది - ఆదివిష్ణు రాస్తున్న కథ!
ఇది - మినీ సీరియల్ కథ!
ఇది - హాస్య ప్రధానంగా నడిచే కథ!
ఇది - సరికొత్త పాయింటుతో అల్లిన కథ!
ఇది - హాస్య ప్రియులను అలరించే కథ!
ఇది - 'హాసం' పాఠకుల కోసం ప్రత్యేకంగా రాసిన కథ!

ఉగాది సంచికతో ప్రారంభం...

అంటే... వచ్చే సంచిక నుంచే...

# ఎలుక వచ్చె ఇల్లు భద్రం



ఇలపావులూరి మురళీమోహనరావు

2

**హెచ్చరిక**

విరగబడి నవ్వితే గుండె చిక్కబట్టి ఊపిరాడక అవస్థపడేవారు కామెడీ యాక్ట్ 2003 ప్రకారం ఈ సీరియల్‌చదవడం నిషేధం. ఒకవేళ మీ పొట్టచెక్కలైతే పత్రిక నుంచి ఎలాంటి పరిహారం రాదు. ఈ హెచ్చరిక ఈ సీరియల్ పూర్తయ్యేంత వరకు అమలులో ఉంటుంది.





## జరిగిన కథ

వెంకట్రావు, సుందరి భార్యభర్తలు. వాళ్ల ఇంట్లో ఓ ఎలుక దూరింది. దాన్ని కర్రతో కొట్టబోయి సుందరి ఫర్నిచర్ విరగకొట్టింది. ఆ రాత్రి టక్‌టక్‌మని చప్పుడు. పక్కింటి సుబ్బారావు ఇంట్లో దొంగలు పడ్డారనుకొంటాడు వెంకట్రావు. మారుపేరుతో పోలీసులకు ఫోన్ చేస్తాడు. వాళ్లు ఓ పట్టాన రారు. చివరకు ఓ కంగారుగొడ్డు యస్సై దిగడతాడు. (ఇక చదవండి)

"అయితే మర్యాదగా నిజం చెప్పరన్నమాట! నా లాఠీ ఆకలి తీర్చాలని మీ అందరికీ అంత కుతిగా ఉందన్న మాట!" తీక్షణంగా అన్నాడు యస్పై.

ఓ ఎనభై సంవత్సరాల వృద్ధుడు నోరు తెరిచాడు.

"సార్...మా అమ్మ మీద ఒట్టు పెట్టి చెబుతున్నాను. మీరనే ఆ దొంగలెవరో మాకు తెలియదు" అన్నాడు.

"మీ అమ్మ బతికుందా?" గర్జించాడు యస్పై.

"లేదు సార్. కాలంచేసి ఆరు దశాబ్దాలైంది." వణుకుతూ చెప్పాడు వృద్ధుడు.

"మరి చచ్చిన వారిమీద ఒట్లు వేస్తావేందిరా ముసలి నక్కా! చూస్తుంటే ఆ దొంగవు, హంతకుడివి, రేపిస్టువు నువ్వేలా ఉన్నావు. ఛెప్పు...సుబ్బారావు గారి భార్యను మానభంగం చేసింది నువ్వేనా? చెబుతావా లేక చెప్పుతీసుకుని చెవి గూబల మీద ఛెళా ఛెళా చేదుకోమంటావా?" వృద్ధుడి భుజాలను పట్టి ఊపాడు యస్పై.

వృద్ధుడి కళ్ళు గిర్రున తిరిగాయి.

"అయ్యబాబోయ్...కాటికి కాళ్ళు జాపుకుని కూర్చున్న వాడిని. పళ్ళన్నీ ఊడిపోయాయి. నేను మానభంగం చెయ్యడమేంటి బాబయ్యా." శోకాలు పెట్టాడు వృద్ధుడు.

"మానభంగం చెయ్యడానికి పళ్ళెందుకురా పాచివెధవా? కాటికి కాళ్ళు జాపుకుంటేనేంరా? తలలు బోడులైన తలపులు బోడులా అని వేమన్న చెప్ప లేదూ? ఛెప్పు...నువ్వేనా రేప్ చేసింది?" లాఠీ తిప్పాడు యస్పై.

వృద్ధుడికి పై ప్రాణాలు పైనే పోయాయి. యస్పై ఆగ్రహం చూసి ఎవ్వరూ నోరెత్తే సాహసం చెయ్యలేక పోతున్నారు.

"నేనెవ్వరినీ మానభంగం చెయ్యలేదండీ... దయఉంచి నన్నొదిలెయ్యండి" రెండు చేతులు జోడించాడు వృద్ధుడు.

"ఐసీ...అయితే దోపిడీ చేశావా? తెల్...ఎంత




దోచుకున్నావ్? దొంగ సొత్తు ఎక్కడ దాచావ్? తెల్..తెల్ మీ ద ట్రూత్!" కోరమీసాలు మెలిదిప్పాడు యస్పై.

"ఇదెక్కడి పిడి బాబూ నాకు? నాకు చెయ్యెత్తాలంటే అరగంట, దించాలంటే అరగంట పడుతుంది. కాలుతీసి కాలువెయ్యాలంటే గంట పడుతుంది. నేను దోపిడీలు మానభంగాలు చెయ్యడమేంటి నాయనా..." మొత్తుకున్నాడు వృద్ధుడు.

"అయితే నువ్వు సుబ్బారావుగారి భార్యను మానభంగం చెయ్యలేదంటావు. యామై రైట్?" అన్నాడు యస్పై.

"అయెయ్యో...మళ్ళీ అదే మాట...రిటైరై పాతికేళ్ళయింది బాబూ..."వలవల ఏడ్చాడు వృద్ధుడు.

గుంపులోంచి బయటకొచ్చాడు ఓ వ్యక్తి.

"అయ్యా యస్పైగారూ... తమ కమలాల వంటి నయనాలతో ఒక్కసారి ఈవిడను చూడండి". ఓ స్త్రీని చూపించాడు.

ఆమెవైపు చూసి భళ్ళున రాబోతున్న వాంతిని బలవంతంగా ఆపుకున్నాడు యస్పై.

"యూ బ్రూట్...ఎవత్తెరా ఇది? తాటకా? శూర్పణఖా? లేక బ్రహ్మరాక్షసా? పిశాచా? గురిచూసి ఒక్క గుండు పేల్చానంటే గుండు దూసుకొచ్చి గుండెల్లో దూరి తలపండు చీల్చుకుని బయటకు తన్ను కొస్తుంది." తుపాకీని పొజిషన్‌లోకి తీసుకున్నాడు యస్పై.

ఆ వ్యక్తి అమాంతం యస్పై పాదాలమీద పడి "అంతపని చెయ్యకండి బాబూ...ఈవిడ నెవరైనా మానభంగం చేస్తారా?" అంటూ అడిగాడు.

రెండు చేతులు ముఖానికడ్డం పెట్టుకున్నాడు యస్పై. "ఛీ...ఛీ...ఛీ...దీని ముఖాన్ని ఒకసారి చూస్తే ఎటువంటి మగాడికైనా కామవాంఛలు నశించి సన్యాసం పుచ్చుకుని కాశీ వెళ్ళిపోతాడు" అంటూ ప్రకటించాడు.

"ఆవిడే బాబూ నా భార్య..."మొత్తుకున్నాడు సుబ్బారావు. గతుక్కుమన్నాడు యస్పై.

"తమరు తడవ తడవకు మానభంగం మానభంగం అంటూ మా మానాన్ని భంగం చెయ్యద్దు సార్...మా మానాన మమ్మల్ని బ్రతకని య్యండి సార్" అంటూ భోరుమన్నాడు సుబ్బారావు.

"భ్రష్టుడా...కట్నం కోసం కక్కుర్తి పడుంటావు. నిన్ను యాంటీ డౌరీ కింద బుక్ చేసి లాకప్పులో వేసి మక్కెలు విరగ్గొట్టాలి" అన్నాడు యస్పై రౌద్రంగా.

"సారీ సార్...పొరబాటైంది" అన్నాడు సుబ్బారావు వెక్కిళ్లు ఆపుకోవడానికి ప్రయత్నిస్తూ.

"మా పక్కింట్లో దొంగలు పడ్డారు. రేపులు జరుగుతున్నాయి. వెంటనే రమ్మని మాకు రెండు సార్లు ఫోన్‌చేసిన ఆ దొంగ నా కొడుకెవడ్రా? మా

ఈ సీరియల్‌ను స్పాన్సర్ చేస్తున్నవారు
కె.ఎం.సి.కన్‌స్ట్రక్షన్స్ లి.
తరపున
శ్రీ రాజమోహన్ రెడ్డి
ఛైర్మన్ & మేనేజింగ్ డైరెక్టర్

పాటకచేరీ జరుగుతోంది. "ఆవిడ పూర్వజన్మలో గాడిద అయియుంటుంది" పక్క సీతాయనతో అన్నాడు గోపాలం.
"ఈ జన్మలోనూ గాడిదే" బదులిచ్చాడు పక్కాయన.
"అంత పక్కాగా ఎలా చెబుతున్నారు?"
"పాతికేళ్ళ నుంచి కాపురం చేస్తున్న అనుభవంతో"
అలా ముందూ వెనక చూసుకోకుండా గోపాలంలా వాగిన యస్సైని ఈ భాగంలో చూడండి.

విలువైన సమయాన్ని వృధా చేసిన ఆ లుచ్ఛాగాడెవడు? హాయిగా బార్‌కు రైడింగ్‌కు వెళ్ళిన మమ్మల్ని వెనక్కు రప్పించిన ఆ నీచ్ కమీన్ కుత్తేగాడెవ్వడు? చెప్పండి...నేను సింహాన్ని... విరుచుకు తింటాను" అంటూ వీరంగం వెయ్యసాగాడు యస్సై.

ఆ తిట్లకు కడుపులో పేగులు కదిలాయి వెంకట్రావుకు. వెంకట్రావుని బలవంతంగా వారించింది సుందరి.

"పెద్దవారు చెడ్డవారు కారు. కంట్రోల్..." అంటూ గొణిగింది.

మరో నడివయస్కుడు ముందుకొచ్చాడు.

"యస్సైగారూ...తమరు క్షమించి తిట్టనంటే... ఈ కాలనీలో అంతా నిత్య దరిద్రులు. ముప్పై సంవత్సరాల నుంచీ చూస్తున్నాను. ఏనాడూ దొంగలు ఈ కాలనీ కొచ్చి తమ సమయాన్ని వేస్ట్ చేసుకోలేదు. నెలలో రెండోవారం వస్తే ఎవడి జేబులో పైసా ఉండదు. మీకెవరో తప్పుడు సమాచారం ఇచ్చి ఉంటారని నా మట్టి బుర్రకు అనుమానం వస్తున్నది. దయచేసి బూతులు తిట్టద్దు..." దణ్ణం పెడుతూ అన్నాడు.

"తప్పుడు సమాచారమా? ఎవడువాడు? మాకు రాంగ్ ఇన్ఫర్మేషనిచ్చిన వాడెవడు? వాడి మక్కెలిరగ్గొడతాను. తల్లకిందులుగా వేలాడదీసి జన్మలో దేనికీ పనికిరాకుండా లాఠీ విరిగిందాకా బాత్తాను. నేను సింహాన్ని" లాఠీ గిరగిర తిప్పుతూ అన్నాడు యస్సై.

"మేమెవరం చెయ్యలేదుసార్" అంతా ముక్త




కంఠంతో అన్నారు.

"ఐసీ...అయితే మా అంతట మేమే పరిశోధించి కనుక్కోవాలన్నమాట! అప్పుడు వాణ్ణి కొడతాను చూడూ...ఎముక అంటే ఎలా ఉంటుందో మర్చిపోతాడు. ఈ వీధిలో ఎంత మంది ఇళ్ళలో ఫోన్లున్నాయి?" అన్నాడు యస్సై.

"ఈ వీధిలో ముగ్గురిళ్ళలో ఫోన్లున్నాయి సర్. ఒక పబ్లిక్ బూత్ ఉంది" చెప్పాడొకాయన.

"గుడ్...వారిలో వెంగళ్రావెవరు? ముందుకు రండి" తీక్షణంగా అన్నాడు యస్సై.

అంతా ముఖాముఖాలు చూసుకున్నారు.

"వెంగళ్రావా? ఆయన చచ్చి ఆరు తద్దినాలు కూడా అయ్యాయి.... మా తాతగారు" చెప్పాడొక వ్యక్తి.

"ఐసీ... అయితే పేరు కూడా మార్చి చెప్పాడన్న మాట! స్టుపిడ్...వాడు దొరకాలీ...వేళ్ళు విరిచి వేపుడు చేస్తాను. ఫోన్లున్న వారు ముందుకు రండి. కమాన్..." పెద్దగా అరిచాడు యస్సై.

వెంకట్రావు, సత్యం, ప్రసాదులు ముందు కొచ్చారు.

"పబ్లిక్ బూతాయన ఎక్కడ?" లాఠీ ఊపాడు యస్సై. తుపానులో తడిసిన పక్షుల్లా వణక సాగారు అందరూ.

"ఎక్కడ బూతాయన? బూతాయన ఎక్కడ?" అందరూ అరవసాగారు.

"ఏయ్...ఏంటా వెధవమాటలు? అశ్లీలం." అరిచాడు యస్సై.

అందరి నోళ్ళు మూత పడ్డాయి.

"సార్ పబ్లిక్ బూతు పదిగంటలకే మూసేస్తాడు. అందువలన పబ్లిక్ బూత్ నుంచి మీకు ఫోనొచ్చే అవకాశం లేదు" చెప్పాడొకాయన.

"వెరీగుడ్...అయితే మాకు ఫోన్ చేసింది బూతు మనిషి కాదు. మరెవరు?..." అన్నాడు యస్సై లాఠీని అరిచేతిలో బాదుకుంటూ .

"సుబ్బారావుగారికి అటు ఇటు ఇళ్ళలో ఎవరికైనా ఫోన్లున్నాయా?" అడిగాడు యస్సై.

"సుబ్బారావుగారింటికి ఎడమ వైపున రెండిళ్ళ తరువాత రిటైర్డ్ జడ్జి కుటుంబరావుగారికి ఫోన్ ఉంది. సుబ్బారావుగారింటికి కుడివైపునున్న వెంకట్రావుగారికి ఈ మధ్యనే ఫోనొచ్చింది." చెప్పాడో కుర్రాడు.

"గుడ్...గుడ్...కుర్రాడంటే నీలా ఉండాలి. ఈ దేశ భవిష్యత్తు నీలాంటి వాళ్ళ చేతుల్లోనే ఉంది. ఎక్కడ కుటుంబరావుగారు?" అడిగాడు యస్సై.

వెంకట్రావుకు బీపీ పెరిగిపోసాగింది. పోలీసుల చేతుల్లో తనకు దేహశుద్ధి తప్పదని తెలియగానే నరాలన్నీ చచ్చుబడ్డాయి.

"సార్... కుటుంబరావుగారు తన కుటుంబంతో సహా తీర్థయాత్రలకని తిరుపతి వెళ్ళారండి. ఇంకా తిరిగి రాలేదు" చెప్పా డొ



**పెళ్ళైన ప్రతి దంపతులూ జీవితంలో ఒక్కసారైనా అనుకునే మాట ఏంటి?**
**జీవితంలో చస్తే పెళ్ళి చేసుకోకూడదని**
**ఈ సీరియల్‌లో సుందరి, వెంకట్రావులకు కూడా అలాంటి సందర్భం వచ్చింది.**

కాయన.

వెంకట్రావు కాళ్ళకింద నేల కదిలింది. దిక్కుమాలిన పని చేసినందుకు తనను, తనను కన్న తల్లి దండ్రులను బండబూతులు తిట్టుకున్నాడు.

"అయితే ఇది నిస్సందేహంగా వెంకట్రావు చేసిన పనే" డిక్లేర్ చేశాడు యస్సై.

"సార్...సార్...నాకేం తెలియదు. మేము ఇవాళ తొమ్మిది గంటలకే నిద్రపోయాం. చెవుల్లో సీసం కరిగించి పోసినా మెలకువరానంత నిద్రపట్టింది. నన్ను నమ్మండి సార్..." ప్రాధేయ పడ్డాడు వెంకట్రావు.

"మిస్టర్ వెంకట్రావ్! పోలీసులకు తప్పుడు సమాచారం ఇవ్వడం, ఇవ్వలేదని బుకాయించడం తీవ్రనేరాలు. దీనికి ఐ.పీ.సీ....ఐ.పీ.సీ..."

"మూడొందల రెండు సార్" అంటూ అందించాడు కానిస్టేబుల్ బహు వినయంగా.

అతని వంక గుర్రుగా చూశాడు యస్సై.

"నాకు తెలుసు లేవోయ్...దానికింద ఏడాది కఠిన కారాగారం. పద స్టేషన్కు" లాఠీ ఊపాడు.

వెంకట్రావు బట్టలు చెమటతో తడిసి ముద్దయ్యాయి. సుందరి జోక్యం చేసుకుంది.

"యస్సైగారూ...ఆ ఫోన్ మావారు చెయ్యలేదు. దొంగలు మరోచోట ఎక్కడైనా దొంగతనం చేస్తూ మిమ్మల్ని తప్పుదోవ పట్టించడానికి, మిమ్మల్ని స్టేషన్లోంచి బయటకు పంపేయడానికి ఇక్కడ దొంగతనం జరుగుతున్నట్లు మీకు రాంగ్ ఇన్ఫర్మేషన్ ఇచ్చుండచ్చు కదా" పెద్ద గొంతుతో అన్నది.

యస్సై ఆలోచనలో పడ్డాడు. జేబులో వాకీ టాకీ మోగింది. మాట్లాడసాగాడు.

"సార్...నేను వన్ నాట్ త్రీని. దొంగలు మన స్టేషన్ వెనుక నుంచి గోడ దూకి నాలుగు రైఫిల్స్ తీసుకెళ్ళారు. మీరు వెంటనే రావాలి" వినిపించింది.

యస్సై ప్యాంటు తడిసిపోయింది. భయాన్ని బైటకు కనిపించనివ్వకుండా నిగ్రహించుకున్నాడు.

"ఓ.కే. మైడియర్ సిటిజన్స్. మీకేం భయం లేదు. మీ మొహాలు చూస్తే మరో పదేళ్ళ వరకూ ఏ దొంగా ఇటువైపు వస్తానిపించడంలేదు. ఒకవేళ ఎవడైనా ఖర్మబాగోలేక ఇటొస్తే వేంటనే మాకు ఫోన్ చెయ్యండి. వీలైతే పట్టుకోండి. కానీ పోలీసులను మిస్‌లీడ్ చెయ్యడం మాత్రం నేరం. బీ కేర్‌ఫుల్" హెచ్చరికలు చేసి పటాలంతో సహా వెళ్ళి పోయాడు.

అందరూ ఊపిరి పీల్చుకున్నారు. నిద్రాభంగం చేసినందుకు పోలీసులను తిట్టుకుంటూ వెళ్ళిపోయారు.




ఇంట్లోకి రాగానే రెండు చెంబుల మంచి నీళ్ళు తాగాడు వెంకట్రావు. వణుకు కొంచెం తగ్గింది.

"నీ బుర్ర పాదరసం సుమా. సమయానికి నువ్వు చక్రం అడ్డం వెయ్యకపోతే నా వళ్ళు ఫులుసై పోయుండేది. తలచుకుంటే అండపిండాలు పగిలి పోతున్నాయి." అన్నాడు.

"అందుకే తనకు మాలిన ధర్మం పనికి రాదంటారు. మరా దొంగలేమైనట్లు? వాళ్ళు సుబ్బారావు గారింట్లో పడలేదా? వాళ్ళూ మనలాగే బయటకొచ్చారు. మరి ఆ చప్పుళ్ళేంటి? దొంగలేమైనట్లు? మనం కలగన్నామా? భ్రమపడ్డామా?" ప్రశ్నల వర్షం కురిపించింది సుందరి.

"అబ్బ...ఆపు నీ ప్రశ్నలు. పోలీసుల్లాగా ఇంటరాగేషన్? చావు తప్పి కన్నులొట్టపోయింది. అంతా పీడకల." విసుక్కున్నాడు వెంకట్రావు.

* * *

మర్నాడు ఆఫీసుకు బయల్దేరుతూ ప్యాంటు కోసం బీరువా తెరిచాడు వెంకట్రావు.

"హుప్" మని మీదకు దూకిందో ప్రాణి.

గావుకేక పెట్టాడు వెంకట్రావు. గుండెఝల్లు మంది. సుందరి పరిగెత్తుకుంటూ వచ్చింది.

వణికి పోతున్న వెంకట్రావును చూసి ఏమైందని అడిగింది.

"ఎ...ఎ...ఎ...ఎలుక...ఎలుక...బీరువాలోంచి మీదకు దూకింది." చెప్పాడు వెంకట్రావు.

"ఆఁ..." నిర్ఘాంతపోయి బీరువాలోని బట్టలన్నింటిని బయటకు లాగింది సుందరి.

కొత్త చీరలు, జాకెట్లు, ప్యాంట్లు, షర్టులు ఇతర బట్టలన్నీ బదాబదలై ఉన్నాయి. కొత్తగా పళ్ళు మొలుస్తున్న కుక్కపిల్ల బండలను కొరికినట్లు బట్టలన్నిటిని కొరికి పారేసింది ఎలుక.

"అయ్యయ్యో...దారుణం...దారుణం...బట్టలన్నీ సర్వనాశనమై కట్టు బట్టలతో మిగిలాం. అయినా ఆ పాడు ఎలక బీరువాలోకి ఎలా వెళ్ళింది? తలుపులు తీసి పెట్టావా? బుద్ధుందా అని..." గయ్యిమన్నాడు వెంకట్రావు.

"ఉరుము ఉరిమి మంగలం మీద పడ్డట్లు నా మీద ఎగురుతారేం? నేనెపుడు తీశాను? నిన్న



సాయంత్రం లుంగీ కోసం బీరువా తెరిచారుగా. అపుడు దూరి ఉంటుంది'' అన్నది సుందరి.

''మైగాడ్...ఇపుడెలా ఆఫీసుకు వెళ్ళడం?'' కీచు గొంతుకతో అరిచాడు వెంకట్రావు.

''మీ ఆఫీసు తగలబడిపోనూ...ఇంట్లో ఉన్నబట్టలన్నీ సర్వనాశనమైపోయి నేనేడుస్తుంటే ఆఫీసుకు వెళ్ళడం గురించి ఆలోచిస్తారేంటి? కొని ఆరుమాసాలైనా కట్టుకోడానికి ప్రాణమొప్పక దాచుకున్న కొత్త చీరలు. మొన్న పండక్కి మనం మా ఊరెళ్ళినపుడు సైకిల్ తాకట్టు పెట్టి మా నాన్న మీకు కొని పెట్టిన బట్టలు...''

''పెట్టాడ్లే బోడి చంద్రగుప్తుడి కాలం నాటి డొక్కు సైకిల్... తాకట్టు పెట్టి... ఎవడు పెట్టమన్నాడు? ఏడుస్తూ పెట్టి ఉంటాడు. అందుకే అన్నీ ఊడ్చిపెట్టుకు పొయ్యాయి. నేనేమైనా పెట్టమని దేబిరించానా మీ అయ్యను...''

''మర్యాదగా మాట్లాడండి. అయ్య గియ్య అంటే ఊరుకునేది లేదు.''

''అయ్యను అయ్య అంటే తప్పేంటి? అయ్య అనక కొయ్య అంటారా? ఊరుకోకపోతే ఉరేసుకో''

''నేను ఉరేసుకుంటే మీ నోట్లో మట్టే. హాయిగా రెండో పెళ్ళి చేసుకుని మళ్ళీ కట్నం కొట్టేసి కొత్త పిల్లతో కులకొచ్చని ఆశపడుతున్నారేమో...''

''ఛీఛీ...మళ్ళీ పెళ్ళా? ఇక ఏడు జన్మల దాకా పెళ్ళి అంటేనే భయం పుడుతున్నది. ఛస్తే చేసుకోను''

''పైకి అలాగే అంటారు. పెళ్ళాం శవాన్ని తగలబెడుతూనే సంబంధాలు మాట్లాడుకుంటారు. నేను అందరిలాంటి ఆడదాన్ని కాదు. నా చావుకు బాధ్యులెవరో ఉత్తరం రాసి పెట్టి మరీ చస్తాను.




జాగ్రత్త''

''ఛీ నోర్ముయ్...నీ నోట్లో నోరు పెట్టడం నా బుద్ధి తక్కువ''

''దాని కోసమే రాత్రి పూట కాళ్ళు పట్టుకుంటారు''

''ఛీ...''

''ఛి...ఛీ...''

రెండు నిముషాలు ఎడముఖం పెడముఖం.

మెల్లగా సుందరివైపు చూశాడు వెంకట్రావు. కోపంలో సుందరి శ్రీకృష్ణ తులాభారంలో అలకసీనులో జమునలా ఉంటుంది.




జరిగిందంతా క్షణంలో మర్చిపోతాడు వెంకట్రావు.

''మాటకు మాట అనందే ఊర్కోవు కదా?''

''ఎందుకూరుకోవాలి? నా మొగుడు పెద్ద ఆఫీసరు. నా మాట జవదాటడు. నాకేం తక్కువని?''

వెంకట్రావు ఉబ్బిపోయాడు.

''అది నిజమేననుకో. కానీ ఈ ఎలుక బాధ నుంచి విముక్తి ఎలా అని ఆలోచిస్తున్నాను.'' సుందరి బుగ్గ పిండుతూ అన్నాడు.

''చాల్లెండి సరసాలు. మార్కెట్లో 'రాటేట్' అనే ఎలుకల మందుంటుందిట. చాక్లెట్ కలర్లో కేకుల్లా ఉంటాయి ముక్కలు. దాన్ని తెచ్చి ఇంట్లో పెడితే ఆమడ దూరంలో ఉన్న ఎలుకలు కూడా బిరబిరమంటూ వచ్చి తింటాయట. తిన్న తరువాత అరగంటకల్లా నట్టింట్లోకొచ్చి తన్నుకొని ఛస్తాయట. మన పొరుగింటి ఆండాళ్ళమ్మగారు ఆ విధంగానే మూట ఇరవై ఎలుకల్ని చంపి పీడా వదిలించుకుందట. రేపు ఆఫీసు నుండి వస్తూ ఆ మందు పట్రండి'' అన్నది సుందరి.

''ఓకే డార్లింగ్...రేపటిదాకా ఎందుకు? ఈరోజు సాయంత్రమే తెస్తాను''అన్నాడు వెంకట్రావు బయల్దేరుతూ .

సాయంత్రం ఇంటికొస్తూ షాపుకెళ్ళాడు.

''ఏం కావాలి సార్?'' అడిగాడు షాపతను.

సుందరి చెప్పిన పేరేమిటో ఎంత ఆలోచించినా గుర్తు రాలేదు వెంకట్రావుకు. రెండు నిముషాలు ఆలోచించి తలగోక్కుంటూ ''విషం'' ఉందా?'' అడిగాడు.

విరగబడి నవ్వాడు షాపతను.

''విషమా? మీకెందుకు సార్? హాయిగా ఉన్నారు'' అన్నాడు.

''నాక్కాదయ్యా...ఎలుకకు''

''కానీ అది మనిషికి కూడా పని చేస్తుంది సార్''

''చేస్తే చెయ్యనియ్యవయ్యా...ముందా మందివ్వు...''

''సార్...జాగ్రత్తగా ఆలోచించుకోండి. జీవితం చాలా విలువైంది. ఒకసారి పోతే మళ్ళీరాదు. ఎన్నో పుణ్యాల సుకృతంగా మానవజన్మలభిస్తుంది. ఆయుషున్నంత వరకు బతకడం ధర్మం. మీ ఆవిడతో ఏదైనా తగాదాలొస్తే నాలుగురోజులు ఇంటికి వెళ్ళకండి. చచ్చినట్లు ఆవిడదారి కొస్తుంది. లేదా తిరుగులేని రాజీ మార్గం మీ ఆవిడ దారికి మీరు వెళ్ళడం. అమెరికాలో ఎలుకలమందు అసలు అమ్ముడుపోదు. ఎందుకంటే అక్కడ భార్యా భర్తల మధ్య తగాదా లేవైనా వస్తే వెంటనే డైవోర్స్ తీసుకుంటారు. కానీ దరిద్రం. మన దేశంలో ఒకసారి తాళి కట్టామంటే చచ్చిన దాకా పెళ్ళాంతో కాపురం చెయ్యాలి. లేదంటే ఇలా

"చట్నీలోకి అల్లం, పచ్చిమిర్చి తెస్తానని వెళ్ళి వస్తూ లారీ కింద పడి చట్నీ అయిపోయాడు" చెప్పింది ఉమ.
"అయ్యో.. అపుడేం చేశారు?" ఓదార్పుగా అడిగింది రమ.
"ఏం చేస్తాం? కారప్పొడితో తిన్నాం" చెప్పింది ఉమ. ఇటువంటి సన్నివేశం ఈ భాగంలో తగులుతుంది.

ఎలుకల మందు తీసుకోవాలి.''

వెంకట్రావుకు మండిపోయింది.

"ఏవయ్యో...ఇక ఆపు నీ లెక్చర్. ఆ మందేదో ఇస్తావా లేదా?" కోపంగా అన్నాడు.

"ఇవ్వక ఛస్తానా...నాదేం బోయింది? లలాట లిఖితాన్ని ఎవరు తప్పించగలరు. ఈ పాపంలో నాకెలాంటి భాగం లేదని భగవంతునికి తెలియజేస్తున్నాను. అయ్యా...మీ కెలాటి మందు కావాలి. తినగానే వెంటనే చచ్చే మందయితే పాతిక రూపాయలు. కొంచెం సేపు బాధ అనుభవించి గిలగిలా తన్నుకుని చచ్చేమందయితే పదిహేను రూపాయలు. రెండు గంటలపాటు గిజగిజతన్ను కుని వాంతులు చేసుకుని హాస్పిటల్‌కు తీసుకు వెళ్తుండగా దార్లో మరణించే రకం మందయితే పది రూపాయలు. సాధారణంగా పేదవాళ్ళు దీన్నే కొనుక్కుని పోతారు. ఏది కావాలి సార్?"అన్నాడు షాపతను ఏడుపు ముఖం పెట్టి .

తలబాదుకున్నాడు వెంకట్రావు.

"అదేదో చాక్లెట్లా, కేకులా ఉంటుందని..." అన్నాడు.

"అదా...రాటేట్...నిజంగా ఎలుకలే తింటే తిన్న అరగంటకల్లా నట్టింట్లో చస్తాయి. ఇల్లంతా కంపుకొట్టి ఎక్కడ చచ్చిందో వెతుక్కునే శ్రమ ఉండదు. ఇమ్మంటారా?"

"ఇవ్వండి"

"సరే...ఇదిగో...సార్...ఒక్క చిన్నమాట..."

"ఏమిటి?"

"ఇది నిజంగా ఎలుకలకే కదా?"

"అవునండీ బాబూ...అవును. ఎంత ఇది?"

"ఇరవై రూపాయలు"

పర్సులోంచి డబ్బు తీసిచ్చి బయట పడ్డాడు వెంకట్రావు. ఇంటికొచ్చాడు.

"ఎలుకల మందు తెచ్చారా?" అడిగింది సుందరి.

"ఆహా...తెచ్చాను. దీంతో ఆ ఎలుక చావడం ఖాయం." సుందరి చేతికిస్తూ అన్నాడు.

"హమ్మయ్య బ్రతికించారు. తొందరగా భోంచేద్దాం. వంట రెడీ అయింది. మీరు స్నానం చేసి రండి" హుషారుగా లోపలికెళ్ళింది.

"ఈ మందు కొంటానికి తలప్రాణం తోకలో కొచ్చింది" అన్నాడు వెంకట్రావుకు.

"దేనికి? ఇదేమైనా కొండలు పిండి చెయ్యడమా?"

"అది చాలా సులభం అనిపించింది. ఆ షాపు వాడు తెగ సతాయించాడు"

"మీరు సరిగ్గా అడిగారా?"




"అడిగాను. మనిద్దరం తన్నుకుని తలంటు పోసుకున్నామని అందువలన విషం తిని ఆత్మహత్య చేసుకోవాలనుకుంటున్నామని వాడి అనుమానం"

పకపక నవ్వింది సుందరి.

"ఒక వేళ తన్నుకుంటే మాత్రం చావవలసిన అవసరమేముంది?"

"ఏమో...వాడి భయంవాడిది. ఆఖరుకు షాపు నుంచి బయటకొస్తుంటే కూడా అనుమానంగానే చూశాడు"

మళ్ళీ కిలకిల నవ్వింది సుందరి.

ఇద్దరూ కలసి నవ్వుతూ భోంచేశారు.

"పాపాయి అపుడే పడుకుందేం?" అడిగాడు వెంకట్రావు.

"ఎందుకైనా మంచిదని పెందలాడే అన్నం పెట్టి నిద్రపుచ్చాను. దాని కళ్ళముందే ఈ కేకులు పెట్టమంటే దాని ధ్యాసంతా అటే ఉంటుంది" చెప్పింది సుందరి.

"వెరీ గుడ్...మంచిపని చేశావు. కానీ కానీ..." చెయ్యి కడుక్కుంటూ లేచాడు వెంకట్రావు.

"చేతులకు ఏదైనా పాత గుడ్డ కట్టుకోండి. జాగ్రత్తగా ముక్కలు చెయ్యండి. దీని మీద అలాగే రాసుంది" చెప్పింది సుందరి.

వెంకట్రావు రెండు చేతులకు కట్లు కట్టినట్లు పాత గుడ్డలు కట్టుకున్నాడు. జాగ్రత్తగా కేకును నాలుగు ముక్కలు చేశాడు. హాల్లో డైనింగ్ టేబుల్ కింద ఒకటి, బెడ్ రూమ్‌లో బీరువా కింద రెండు, వంట గదిలో ఫ్రిజ్ కింద ఒకటి పెట్టాడు.

తరువాత పాత గుడ్డను కిరోసిన్ పోసి తగల బెట్టాడు.

''హమ్మయ్య...ఒక పనైపోయింది'' పడుకుంటూ అన్నాడు.

''అది తింటుందంటారా?'' అడిగింది సుందరి.

"ఎవడి కోసం తింటుంది? వందమైళ్ళ దూరానున్నా పరిగెత్తుకుంటూ వచ్చి తింటుంది. తెల్లవారే సరికి మనింట్లో ఒక శవం లేస్తుంది"

"ఎవరిదీ?" ఉలికిపడి అడిగింది సుందరి.

"ఎలుకది." నవ్వుతూ చెప్పాడు వెంకట్రావు శృతి కలిపింది సుందరి.

(ఇంకావుంది)



మొక్కపాటి నరసింహశాస్త్రి గారి వర్ధంతి సందర్భంగా -



తెలుగునాట ఎల్లకాలం గుర్తుండిపోయే 'బారిష్టరు పార్వతీశం' పాత్ర సృష్టికర్తగా శ్రీ మొక్కపాటి (1892-1973) విశేషమైన ఖ్యాతి గడించారు. పిఠాపురం దివాన్ గారి సోదరులైన శ్రీ మొక్కపాటి ఉన్నత విద్యాభ్యాసం ఇంగ్లండులోని ఎడింబరో విశ్వవిద్యాలయంలో సాగింది. అక్కడ దుగ్గిరాల గోపాలకృష్ణయ్య గారితో కలిసి 'ఇండియన్ అసోసియేషన్'లో ప్రధానపాత్ర వహించారు. స్వదేశానికి తిరిగివచ్చిన తర్వాత కొన్ని ఉద్యోగాలు చేసినా ఏ ఉద్యోగానికి కట్టుబడకుండా సాహిత్య వ్యాసంగానికే కట్టుబడ్డారు. సాహితీ సమితిలో, నవ్యసాహిత్య పరిషత్తులో సభ్యులు. 1920లో శ్రీకారం చుట్టిన ఆయన కలం నుండి 1924 లో 'బారిష్టరు పార్వతీశం' వెలువడి ఉదాత్త హాస్యానికి చిరునామాగా పేరుగాంచింది. ఆ నవలను 1940 లో సినిమాగా మలిచినతీరు ఆయనకు రుచించలేదు. సినీరంగానికి పనిచేయకపోయినా, ఒక విద్యాధికుడైన రచయితగా, మేధావిగా సినిమాల గుణగణాల గురించి, ఆయనకు ఖచ్చితమైన అంచనాలు ఉన్నాయి. 1950 లో ఆంధ్రపత్రికకై రాసిన ఈ కింది వ్యాసంలో సినిమాలలో హాస్యం' గురించి ఆయన తన అభిప్రాయాలు నిర్మొగమాటంగా వెల్లడించారు -

# సినిమా చిత్రాలలో హాస్యం

## మొక్కపాటి నరసింహశాస్త్రి

సృష్ట్యాది నుంచి నేటివరకూ మానవుడికి కొరత లేకుండా, సమృద్ధిగా ఉన్నది కాలం ఒక్కటే.

నాటకములు, యక్షగానములు, భాగవతములు, నృత్యగీతాదులు వగైరా వినోదములు తనకధికముగా ఉన్న కాలాన్ని ఏమి చెయ్యడానికి తోచక మానవుడు తెచ్చిపెట్టుకున్నవే -ఈ వినోదములలో విశేషంగా హాస్యానికి స్థానం ఏర్పడ్డది. అసహజమైనట్టి కాని వికృతాకారం కలిగినట్టి కాని, వస్తువు కాని మనిషి కాని కనపరచి నవ్వించవచ్చును. కాని ఇది హాస్యంలో చాలా తక్కువ మెట్టులోనిదని చెప్పవలసి వస్తుంది. సినిమాల ప్రారంభదశలో, చలనచిత్రములు,



పేరుమోసిన హాస్యనటుడు శ్రీ శివరావు

టాకీలు కాక మూకీలుగా ఉన్నప్పుడు, అమెరికాలో హాస్యచిత్రములలో చాలా వరకు 'ఫ్యాటీ' అని చాలా లావుపాటి మనిషిని ప్రదర్శించి అతనిచేత కొన్ని వికార చేష్టలు చేయించి దర్శకులు ప్రజలను హర్షింపచేసేవారు. అలాగే తెలుగు సినిమాలో కూడా హెచ్.ఎమ్.రెడ్డి గారు బొండాం అని ఒక లావుపాటి మనిషిని సంపాదించారు. అతని చేత 'గృహలక్ష్మి'లో కాబోలు మోటారు టైరులో గాలిపోతే అతని పొట్టకు పంపు ఆనించి గాలి కొట్టించారు టైరులో. 'బొండాం పెళ్లి'లో కాబోలు, అతనికి గోచీపెట్టి దండాలూ బస్కీలూ తీయించి అతని శరీరం నుంచి బయలుదేరిన స్వేదం కాలువగట్టి, గదంతా తడిసినట్టు చూపించారు.

ఈ 'బొండాం పెళ్లి'లోనే ననుకుంటాను చెరువుదగ్గర నుంచున్న కొందరు ఒకళ్ల నొకళ్లు చెర్లోకి తోసుకుంటారు. ఈలాగే నడుస్తూ ముందుకి పడడం, పడి మొగ్గ వేసినట్టు దొర్లడం, వికారంగా నడవడం-చాప్లిను పద్ధతిని - ఎదుట ఏమున్నదీ చూసుకోకుండా వెళ్లి దానిమీద పడి, ఏ గోడో తలుపో అయితే ముఖానికి బొప్పి కట్టించుకోవడం, మనిషైతే, ముఖ్యంగా ఆడమనిషి అయితే లెంపకాయ తినడం, లేదా తనకు లోకువగా ఉన్న వాళ్లను కొట్టడం- హార్డీ, లారెల్‌ను కొట్టినట్లు- ఈలాటి అసహజమైన, వెర్రివికారాల వల్ల కూడా నవ్వు పుట్టించవచ్చు. ఈరకం హాస్యం విశేషంగా అతిశయ చేష్టలమీద ఆధారపడి ఉంటుంది. దానిని 'బర్లెస్క్' అంటారు



'రైతుబిడ్డ'లో ఖాసాసుబ్బన్న పాత్రను అద్భుతంగా నిర్వహించిన శ్రీ బి.ఎన్.ఆర్.

ఇంగ్లీషులో. ఈ రకం హాస్యంలో, కవి చాతుర్య మసలే ఉండదు. దర్శకునికి గాని, నటునకు గాని, విశేష ప్రజ్ఞ ఏమీ అవసరం ఉండదు. ఈ మాదిరి హాస్యం వల్ల సాధించే ప్రయోజనమేమీ ఉండదు-ఊరికే జనాన్ని నవ్వించడం వరకే.

పాశ్చాత్యులలో కూడా ఈ శతాబ్దారంభంలో, బర్లెస్క్-వికట హాస్యం మీద ఉన్న అభిమానం పూర్తిగా తగ్గిపోయి సున్నితమైన, భావగర్భితమైన, అనూత్తమమైన హాస్యము మీద దృష్టి మరలింది. వికటహాస్యంతో విఖ్యాతి సంపాదించిన చాప్లిన్ కూడా మహాతత్త్వవేత్తలా పరిణామం పొంది

అద్భుత, గంభీర, హృదయ విదారకములైన భావములను తన హాస్యదృష్టితో చూచి, హాస్యనటన ద్వారా ప్రజలకు ప్రదర్శించాడు. అటువంటి హాస్యం కావలెనంటే కవి, దర్శకుడు, నటుడూ, ముగ్గురూ విశేషమైన విజ్ఞానము, అనుభవం, ఆదర్శం కలవాళ్లు అయి ఉండాలి. అప్పుడే ఉదాత్తభావాలను, అనుభవాలనూ హాస్యరసంలో తెరమీద చూపించడానికి వీలవుతుంది. తెలుగు సినిమాలలో కూడా ఇప్పుడిప్పుడు హాస్యం కావలెననీ, అది ఉంటే ఎక్కువ జనాదరణ ఉంటుందనీ, తద్రీత్యా ఎక్కువ ధనాకర్షణ చెయ్యవచ్చుననీ అభిప్రాయాలు బయలుదేరినాయి. కాని దాని నేరీతిగా సాధించవలెనో తెలియక బాధపడు తున్నారనుకుంటాను.

ఏ కారణం చేతనో తెలుగుదేశంలో హాస్యం తక్కువ. అందులోనూ తెలుగు సినిమా దర్శకులలో బొత్తిగా తక్కువేమోనని నా అనుమానం. ఆపైన చక్కని కవనం, చక్కని సంగీతం, చక్కని వాక్చాతుర్యంలాగనే చక్కని హాస్యరచన చేయుగలగడం కూడా ఒక ప్రజ్ఞావిశేషమని గుర్తించలేకపోవడమొక లోటు. ఆపైన నటీనటులు చాలా మంది తాము కామిక్ బాగా చేస్తామనే నమ్మకం కలవారు కావడమొక దురదృష్టం. కవి, దర్శకుడు, నటుడు, ముగ్గురూ సమాన సంస్కారం, సమాన అభిప్రాయం కలవాళ్లు అయితేనే కాని హాస్య చిత్రం తయారు కావడం కష్టం. అందుకనే కృష్ణన్, మధురం ప్రదర్శించే హాస్యం లాగనే తెలుగులో కూడా కథకు



నిగ్గుతేలిన నటుడు, హాస్య పాత్రధారి శ్రీ సి.ఎస్.ఆర్.

సంబంధం లేని వెకిలి హాస్యం, 'వందేమాతరం'లో అత్తింటికొచ్చిన అల్లుడు మిట్టమధ్యాహ్నం నడికప్పు ఎక్కి నాట్యం చేసినట్లు, బయలుదేరింది.

తరువాత హాస్యం ఆలంకారికులు చెప్పిన నవరసములలోనూ ఉదాత్తమైనది, ఉత్కృష్టమైనదని గ్రహించలేకపోవడమొకలోటు. అందుచేతనే హాస్యమంటే వెకిలితనమో, వెక్కిరింపో, బూతో అనే దురభిప్రాయం బయలుదేరింది. వాటిని చూస్తే నవ్వు రాదని కాదు. తప్పని కూడా కాదు నా అభిప్రాయం. వాటినే రచనలోనూ ప్రదర్శనలోనూ సంస్కారి చక్కగా రాయుగలడు. ప్రదర్శించగలడు. బ్రాహ్మణ ఛాందసం పరిహసించడానికి హెచ్.ఎం.రెడ్డిగారు 'గృహలక్ష్మి'లో బ్రాహ్మణుని కల్లుపాకలో కూర్చోపెట్టేరు. బ్రాహ్మణులు తాగరని కాదు. ఎటొచ్చీ కల్లుపాక కెళ్ళేటప్పుడు, అంత నిష్టగా శుచిగా, స్నానం చేసి విభూతి పెండికట్లో, పట్టె వర్ధనాలో పెట్టుకు బయలుదేరరనుకుంటాను.



హాస్యనటుడు రామమూర్తి

అశ్లీలం స్ఫురింపచేయడానికి ఆవకాయబద్దా అప్పడాలకర్రా అని ఒకరన్నారు. మరొకరు, బలిజేపల్లి వారనుకుంటాను-'శుభమా అని కాస్త తలపెట్టేటప్పటికి ఇలా ముంచుకొస్తోంది నాకు' అన్నారు. బయట ఉన్న భార్యతో - దానిలో అశ్లీలం ఆలోచిస్తేనే కాని పూర్తిగా అవగాహన కాదు. ఆలోచించిన కొద్దీ ఎంత అశ్లీలమో స్ఫురిస్తుంది.

ఒక్కమాట వల్ల కాని, ఒక్క చేష్ట వల్ల కాని ఎంతో భావం స్ఫురింప చెయ్యడం బహు కొద్ది మందికి సాధ్యమవుతుంది కాని ప్రతివాళ్ళ సొమ్మూకాదు. నేను చిన్నప్పుడు ఇంగ్లాండులో చూచిన నాటకంలో ఒక చిన్న నటన నాకు ఎప్పుడూ జ్ఞాపకం వస్తుంది. ఒక కోటీశ్వరుని కొడుకు ఏ చీకూ చింతా లేక జీవితమంతా క్లబ్బులలో గడిపిన వాడు. అతని తండ్రి గొప్ప వ్యాపారస్తుడు, చనిపోయినాడు. ఆ కంపెనీల డైరెక్టరులంతా పోయినవాని స్థానంలో కొడుకుని పెట్టడానికి తీసుకొచ్చి, బలవంతాన కూర్చోపెట్టి వ్యాపారమంతా వప్పచెపుతుంటే, వాడికంతా అయోమయంగా ఉండి, వాళ్లు చెపుతున్నది వినిపించుకోక, పరధ్యానంగా, అలవాటు చొప్పున అక్కడున్న ఉత్తరాల దొంతర తీసి, పేక కలిపినట్టు కలిపి అందరికీ పంచాడు. ఆ ఒక్క ఏక్షనుతో తన గత జీవితమంతా మాటలక్కరలేకుండా చెప్పగలిగాడు. అటువంటి ఏక్షను మన తెలుగు 'మొదటి రాత్రి'లో శివరావు చూపించాడు. ఎవరో ఒకరు మంచినీళ్లు ఇమ్మంటే రెండు గళాసులతో తీసుకొచ్చి, అవి ఒక గళానులోనుంచి మరోదాంట్లోకి రెండుసార్లు తిరగబోసిఇస్తాడు. దానివల్ల వాడి జీవితమంతా కాఫీ హోటల్లో కాఫీ ఫలహారాలందివ్వడంలో గడిచిపోయిందని తెలుస్తుంది.

ఇతర రంగములలో వలెనే సినిమా రంగంలో కూడా మనకు ఉపజ్ఞ(ఒరిజినాలిటీ) తక్కువ-తక్కువే కాదు శూన్యం అనవలెననిపిస్తుంది. నాలుగు పుస్తక భాగాలు తస్కరించి కథ అతకడం,



ప్రసిద్ధ నాటకకర్త, సినిమా రచయిత శ్రీ బలిజేపల్లి లక్ష్మీకాంత కవి



భానుమతి



హాస్యనటుడు రేలంగి వెంకటరామయ్య



ప్రఖ్యాత తమిళ హాస్యనటుడు శ్రీ టి.ఆర్.రామచంద్రన్

నాలుగు ఇంగ్లీషు, హిందీ చిత్రములలో సీన్లు, షాట్లు చౌర్యం చేయడం, నాలుగు హిందీ వరుసలనుసరించి పాటలు తెలుగున రాయడంపైగా ఈ అతుకులమారిబొంతకు ఆంధ్రుల ఆశాజ్యోతి, మేటి తెలుగు చిత్రం, ఆంధ్రావని కమూల్యాలంకారం వగైరా బిరుదులు....

కథ సొంతం ముందు ఆలోచించుకుని, దానికి సందర్భశుద్ధి చెడకుండా అసహజమనిపించకుండా, అంతా దైవికంగా జరిగినట్లుండేలాగున ఒకదాని తరువాత ఒకటి, సంఘటనలు వచ్చేటట్లు ఆలోచించి తయారు చేస్తే అందమైన చిత్రం ఎందుకు తయారు కాదు? అలా వెతుక్కోకుండా తడుముకోకుండా సంఘటనలాలోచించగలవాడు, సదాశివబ్రహ్మ మొకడు. ఆయన పాపం పైకి రాలేకుండా ఉన్నాడు. నటులలో పాత్రౌచిత్యం చెడకుండా మొదటి నుంచీ చివరి వరకూ ఒకే రకంగా నటించినవాడు రైతుబిడ్డలో ఖాసా-సుబ్బన్నగా నటించిన బి.ఎన్.ఆర్. అలాగే మరొకరకమైనా బాలనాగమ్మలో చాకలిగా నటించిన లంక సత్య మొకడు. షావుకారు చిత్రంలో కోమటి బిడ్డగా నటించిన రేలంగి ఒకడు. చాలాకాలం నాయక పాత్రలకే అలవాటుపడ్డ సి.ఎస్.ఆర్. కూడా హాస్య రస ప్రధానమైన పాత్రలను చక్కగా నిర్వహించగలడని తేలింది ఈమధ్యను.

హాస్యమందభిమానమున్నవాడు, దాని రూపాన్ని కొంతవరకు గుర్తెరిగినవాడు, దర్శకులలో ఎన్.జగన్నాథ్. కాని ఆయన తీసిన చిత్రాలెందుకో విజయవంతం కాలేదు. ఈ అదనులో ఆయన పూర్తి అయిన హాస్య చిత్రం తీస్తే జయప్రదం కాగలదని నా నమ్మకం.

స్త్రీలలో హాస్యనటనకు భానుమతి అద్భుతంగా ఉంటుందని నా నమ్మకం. ఆ రకం చిత్రంలో ఆమెదే అగ్రతాంబూలమని నా దృఢ విశ్వాసం. అటువంటి చిత్రం తయారయ్యే తరుణం కోసం నిరీక్షిస్తూ ఉండడం తప్ప ఏమి చెయ్యగలం.

మనకునటీనటులున్నారు. దర్శకులున్నారు. శ్రీశ్రీ కొడవటిగంటి, భమిడిపాటి, మునిమాణిక్యం లాటి రచయితలు, హాస్యరసారాధకులున్నారు. హాస్య చిత్రములు బయలుదేరడం లేదంటే మన దురదృష్టం అనుకోవలె కాబోలు.

ఇక మీద త్వరలో ఆ జాతి చిత్రాలు తయారవుతవనే గాఢమైన నమ్మకముంది నాకు.

కాని ఒక్క విషయం జ్ఞాపకముంచుకోవాలి. నేను మొదటనే మనవి చేసినట్లు, వేళాకోళం వెక్కిరింతా ఉత్తమ హాస్యంగా ఎన్నటికి నిలువదు, వెక్కిరింత ప్రధానంతా తలపెట్టిన 'గేట్ డిక్టేటర్' లాటి చాప్లిన్ చిత్రానికే గతి లేకపోయింది.

హాస్యమంటే, జీవితం మీద ఒక రకం వ్యాఖ్యానమనీ, ఎటువంటి ఉదాత్త విషయాలైనా హాస్యరసంగా చెప్పవచ్చుననీ, దుఃఖమయమైన జీవితాన్ని ఆనందమయంగా చెయ్యడమే హాస్య రస ప్రయోజనమనీ తెలుసుకున్ననాడు, చక్కని చిత్రాలు తెలుగులో మట్టుకెందుకు తయారుకావు? తప్పక అవుతాయి.

'గుడ్‌బై మిస్టర్ చిప్స్' లో లాగ దుఃఖాశ్రువుల నానందబాష్పములతో మిళితం చెయ్యగలుగుతే 'మస్యూ దెర్డూ' లోలాగ జీవితాన్ని వ్యాఖ్యానించ గలుగుతే, 'బాచిలర్,' 'మదర్,' 'ఇట్ హాపెన్డ్‌వన్ నైట్' లా, ఊరికే మన్ని నవ్వించి, మన్ని మనం మరచేటట్టు చెయ్యగలుగుతే, ఏ చిత్రమైతేనేమి ఏ దేశమైతేనేమి ఎందుకు విజయవంతం కాదు? ■

ఎడిటర్స్ నోట్: ఈ వ్యాసం వ్రాసిన గత అర్ధశతాబ్దిలో చాలా పరిణామాలు సంభవించాయి. శాస్త్రిగారు అభిలషించినట్లే 80 లనాటి నుండి రాజేంద్రప్రసాద్ మార్కు పూర్తి హాస్య చిత్రాలు వచ్చాయి. 'అప్పడాలకర్ర' మార్కు ద్వందర్థాల హాస్యం వెనుకబడి 'రేలంగి' తరహా ఆహ్లాదకరమైన హాస్యం ఆంధ్రులకందింది. ఆయన వ్యాసంలో ప్రస్తావించనవారిలో హెచ్.ఎం.రెడ్డి గారు 'వద్దంటే డబ్బు' అనే చక్కటి హాస్య చిత్రం తీసారు. ఎన్. జగన్నాథ్ వేరే హాస్య చిత్రం ఏదీ తీయలేదు. భమిడిపాటి, హెచ్.ఎం.రెడ్డి గారి ఒక సినిమాకు (హాస్యం కాదు) పనిచేసి సినిమారంగానికి దూరమయిపోయారు. మునిమాణిక్యం సినిమాల జోలికి రాలేదు. శ్రీశ్రీ హాస్య గీతాలు కొన్ని రాశారు కానీ హాస్య చిత్రాలకు పనిచేయలేదు. కొడవటిగంటి కొన్నిటి చర్చలలో పాల్గొన్నారు గానీ హాస్య సినిమాలకు కథలనందివ్వలేదు. భానుమతి 'చక్రపాణి', 'వరుడుకావలెను', 'గృహలక్ష్మి' వంటి అనేక హాస్య చిత్రాలు నిర్మించి, నటించి శాస్త్రి గారికి ఆమె పట్ల ఉన్న అంచనాలను నిజం చేశారు.

సీరియల్ 12

# హాస్యవల్లరి సంగీతలహరి
# కిశోర్ జీవనఝరి



**- ఎమ్మెస్ స్వాతి**

'**బాప్** రే బాప్' (1955) సినిమా కిశోర్ సినీజీవితాన్ని ఓ మలుపు తిప్పింది. అప్పటిదాకా అతని వైఫల్యాలను చాప కిందకు నెట్టేసి సక్సెస్‌ఫుల్ హీరోగా నిలబెట్టింది. ఒక పెద్ద బ్యానర్ నుండి వచ్చిన బడ్జెట్ సినిమా అది. హీరోయిన్ చూడబోయినా చిన్నస్థాయి హీరోయినే! చాంద్ ఉస్మానీ. తక్కిన నటీనటులు కూడా స్మృతి



బిశ్వాస్, జయంత్, ఎస్.ఎన్. బెనర్జీ వగైరాలు. ఆ సినిమా తీసిన కర్దార్ కూడా హాస్య చిత్రాలకు పేరుబడ్డవాడు కాడు. కథలో హీరో డబ్బున్నవాడు. వాళ్ల నాన్న తెచ్చిన డబ్బున్న సంబంధాలన్నిటినీ చెడగొట్టడానికి శతథా ప్రయత్నిస్తాడు. కర్దార్ రాయించుకున్న స్క్రిప్టులో హాస్యానికి చాలా తక్కువ స్కోపుంది. కిశోర్‌కు అది అంతగా నచ్చలేదు. స్క్రిప్టు మార్చమనేవాడు. మార్పులు సూచించేవాడు. కిశోర్ తిక్కవేషాలు ఈ సినిమా నిర్మాణంలోనే బయటపడ్డాయి. డైరక్టరుతో వాదించేవాడు. ఆయన తన మాటను కాదంటే 'ఇక ఇవాళ నటించడం నా వల్లకాదు, మూడ్ లేదు.' అనేసేవాడు. మర్నాడు షూటింగ్ ఎగ్గొట్టేవాడు.

ఆ సినిమా నిర్మాత, దర్శకుడు తక్కువ వాడు కాడు. ఎ.ఆర్.కర్దార్ (1904-89) లాహోర్‌లోని జమీందారీ వంశానికి చెందినవాడు. పెయింటర్, ఫోటోగ్రాఫర్. 'కోహినూర్' అనే సినిమాలో పనిచేయడానికి 1922లో బొంబాయి వచ్చి కొన్ని సినిమాలలో నటించి డైరక్షన్ ఛాన్సులు రాక లాహోర్ మరలిపోయాడు. అక్కడ 'హీర్ రాంఝా' (1929) అనే సినిమా తీసి కలకత్తా వచ్చి ఈస్ట్ ఇండియా ఫిల్మ్ (1933-36) లో బొంబాయి వచ్చి రంజిత్ స్టూడియోలో డైరక్టరయ్యాడు. స్టూడియోను ప్రారంభించాడు. బాగ్‌బాన్ (1938), ఠోకర్ (1939), హోలీ (1940), స్వామీ (1941), సంజోగ్ (1943) షాజహాన్ (1946) దిల్లగీ, దులారీ (1949) దాస్తాన్ (1950) దిలే నాదాన్ (1953) వంటి సినిమాలు తీసి ఎంతో

**కిశోర్‌కుమార్ మొదటి వివాహం 1958లో ఫెయిలయింది. మధుబాలతో వివాహం కూడా ఎక్కువకాలం సాగలేదు. ఆ తర్వాత చాలా కాలం బ్రహ్మచారి జీవితమే! ఆ టైములో ఒక రిపోర్టరు అతన్ని ఇంటర్వ్యూ చేయడానికి వచ్చి 'పాపం మీది ఒంటరి జీవితం కదా, ఎలా బతుకుతాన్నారో ఏమో' అని నిట్టూర్చింది.**

**కిశోర్ ఆమెను తన బంగళాలో ఉన్న తోటలోకి తీసుకెళ్లాడు. "ఈ చెట్లు చూశారా. ఇవే నా ఫ్రెండ్స్. ఇదిగో ఈ చెట్టు పేరు జనార్దన్, ఇదిగో వీడు రఘునందన్, గంగాధర్, జగన్నాథ్, బుద్ధారామ్, ఈ బుజ్జిచెట్టు ఝుట్‌పట్, వీళ్లంతా నా ఫ్రెండ్స్. సాయంత్రం రాగానే మేమంతా కౌగిలించుకుని కబుర్లు చెప్పుకుంటాం' అన్నాడు.**

**ఆ రిపోర్టరు తెల్లబోయి పరిగెత్తుకుని పారిపోయింది.**

## కిశోర్ సరసన నటించిన కొందరు కథానాయికలు



బీనారాయ్ (మద్ భరేనైన్)



మీనాకుమారి(ఇల్‌జామ్, రుక్సానా, మేమ్‌సాహెబ్, నయాఅందాజ్, షరారత్)



మధుబాల(ఢాకేకే మల్‌మల్, చల్తీకానామ్‌గాడీ, మెహలోంకె ఖ్వాబ్, ఝుమ్రూ, హాఫ్‌టిక్కెట్)

ఓసారి ఓ గుజరాతీ ఇంటీరియర్ డెకరేటర్ కిశోర్‌ని వేధించి, వేధించి అతని బంగళాకు వచ్చాడు. మండుటెండలో దొరలఫ్యాషన్లో సూటు, బూటూ, టై వేసుకొచ్చి అమెరికన్ యాసలో మాట్లాడుతున్న అతన్ని చూసేసరికి కిశోర్‌కు చిర్రెత్తింది.

డ్రాయింగ్‌రూమ్ ఎలా డిజైన్‌చేయాలో లెక్షరివ్వబోతున్న అతన్ని ఆపి కిశోర్ 'నాకు కావలసినవి ఇవి' అంటూ చెప్పాడు-

-"డ్రాయింగ్ హాల్‌లో ఓ కొలనుండాలి. మధ్యలో సిమ్మెంటు దిమ్మలుండాలి. కొలనులో కప్పలు బెకబెకమంటూ వుండాలి. ఆ దిమ్మల మీద కాస్త గడ్డి మొలిచి వుండాలి. ఒక గట్టు నుండి మరో గట్టుకు పడవలో వెళ్లగలిగే వీలుండాలి. నీళ్లలో తేలే సోఫాలుండాలి. మధ్యలో మాత్రం టీపాయ్ ఫిక్స్‌డ్‌గా ఉండాలి. దానిమీద కాఫీ, టిఫిన్లుంటాయి. అవి అందుకోవాలంటే సోఫాల్లో ఉన్న అతిథులు చేతుల్తో తెడ్డు వేసుకుంటూ టీపాయ్‌కి వెళ్లాలన్నమాట, గోడకు ఓ చెట్టుకొమ్మ గుచ్చి, అది ఈ కొలను మీదకు వాలాలి. దాని మీద నిజం కోతి ఒకటి ఉండాలి. కాకి గూడు కూడా తప్పనిసరి సుమా..."

ఎంతోమందిని బోల్తా కొట్టించగలిగిన ఆ డిజైనర్ నోట తడి ఆరిపోతుండగా 'ఐడియా బాగుందండి. కొటేషన్ తయారు చేసి పంపిస్తా' అంటూ అదే పోత పోయాడు.



కీర్తిని మూటగట్టుకున్నాడు.

అటువంటివాడు కిశోర్‌తో వేగవలసివచ్చింది. క్రమంగా అతనూ గ్రహించేడు



- స్క్రిప్టుకు కట్టిపడేయకుండా తన మానాన తనను వదిలేస్తే కిశోర్ వంటి సృజనాత్మక నటుడు అద్భుత ఫలితాలను ఇవ్వగలడని. 'బాప్‌రే బాప్' సినిమా విజయానికి కిశోర్ విశృంఖల హాస్యనటన ఒక కారణమైతే ఓ.పి.నయ్యర్ సమకూర్చిన సంగీతం మరోకారణం. 'పియా, పియా పియా', 'దాల్ కైసే గలే' వంటి పాటలు బాగా హిట్ అయ్యాయి. నయ్యర్ అభిమాన గాయని ఆశాభోంస్లేలో పలికించిన చిలిపితనానికి, రొమాన్సుకి ఏ మాత్రం తీసిపోకుండా కిశోర్ పాడి చూపించాడు. సినిమా బ్రహ్మాండంగా హిట్ అయినా కర్దార్ కిశోర్‌ను కానీ, నయ్యర్‌ను కానీ రిపీట్ చేయలేదు! అదీ తమాషా!

బాక్స్ - 'బాప్ రే బాప్' లోని 'పియా పియా' పాట రికార్డింగ్ సమయంలో ఆశా పాడవలసిన చరణాన్ని ఆమె పాడబోతూండగా పొరబాటున కిశోర్ అందుకున్నాడు. అరెరే అనుకుని అది తీసేయబోతూంటే 'అది అలాగే వుంచండి, నేను తెర మీద చిన్న తమాషా చేస్తాను' అన్నాడు కిశోర్. అన్నట్టుగానే చాంద్ ఉస్మానీ పాట పాడబోతూండగా, ఆమె నోరు మూసేసి కిశోర్ అందుకుంటాడు. పద్ధతి ప్రకారం ఒకళ్ల తర్వాత ఒకళ్లు పాడేబదులు నిత్యజీవితంలో లాగే ఓవర్‌లాప్ అయింది, భలే ప్రయోగం' అనిపిస్తుంది చూసేవాళ్లకి. అదీ కిశోర్ ఒరిజినాలిటీ!

అలాగే సమయానికి కిశోర్ దొరక్క ఆశాభోంస్లే చేత పాడించారు ఓ పాట. 'ఏం నష్టంలేదు, నాకు ప్లేబ్యాకు ఆశా పాడుతుంది' అన్నాడు కిశోర్. 'అదెలా?' అన్నాడు డైరక్టరు. 'సింపుల్' అని కిశోర్ తెరమీద చీరకట్టుకుని కనబడ్డాడు. పడకగదిలో ఆడవాళ్లను వెక్కిరిస్తున్నట్టు చీర కట్టుకుని ఆశా గొంతుతో పాట పాడి భార్యను నవ్విస్తాడు కిశోర్!

'బాప్ రే బాప్' విడుదలయిన సంవత్సరం



లోనే వచ్చిన కిశోర్ సినిమాలలో చార్ పైసే (1955) (నిమ్మి, రూప్‌మాలా, ఆగా, జయంత్ వేశారు. నేషనల్ మూవీస్ కై ఎన్.కె.జీరీ డైరక్టు చేశారు. వి.జి.వర్మన్ సంగీతం), ఫార్చ్యూన్ ఫిలింస్ వారి 'మద్ భరే నైన్' (బీనారాయ్ హీరోయిన్‌గా

**కిశోర్ సరసన నటించిన కొందరు కథానాయికలు**



ముంతాజ్ (లడ్కా, లడ్కీ)



నూతన్

(చందన్, ఢిల్లీ కాథన్, కభీ అందేరా కభీ ఉజాలా)



వైజయంతీ మాల(లడ్కీ, మిస్‌మాలా, పెహలీ ఝలక్, ఆశా, రంగోలీ)



సాధనా(మన్‌మౌజీ)

నటించిన ఈ సినిమాకు సంగీతం ఎస్.డి.బర్మన్) 'రుక్సానా' (డైరక్షన్ ఆర్.సి.తల్వార్ మీనాకుమారి హీరోయిన్) ఉన్నాయి.

1956 కి వచ్చేసరికి కిశోర్ నటించిన చాలా సినిమాలు వెలువడ్డాయి. ఆబ్రూ, భాగంభాగ్, భాయ్ - భాయ్, ఢాకే కీ మల్‌మల్, మేమ్‌సాహిబ్, నయా అందాజ్, న్యూఢిల్లీ, పరివార్.

'భాగంభాగ్' భగవాన్‌తో కలిసి నటించిన సినిమా. 'భాయ్ భాయ్' ఏవిఎమ్ వారికై ఎంవీ రామన్ డైరక్టు చేసిన సినిమా. అశోక్‌కుమార్ దొంగగా నటించాడు. త్యాగమూర్తి పాత్ర కిశోర్ ది. మదన్‌మోహన్ సంగీతం ఇచ్చిన ఈ సినిమా సూపర్ హిట్ అయింది. కిశోర్ సీరియస్ నటన ఓ అవార్డుకై నామినేషన్ స్థాయి వరకు వెళ్లింది. ఈ సినిమాలో అతనికి ఒకే పాట - 'మేరా నామ్ అబ్దుల్లా' (లతాతో).

1956లో న్యూ ఢిల్లీ వంటి మెగాహిట్ నిచ్చింది మోహన్ సెహెగల్ దర్శకత్వంలో శంకర్ జైకిషన్ సంగీతం దర్శకత్వంలో వైజయంతిమాల హీరోయిన్‌గా సినిమా బ్రహ్మాండంగా ఆడింది. జాతి సమైక్యత వంటి బోరుకొట్టే థీమ్ అయినా కిశోర్ హుషారువల్ల ('నఖరేవాలీ', 'అరే భాయ్ నికల్ కే ఆ ఘర్‌సే' పాటలు గుర్తుండే వుంటాయి) సినిమాకు ఊపువచ్చింది.

ఇదే సంవత్సరంలో 'ఢాకే కా మల్ మల్, 'మేమ్ సాబ్'(మదన్‌మోహన్ మ్యూజిక్‌లో 'దిల్‌సే మిలాకర్ దేఖో' పాట బాగుంటుంది) అనే సినిమాలు కూడా వచ్చాయి.

1957లో ఇంకో సూపర్‌హిట్ 'ఆశా' డైరెక్షన్



ఎం.వి.రామన్, హీరోయిన్ వైజయంతిమాల, సంగీతం సి. రామచంద్ర, 'ఈనా మీనా డీకా' రాక్ ఎండ్ రోల్ పాట అప్పుడే కాదు, ఇప్పటికీ యాడ్స్ ద్వారా చిరంజీవిగా ఉంది. లతా పాడిన వెర్షన్ జనం మర్చిపోయినా కిశోర్ పాట మాత్రం జనాలకు మరపుకు రాకుండా ఉంది. స్టేజి షోలలో కూడా కిశోర్‌ని కోరి, కోరి ప్రజలు ఆ పాట పాడించుకునేవారు.

ఎం.వి.రామన్‌కు అప్పట్లో 'బాక్సాఫీసు విజర్డ్' అనేవారు. ప్రేక్షకులకు కావలసిన మసాలాన్నీ దట్టించడంతో ఘనుడాయన. ఓ హత్య, విలన్


**మార్కెట్లో ఉన్న కొత్త క్యాసెట్**




**విడుదల :హెచ్.ఎం.వి**

**వెల : రూ॥ 40/-**


ప్రాణ్ కిశోర్ దాంట్లో ఇరికించడం, కిశోర్, వైజయంతిమాల మారువేషాలు, సర్కస్- అన్ని రకాల హంగులూ కలిపి సినిమాను ఆడించాయి.

అదే సంవత్సరంలో విడదలయిన 'బందీ' వేరే రకం సినిమా, సత్యేన్ బోస్ (తర్వాత కిశోర్‌కి 'చల్తీ కా నామ్ గాడీ' డైరెక్టు చేసిపెట్టాడు) దర్శకత్వంలో అశోక్‌కుమార్, కిశోర్‌కుమార్, బీనారాయ్, శ్యామా నటించారు.

'బందీ' సినిమాలో కిశోర్‌ది పల్లెటూరివాడి వేషం. గ్రామీణ జీవితంపై తనకున్న ప్రేమ, హిందీ భాషపై తనకున్న పట్టు, దిలీప్ కుమారంత బాగా సీరియస్ పాత్ర వేయాలన్న కసీ అన్నీ కనబడ్డాయి ఈ సినిమాలో.

సాధారణంగా హిందీ సినిమాలలో వినబడే హిందీ ఏ ప్రాంతానికీ చెందినది కాదు. దేశంలో అన్ని ప్రాంతాల వాళ్లకీ ఎంతో కొంత అర్థమయ్యేలా తీయాలన్న తాపత్రయంతో అతి సింపుల్‌గానూ, అతి కృతకంగానూ సంభాషణలు రాయిస్తారు, పలికిస్తారు. పల్లెటూరును చూపించాలన్నా మరీ యాస పెట్టరు, తక్కిన రాష్ట్రాలవారికి అర్థంకాక ఆదరించరన్న భయంతో! హిందీ ప్రాంతపు గుండెకాయలాటి మధ్యప్రదేశ్‌లో పెరిగిన కిశోర్‌కి ఈ పద్ధతి నచ్చేది కాదు.

అందుకే 'బందీ'లో గ్రామీణుడి వేషం కట్టినప్పుడు అచ్చు మధ్యప్రదేశ్ పల్లెటూరివాడి లాగే జాతీయాలు ఉపయోగిస్తూ ప్రాంతపు భాష మాట్లాడాడు. సెంటిమెంటల్‌గా నటించడమే కాదు 'చుప్ హోజా అమీరోంకే సోనేకీ ఘడీహై/తేరే రోనే కేలియే ఉమర్ పడీహై' (డబ్బున్నవాళ్లు నిద్రపోయే వేళ ఇది, ఊరుకో, నువ్వు ఏడవడానికి జీవితమంతా ఉందిలే) అనే ఆర్ద్రమైన విషాదగీతం కూడా పాడాడు.

హాస్యనటనకు పేరువస్తున్నా తనను సీరియస్ నటుడిగా కూడా లోకం గుర్తించాలనే తపన కిశోర్‌కి ఉంది. 'దూర్‌గగన్..' వంటి సినిమాలు స్వంతంగా నిర్మించడంలోనే ఆ కోరిక వెల్లడయింది.

'బందీ' తో బాటు కిశోర్‌కి సీరియస్ నటన ప్రదర్శించేందుకు ఆ సంవత్సరమే ఇంకో అవకాశం వచ్చింది. అయితే 'బందీ'లోది పల్లెటూరి బీదవాడి పాత్రయితే 'ముసాఫిర్'లోది పట్టణ ప్రాంతపు నిరుద్యోగిది.

హృషికేశ్ ముఖర్జీ ప్రయోగాత్మకంగా తీసిన సినిమా 'ముసాఫిర్' దానిలో మూడు విడివిడి కథలుంటాయి. మూడింటికి లింకు ఒక గది. ఒకళ్ల తర్వాత మరొకరు ఆ గదిలో అద్దెకు ఉండడానికి వస్తారు. ఓ భగ్న ప్రేమికుడు పాత్ర దిలీప్‌కుమార్‌ది. ఉద్యోగాన్వేషణలో విసిగి, వేసారి విషం తాగితే



అది కల్తీదవడం వలన బతికి బాధపడే పాత్ర కిశోర్.

ఏ మాత్రం ఓవర్‌యాక్షన్ లేకుండా, అవధులు తెలిసి నటించడమే కాకుండా 'మున్నా బడా ప్యారా, మమ్మీకా దులారా' అనే పాట కూడా పాడాడు కిశోర్.

వీటితోబాటు అదే సంవత్సరంలో విడుదలయిన సినిమా 'బేగునాహ్' కిశోర్ ని నటనకు ప్రేరేపించిన సినిమా- 'నాక్ ఆన్ ది వుడ్' అనే క్రైమ్‌థ్రిల్లర్. ఆ సినిమాను హిందీలో 'బేగునాహ్'గా పునర్మించారు. కిశోర్ డేనీకేయేను అనుకరిస్తూ నటించాడ ం చేశారని ఆంగ్ల చిత్ర నిర్మాతలు ఫిర్యాదు చేయడంతో సినిమాను 'బ్యాన్' చేశారు.

1958లో కిశోర్ మరిన్ని విజయాలు చవిచూసాడు. 'ఢిల్లీ కా ఠగ్' వీటిలో ఒకటి. నూతన్ (స్విమింగ్ డ్రస్‌లో కనబడి అదరగొట్టింది) హీరోయిన్. ఎస్.డి.నారంగ్ దర్శకుడు. సంగీతం రవి. 'జూతా పాలిష్ కరేగా, ఫిర్ భీ తుమ్ పర్ మరేగా, చాహే జో భీ దునియా కహే, హమ్‌తో



మొహబ్బత్ కరేగా'(చరణంలో స్పానిష్ బీట్ నుండి తీసుకున్నారట) సి.ఎ.టి కాట్, కాట్ మానే బిల్లీ, ఆర్.ఏ.టీ. రేట్, రేట్ మానే చూహా, అరే దిల్ హై తేరే పంజేమేక్యా హువా' పాటలు మంచి హుషారైన పాటలు. వాటికి తోడు కిశోర్ మారు వేషాలు!

నూతన్‌తో కిశోర్ అదే సంవత్సరంలో ఇంకో రెండు సినిమాలు వేశాడు. 'చందన్', 'కభీ అంధేరా, కభీ ఉజాలా'(ఒ.పి.నయ్యార్ సంగీతం, 'సుర్మాబడానిరాలా ఆంఖోంకా ఉజాలా' పాట బాగుంటుంది, నూతన్ కానీ, వైజయంతిమాల కానీ ఎవరితోనైనా కిశోర్ సత్సంబంధాలే మేన్‌టైన్ చేసేవాడు. సీన్ గురించి సహ నటీనటులతో చర్చించడం, ఇంప్రొవైజ్ చేయడం అతని అలవాటు.

1958లోనే 'రాగిణి' సినిమా రిలీజయింది. నిర్మాత అశోక్‌కుమార్, దర్శకుడు రఖాన్, సంగీతం ఓ.పి.నయ్యార్. అశోక్‌కుమార్, కిశోర్‌కుమార్‌లతో పద్మిని, జబీన్ వేశారు. కిశోర్, ఆశా డ్యూయెట్ 'మై బెంగాలీ చోక్‌రా కరూఁ ప్యార్ కో నమస్కారమ్ - మై మదరాసీ ఛోక్‌రీ ముఝే తుమ్ సే ప్యారమ్' తమాషాగా ఉంటుంది. సినిమా అశోక్‌కుమార్ మీదే నడుస్తుంది. ఇద్దరు హీరోయిన్లూ అతన్నే ప్రేమిస్తారు. కిశోర్‌ది ప్రాధాన్యంలేని పాత్ర. సినిమా ప్రజలను మెప్పించలేక ఫేలయింది.

1959లో 'షరారత్' రిలీజయింది. మీనాకుమారి హీరోయిన్. సగందాకా కిశోర్ హడావుడితో నడుస్తుంది. ఇంటర్వెల్ తర్వాత సీరియస్ అయిపోతుంది. తనతో పెళ్లి

**మార్కెట్లో ఉన్న కొత్త క్యాసెట్**




**విడుదల : హెచ్.ఎం.వి**

**వెల : రూ॥ 40/-**

**పల్లెటూరి కిశోర్**

ఓసారి కిశోర్ తన మిత్రులతో పిచ్చాపాటి మాట్లాడుతూ బి.ఆర్.చోప్డా తనకెప్పుడూ పాడే అవకాశం ఇవ్వలేదని అన్నాడు. ఈ వ్యాఖ్య చోప్డాకు చేరింది. తను తీస్తున్న సినిమాలో ఓ పాట కిశోర్‌ను పాడమందామనుకుని ఓ మధ్యవర్తిని పంపాడు.

"తప్పకుండా పాడతాను. కానీ ఓ షరతు. ఆ చోప్డా స్వయంగా వచ్చి అడిగితే పాడతాను" అన్నాడు కిశోర్.

"దానికేముంది?" అన్నాడు దూత.

"అబ్బే, పూర్తిగా వినండి. ఆయన పంచి కట్టుకుని, దానిమీద చొక్కా, కోటు వేసుకుని, నోట్లో తాంబూలం కుక్కుకుని ఫక్తు పల్లెటూరివాడి వేషంలో రావాలి" అన్నాడు కిశోర్.

చోప్డా ఎప్పుడూ ప్యాంటు, షర్టుతో ఉంటాడేమోనన్న కోపమేమో కిశోర్‌కి!

కిశోర్ షరతు వినగానే చోప్డా మండిపడ్డాడు. ఆ పాట మహేంద్రకపూర్‌కి ఇచ్చాడు. అదే 'చలో ఇక్ బార్ ఫిర్' - గుమ్రా (1963) సినిమాలోనిది.

# కిశోర్ గీతావళి

చిత్రం: బాప్‌రే బాప్ రచన : జాన్ నిస్సార్ అఖ్తర్
సంగీతం : ఓ.పి.నయ్యర్ గానం : కిశోర్‌కుమార్, ఆశాభోంస్లే అభినయం: కిశోర్‌కుమార్, చాంద్‌ఉస్మానీ

పియా పియా పియా ॥2॥
మెరా జియా పుకారే
హమ్ భి చలేంగే సఁయ్యా సంగ్ తుమ్హారే ॥2॥
చోరీ చోరీ చోరీ ॥2॥
కాహే హమే పుకారే
తుమ్ తొ బసీ హో గోరి మన్ మె హమారే ॥2॥ ॥పియా॥
ఏ చిప్ చిప్ హమ్‌సే చలే హే కహా సఁయ్యా
మై లాగే తెరె పయ్యా న ఛోడో మురీ బఁయ్యా ॥ఏ చిప్॥
ఏ ఛబ్ మత్‌వాలీ ఏ ముఖ్ గోరాగోరా
న దేఖొ దేఖొ ఐసే జియా డోలె మొరా ॥ఏ ఛబ్॥
ఆ...ఖులే భాలీ నైనా మెరీ జానే క్యా ఇశారీ
తుమ్ తొ బసీ హో గోరి మన్ మె హమారె ॥2॥ ॥పియా॥
మై పియా తెరీ ఛాయా మై సంగ్‌సంగ్ డోలూఁ
తూ జాయి జహా సయ్యా మైసాత్ తేరీ హోలూఁ
ఏ ఋత్‌మన్ భాటీ కె దిన్ మధ్‌మాతే
వొ దెఖొగోరీ హమ్ తుమ్ చలేహై హస్తే గాతే ॥ఏ ఋత్॥
మెరీ పియా ఝుమే జియా ఝురా నజరే
తుమ్ తొ బసీహో గోరి మన్ మె హమారీ ॥పియా॥







జరగలేదన్న బాధతో ఆత్మహత్య చేసుకున్న ప్రియుడు(మొదటి కిశోర్) పోలికలతోనే మరిది (రెండవ కిశోర్) అత్తింట కనబడటంతో ఖంగుతింటుంది మీనాకుమారి. వదినా మరదుల మధ్య సంబంధం ఉందని అనుమానిస్తాడు ఆమె భర్త రాజ్‌కుమార్. సినిమాను ఎలా 'బ్రాండ్' చేయాలో తెలీక ప్రేక్షకులు తిరస్కరించారు. 'హమ్ మత్ వాలే నౌజవాన్' అనే కిశోర్ పాట (శంకర్-జైకిషన్ సంగీతం) చాలా హిట్ అయింది.

'జాల్‌జాజ్' అదే సంవత్సరంలో విడుదలయి ఓ మాదిరిగా ఆడింది. అరవిందసేన్ డైరక్టరు. సంగీతం ఎన్.దత్తా. మాలాసిన్హా, ప్రాణ్, నాజిర్ హుస్సేన్ ఇతర తారాగణం. లతాతో కలిసి కిశోర్ పాడిన 'ప్యార్ కా జహాఁహో, ఛోటాసా మకాన్ హో' పాట సినిమాకు హైలైట్. ఇంగ్లీషు నృత్య శైలిలో ఉంటుంది. ఈ సినిమాలో మూడోవంతు దాకా కిశోర్ కామెడీ చేశాడు. తరువాత విలన్ ప్రోద్బలం వల్ల ఓ ముసలి దంపతుల తప్పిపోయిన కొడుకుగా సెంటిమెంటల్ పాత్ర పోషించాడు.

ఓమ్ ప్రకాష్ తన దర్శకత్వంలో నిర్మించిన 'చాచా జిందాబాద్' కూడా 1959 రిలీజే. అనితా గుహ హీరోయిన్. మంచి సరదా సినిమా. మదన్ మోహన్ సంగీతంలో లతా పాటలు బాగుంటాయి. సినిమా విజయవంతమైంది.

'న్యూఢిల్లీ'ఫేమ్ మోహన్ సెహగల్ తీసిన 'అప్‌నా హాథ్ జగన్నాథ్'(1959) బాగానే ఆడింది. సంగీతం ఎస్.డి.బర్మన్(పెర్మిట్,పెర్మిట్,పెర్మిట్, పెర్మిట్ కేలియే మర్‌మిట్ పాట గుర్తుందా?) తారాగణం కిశోర్, సయీదాఖాన్, లీలాచిట్నీస్, నజీర్‌హుస్సేన్.

50 దశకం ఉత్తరార్థం నుండీ నటుడిగా కిశోర్ ప్రభ వెలిగిపోతూండగానే 'లోకోఛురీ','చల్తీకా నామ్ గాడీ'ల నిర్మాతగా డబ్బు కూడా బోల్డంత వచ్చివడింది. డబ్బుతోబాటు చిక్కులూ వచ్చిపడ్డాయి.

**(సశేషం)**

(గమనిక - ఈ సీరియల్ 4 వ భాగంలో 'చల్తీ కా నామ్ గాడీ' దర్శకుడు నితిన్‌బోస్ అని పొరబాటుగా పడింది. దాని దర్శకుడు సత్యేన్ బోస్.)

**మార్కెట్లో ఉన్న కొత్త క్యాసెట్**




**విడుదల :హెచ్.ఎం.వి**

**వెల : రూ॥ 40/-**

**ప్రకాశం జిల్లాలోని నాగరత్నమ్మ సంగీత విద్యాలయం మొదటి వార్షికోత్సవ సందర్భంగా రాష్ట్రస్థాయిలో నిర్వహించిన పోటీలో విజేత వివరాలు**

**కర్నాటక శాస్త్రీయ సంగీత విభాగం:**

1. మల్లాది స్వాతి 2. ఆర్.వి.రాగమతి
3. డి.రవికాంత్ కన్సొలేషన్ - ఎన్.సి.కళ్యాణ్, డి.ప్రమీల.

**లలిత సంగీత విభాగం:**

1. ఎన్.పి.పద్మశ్రీ త్యాగరాజు
2. కె. జ్యోతిర్మయి 3. పవన్
కన్సొలేషన్ - ఎం. మాదవి, టి.గాయత్రి

బహుమతి ప్రదాన సభలో పాల్గొన్న జిల్లా కలక్టరు కరికాల వళవన్ మాట్లా మాట్లాడుతూ త్యాగరాజుస్వామి పూర్వీకుల నివాస స్థలమైన ప్రకాశం జిల్లా కాకర్లలోను, శ్యామశాస్త్రి పూర్వీకుల జన్మస్థానం అయిన కంభలోనూ వారి జ్ఞాపకార్థం స్మృతిచిహ్నాలను నిర్మించ తలపెట్టినట్లు తెలిపారు.



శ్రీ మట్టుపల్లి ప్రభాకరరావు
సంగీత విద్యాలయం
కరస్పాండెంట్



శ్రీ ప్రభాకర్ ఆర్థిక సహాయంతో
నిర్మితమైన ఆడిటోరియం



నిర్వాహకులు;
కళాసాగర్ వ్యవస్థాపక
కార్యదర్శి శ్రీ పి.వి.
ఎస్.ఆర్. అంజనేయులు

**SUBSCRIPTION/RENEWAL COUPON**

Name :...................................................................... Age: ...................... Profession......................

Address:..............................................................................................................................

............................Ph. No. ................ (O) ....................... (R) email:..........................................

I am enclosing DD/Cheque/M.O. Receipt No........................ Dated ......................... for Rs. 200/- (225/- in case of outstation cheques)favouring HUMMUS INFOWAY (P) Ltd., **payable at HYDERABAD** for Subscription/Renewal (incl. Postal Charges) of 24 issues of 'HAASAM HAASYA SANGEETHA PATHRIKA' starting from Issue No......(................ month, 2003)

Date: Signature

Mail to: HUMMUS INFOWAY (P) LTD., 502, SRI BALAJI NILAYAM, 13-1-212, BSP COLONY, MOTINAGAR, HYDERABAD - 500 018. Ph: 2383 1388 / 5557 0215, email: haasammag@hotmail.com

Note: If chq/DD is not drawn on Hyderabd Add Rs. 25/- towards collection charges

## అర్థం చేసుకుందాం ఆస్వాదిద్దాం

చిత్రం : దేఖ్ కబీరా రోయా (1957)
రచన : రాజేంద్ర కిషన్
సంగీతం : మదన్ మోహన్
గానం : మన్నాదే
అభినయం : అనూప్‌కుమార్, అమితాగుహ



# కౌన్ ఆయా ...

కౌన్ ఆయా మేరే మన్ కే ద్వారే
పాయల్ కీ ఝున్‌కార్ లియే ॥కౌన్ ఆయా॥

ఆంఖ్ న జానే, దిల్ పహచానే సూరతియా కుఛ్ ఐసీ (2)
యాద్ కరూంతో యాద్ న ఆయే మూరతియా యే కైసీ
పాగల్ మన్‌వా సోచ్ మేం డూబా
సప్‌నోం కా సంసార్ లియే ॥కౌన్ ఆయా॥

ఇక్‌పల్ సోచూం మేరీ ఆశా రూప్ బదల్‌కర్ ఆయీ (2)
దూజే పల్ ఫిర్ ధ్యాన్ యే ఆయే హో న కహీం పర్‌ఛాయీ
జో పర్‌దేసీ కే ఘర్ ఆయీ
ఏక్ అనోఖా ప్యార్ లియే ॥కౌన్ ఆయా॥



మదన్‌మోహన్ పాత తరం సంగీత దర్శకుడే. 50వ దశకంలో చిత్రరంగ ప్రవేశం చేశారు. కానీ ఆయన సంగీతం నానాటికీ మరింత కమ్మదనం సంతరించుకుందే కానీ పాతబడలేదు. ఫిల్మీ గజల్ అనే ప్రక్రియను ఆయనే మొదలుపెట్టారంటే అతిశయోక్తి కాదు. కానీ ఆయన కేవలం గజల్స్ బాగా చేస్తారంటే ఎవరూ ఒప్పుకోరు. ప్రేమగీతాలు, భక్తి గీతాలు, దేశభక్తి గీతాలు, జానపదగీతాలు... ఇలా అన్ని రకాల గీతాలూ రూపొందించారాయన. 'మేరాసాయా', 'వో కౌన్ థీ', 'హకీకత్', 'లైలామజ్నూ', 'అన్‌పఢ్', 'దస్తక్', 'మౌసమ్', 'హీర్ రాంఝా' చిత్రాలలో ఆయన అందించిన సంగీతం సంగీత ప్రియులను నేటికి ఓలలాడిస్తూనే ఉంది. కానీ ఆయన జీవితకాలంలో ఆయనకు గుర్తింపు రాలేదు. ఆయనకు ఒక్క ఫిలింఫేర్ అవార్డు కూడా రాలేదంటే ఆశ్చర్యం కలగకమానదు. 1971లో 'దస్తక్' చిత్రానికి నేషనల్ అవార్డు వచ్చింది. ఆయన అభిమాన గాయని లతా మంగేష్కర్ అయినా ఇతర గాయనీ గాయకుల చేత కూడా చక్కని పాటలు పాడించారు. అటువంటి పాటలలో ఒకటి మన్నాదే కెరియర్‌లో కలికితురాయిగా నిలిచిన 'కౌన్ ఆయా మేరే మన్‌కే ద్వారే'.

మన్నాదేకు చిన్నప్పటి నుంచి సంగీతంపై గల ఆసక్తిని గమనించి ఆయన తండ్రి సంగీతాన్ని క్షుణ్ణంగా అధ్యయనం చేయమని ప్రోత్సహించారు. అప్పటి నుంచి సంగీతమే ప్రపంచం అయింది మన్నాదేకు. తన బంధువు కె.సి.దే వద్ద సంగీతం నేర్చుకుని పదకొండేళ్ళ వయసులోనే కె.సి.దే సంగీతంలో సురయ్యాతో 'తమన్నా' చిత్రంలో యుగళగీతం పాడారు. బెంగాల్ నుంచి బొంబాయి వచ్చి ఎన్నో ఒడిదుడుకులు ఎదుర్కొని హిందీ బాగా నేర్చుకుని ఎన్నో మధురమైన పాటలు పాడారు. పాట నొటేషన్స్ అన్నీ రాసుకుని రిహార్సల్ చేసి పాడతారాయన. క్లిష్టమైన పాటలు ఉంటే మన్నాదే వద్దకు వెళ్ళేవారు సంగీత దర్శకులు. మారిన పరిస్థితులు, అభిరుచుల కారణంగా చిత్ర పరిశ్రమకు దూరంగా ఉంటున్న మన్నాదే పాడిన చివరి హిందీ చిత్రం నానా పాటేకర్ తీసిన 'ప్రహార్' (1991).

'దేఖ్ కబీరా రోయా' పేరు గంభీరంగా అనిపించినా హాస్య చిత్రం. 'చేతికి చిక్కిన దానితో లోకులు తృప్తిపడరు. దొరకని దానికై అర్రులు చాస్తారు. వీళ్ల అవస్థలు చూసి కబీరు ఏడుస్తున్నాడు' అని కబీరు రాసుకున్న గేయం థీమ్‌తో సినిమా తయారయింది. ముగ్గురు స్నేహితురాళ్లుంటారు. వాళ్లకు ముగ్గురు అబ్బాయిలు పరిచయమవుతారు కానీ వారి వారి ఇష్టాలు 'మ్యాచ్' కావు. సంగీతం అంటే ఇష్టం లేని హీరోయిన్‌ను గాయకుడైన అనూప్‌కుమార్ ఇష్టపడి ఈ పాట పాడి మెప్పిద్దామని ప్రయత్నిస్తాడు. కానీ





ఆమెకు చిత్రలేఖనం అంటే ఇష్టం. (చిత్రకారుడైన అబ్బాయికి మరో అమ్మాయి అంటే ఇష్టం). అందుకే అనూప్ ఇంత చక్కగా పాడినా బోరు ఫీలయి పడి నిద్రపోతుంది. అదీ సన్నివేశం. గంభీరమైన పాటను ఓ హాస్య సన్నివేశానికి వాడుకోవడం సాహసమే!

'దేఖ్ కబీరా రోయా' చిత్రం ఫ్లాప్ అయినా అందులోని పాటలు క్లాసిక్స్‌గా నిలిచి పోయాయి. తలత్ మెహమూద్ పాడిన 'హమ్‌సే ఆయా న గయా', లతా పాడిన 'మేరీ వీణా తుమ్ బిన్ రోయే', మన్నాదే పాడిన 'కౌన్ ఆయా మేరే మన్ కే ద్వారే' పాటలు ఇప్పటికీ సంగీత ప్రియులను అలరిస్తూనే ఉన్నాయి. 'కౌన్ ఆయా మేరే మన్ కే ద్వారే' పాటను అనూప్ కుమార్ (కిశోర్ కుమార్ సోదరుడు)పై చిత్రీకరించారు.

'కౌన్ ఆయా' అంటే 'ఎవరు వచ్చారు' అని. 'మన్‌కే ద్వారే' అంటే 'మదిలోకి' అని. పాయల్ అంటే అందెలు. ఝున్‌కార్ అంటే ఝుణఝుణ శబ్దం.

**'వచ్చేదెవరో నా మదిలోకి**
**అందెల సవ్వడి మోసుకొని'**

అందెల సవ్వడి గుండె తలుపుతట్టి అతనిలో ప్రేమ పుట్టించింది. తనకు తెలియకుండానే తన మనసును అర్పించేశాడతను. తన మనసు దోచిన వారెవరో అని మైమరచి పాడుతున్నాడు.

'ఆంఖ్' అంటే కన్ను. 'పహ్‌చాన్‌నా' అంటే గుర్తు పట్టటం. సూరతియా అనేది సూరత్‌కు మరో రూపం. సూరత్ అంటే ముఖం. యాద్ అంటే గుర్తు. మూరతియా అంటే మూరత్. మూరత్ అంటే స్వరూపం. మన్‌వా అన్నా, మన్ అన్నా ఒకటే. పాగల్ అంటే పిచ్చిది. సప్‌నోం కా సంసార్ అంటే స్వప్నలోకం.

**'కంటికి తెలియదు, మనసుకు ఎరుకే ఆ మోము**
**ఎంత తరచినా గుర్తే రాదు ఆ స్వరూపము**
**పిచ్చి మనసు ఊహలలో తేలెను**
**స్వప్నలోకం చేరుకొని'**

కంటితో చూడకపోయినా మనసులో ముద్రించుకుపోయి ఉంటుంది ప్రేయసి మోము. కానీ గుర్తు చేసుకుందామంటే గుర్తేరాదు. మనసుకు మాత్రమే తెలిసిన రూపమది. అందుకే మనసుని పిచ్చిది అంటున్నాడు. స్వప్నలోకం చేరుకుని ఊహలలో తేలియాడుతోంది అతని మనసు.

'పల్' అంటే క్షణం. 'పర్‌ఛాయీ' అంటే నీడ. 'అనోఖా ప్యార్' అంటే కొత్త ప్రేమ, ఇంతవరకు ఎవరికీ అనుభవంలోకి రాని ప్రేమ.

**'నా ఆశే వేరొక రూపాన వచ్చిందనిపించేనొకసారి**
**నీడ కాదు కదా అనిపించే మరుసారి**
**పరదేశి ఇంటికి వచ్చెను**
**ఓ కొత్త ప్రేమను మోసుకొని'**

తన ఆశే మరో రూపం దాల్చి వచ్చిందా అనిపిస్తుంది ఒకసారి. మరుక్షణం అది నీదేనేమో అనిపిస్తుంది. అది నీడే అయినా ఓ కొత్త ప్రేమను మోసుకొని పరదేశి ఇంటికి వచ్చిందని అంటున్నాడతను. అది తన ఆశయినా, ఊహయినా అతనికి కొత్త ప్రేమను చవి చూపించింది.

**- పి.వి.సత్యనారాయణ రాజు**



## ఇది యస్పీబాల సుబ్రహ్మణ్యం సమర్పిస్తున్న శీర్షిక

**మీకు తెలుగు ఎంత బాగా తెలుసో, మీ పదసంపద ఎటువంటిదో బేరీజు వేసుకోవడానికి ఉద్గ్రంథాల దాకా పోనక్కరలేదు. ఈ సంచికలో కనబడే సినిమాపాటలలోని మాటలతో కూర్చిన ఈ శీర్షికలో సరైన అర్థం అనుకున్న మాటపై టిక్కుపెట్టి బాలూ గారిచ్చిన సమాధానాలతో సరిచూసుకోండి.**

1. నులి(శాంతి నిలయం...దేవీ క్షేమమా)
ఎ) మొదటి బి) కొద్దిపాటి
సి) కొత్త డి) ఆవిరి

2. మంజీరము(సిరివెన్నెల...చందమామ)
ఎ) నది బి) అందె
సి) పారాణి డి) ధ్వని

3. పెన్నిధి (మాతృదేవత...మానవజాతి)
ఎ) గని బి) పెద్దపాతర
సి) సముద్రము డి) పెద్దదిక్కు

4. కలకంఠి(మాతృదేవత...మానవజాతి)
ఎ) రోదించుస్త్రీ బి) నెమలి
సి) చక్కనికంఠధ్వనిగలది
డి) పటికబెల్లము

5. శుభగాత్రి(గంగోత్రి...జీవనవాహినీ)
ఎ) శుభములనిచ్చునది
బి) గాయకురాలు
సి) సుడిగుండము
డి) చక్కటి శరీరముకలది

6. విరజము(గంగోత్రి...జీవనవాహినీ)
ఎ) దుమ్ములేనిది బి) పువ్వు
సి) వేగముగాపోవునది డి) చీలినది

7. దాత్రి( గంగోత్రి...జీవనవాహినీ)
ఎ) ఇచ్చునది బి) భూమి
సి) రాశి డి) భరించునది

8. తారాడు(పెళ్లిసందడి...నవమన్మథుడా)
ఎ) ప్రాకు బి) నక్షత్రములతో ఆడు
సి) అటుఇటుతిరుగు డి) ఆటలాడు

9. అభ్రము(పెళ్లిసందడి...నవమన్మథుడా)
ఎ) నక్షత్రము బి) ఆకాశము
సి) మేఘము డి) మెరుపు

10. మిటారి (ఆలీబాబా 40 దొంగలు...చినదాన)
ఎ) కత్తిగలది బి) విలాసవతి
సి) మృదుభాషిణి డి)నాట్యకత్తె

### జవాబులు

1) b) 2) b 3) b
4) c 5) d 6) a
7) a 8) c 9) c
10) b

# శ్రీవారి సంగీత సాధన

**- వి.యస్.లక్ష్మీరావు**



"మహాగణపతిం మనసాస్మరామి
వశిష్ఠవామదేవాది సన్నుత'

'ఈ కీర్తన రాసిందెవరో తెలుసా?' అన్నారు మావారు.

'మహాగణపతిం - నాటరాగం - ఆదితాళం - ముత్తుస్వామి దీక్షితర్ కీర్తన' అన్నాను రేడియో అనౌన్స్‌మెంట్ అనుకరిస్తూ.

అది విన్న మా వారు 'సంగీతం తెలిసిన దానివి. అంత టూకీగా చెప్తే ఎలా? ముత్తుస్వామి దీక్షితుల వారు సంగీత త్రిమూర్తులలో ఒకరు. ఆయన బహుముఖ ప్రజ్ఞాశాలి. తిరువారూరులో జన్మించారు. ఆయన కవిత్వం నారికేళ పాకం' అన్నారు.

మధ్యలో అడ్డుపడుతూ, 'అయ్యా! మీరు లెక్చరర్ కదా అని, అన్ని విషయాల గురించీ ఉపన్యాసం ఇవ్వక్కరలేదు. కొన్ని నా బోటి అల్పజ్ఞులకి కూడ వదిలిపెట్టవచ్చు. ఇంతకీ మీ ఉపన్యాసం ఎవరిని ఉద్దేశించి?' అన్నాను.

'నిన్నే!' అన్నారు గొప్పగా మొహం పెట్టి!

'అలాగా! బాగానే ఉంది. ఇంకా నాకు తెలియనివీ, మీకు మాత్రమే తెలిసినవి నిగూఢ సంగీత రహస్యాలు సెలవిస్తారా!' అన్నాను పరిహాసంగా,

'ఆ! ఎందుకు చెప్పనూ! సంగీతం అంటే సప్త స్వరాలు మాత్రమే కాదు. ఇరవై రెండున్నాయి. అవి అన్నీ ఉన్న రాగమేదైనా సాధన చేస్తే మంచి స్టాండర్డ్‌గా ఉంటుంది.'అన్నారు.

'ఆ ఇరవై రెండు శ్రుతులూ ఉన్న రాగం పాడితే ధ్వని కాలుష్యం అనుకుని కేస్ పెడతారు. వివాది స్వరాలలో చెవులు పగిలిపోతాయి. మరీ అంత శాస్త్రోక్తంగా కాకుండా శ్రావ్యత కూడా చూసుకోవాలి' అన్నాను.

ఈ మధ్య తరచుగా మాకు ఈ విధమైన వాదప్రతివాదాలొస్తున్నాయి. దానికి ప్రధాన కారణం మావారి సంగీత సాధనే!

మొదటి నుంచి మా వారికి లలిత కళలంటే అభిమానం. అన్నింటిలో కొద్దోగొప్పో వేలుపెట్టి 'కాలర్' ఎగరవేయాలని ఆయన తాపత్రయం.

ఇక సంగీతాన్ని వదులుతారా? ఓ పట్టు పట్టాలని శ్రీవారి పట్టుదల. వినికిడి పట్టి నాటకం పద్యాలు అప్పుడప్పుడు పాడతారు. అవి విని ఎవరైనా 'మీకు సంగీతం వచ్చా?' అని ప్రశ్నిస్తే భుజాలెగరేస్తూ నాకేసి చూసి 'చూసావా! నా ప్రతిభ నీకే తెలియడం లేదు' అంటారొకప్పుడు.

కొన్ని సార్లు విపరీతంగా నిరుత్సాహపడుతూ, అర్జునుడిలా అస్త్రశస్త్రాలు వదిలినట్లు డీలాగా "అయ్యో! నా టాలెంట్‌కి తగిన ప్రోత్సాహం దొరకటం లేదు. నేనేమి పాడుతున్నానో ఆ రాగాలూ, తాళాలు ఏమి తెలియవు. ఒక రెండు మూడు నెలలు సంగీతం నేర్చుకొని, బాగా పాడాలి"అంటారు.

"వెంటనే రెండు మూడు నెలలలో వచ్చేయడానికి ఇదేమైనా మీ కారు డ్రైవింగా? సంవత్సరాల తరబడి నేర్చుకొనేవాళ్ళే ఒక స్థాయికి రావాలంటే చాలా కష్టపడాలి". అంటాను నేను.

'అవునులే! నీ కంటే మించిపోతానని నీకు అసూయ అందుకే నన్ను నిరుత్సాహపరుస్తావు' అంటారు మావారు హాస్యంగా అంటున్నట్టు.

ఇలా ఉండి, ఉండి ఒకరోజు 'నేను సంగీతం మొదలుపెడతాను' అని ప్రకటించారు శ్రీవారు.

'తథాస్తు' అన్నాను.

'గురువు లేక ఎటువంటి గుణికి తెలియదన్నారు. నా అంత తెలివైన వాడైనా గురువుని ఆశ్రయించవలసిందే కదా!' అనుకుంటూ, మా ఊరిలోని ప్రముఖ విద్వాంసు లొకరి వద్దకు వెళ్ళి తన కోరిక తెలిపారు.

ఆయన చాలా సంతోషించి, 'తప్పక నేర్చుకోండి! కాని, ఇంట్లోనే విద్య పెట్టుకుని ఊరంతా వెతుకుతారేమిటి? నేను ప్రోగ్రాంలకి వెళ్తూ ఉంటాను. రెగ్యులర్‌గా చెప్పడానికి నాకు తీరిక ఉండదు. మీ శ్రీమతి వద్దే నేర్చుకోవచ్చుగా!" అన్నారు.

ఇంక తప్పని సరైన అత్యవసర పరిస్థితులలో ఇంట్లోనే నేర్చుకోవాలని నిర్ణయించుకున్నారు.

ఒక మంచి రోజు చూసి, సంగీత పాఠం ప్రారంభించాలని 'గణపతి ప్రార్థనతో మొదలు పెడదాము' అన్నాను. 'అలాకాదు నాదోపాసన కదా! 'నాదతనుమనిశం'తో మొదలుపెట్టు' అని సలహా ఇచ్చారు శ్రీవారు తన శిష్యుడి పాత్ర మర్చిపోయి.

"ఫారిన్లో శిష్యుడు ఏం చెప్పమంటే గురువులు అదే చెప్తారట' అని నన్ను నేను ఓదార్చుకుని, "చాప మీద కూర్చొని, 'సాపాసా' అనండి" అన్నాను. శిష్యుడి పాత్రని మొగుడు పాత్ర డామినేట్ చేసినట్టున్నాడు - 'నేనెక్కడ కూర్చుంటే, నీకెందుకు? ఇక్కడి నుంచే అంటాను' అని, కుర్చీలోంచి కదలకుండా 'సాపాసా' అన్నారు.

'అలా వచనంలా కాదు, శ్రుతిలో అనండి'




అన్నాను. ఏదోలా అన్నారు. 'ఇంకా బాగా అనాలి' అన్నాను. 'నేను బాగానే అంటున్నాను. నువ్వే నా స్థాయికి తగినట్లు చెప్పలేకపోతున్నావు. సంగీతం రావడం వేరు, గురువుగా ఉండడం వేరు. అదిది అందరికీ రాదు.' అంటూ విసుక్కున్నారు మా వారు.

ఇంక చేసేదేముంది?భార్యని గురువుగా అంగీకరించడానికి పురుషాహంకారం అడ్డొస్తోంది కాబోలు! అనుకున్నాను.

పెరటికూర మందుకి పనికి రాదన్నట్లు ఇంట్లో విద్యాభ్యాసం సాగలేదు. ఆ సమయానికే పాలు, పని మనిషి, చుట్టాలు, స్నేహితులు ఎవరో ఒకరు రావడంతో అంతరాయం కలిగేది.

ఈ విధంగా విద్యాభ్యాసానికి 'ఆదిలోనే హంసపాదు' వచ్చింది.

'నా సంగీతానికి ఈ ఊరు సరిపోదు. అయినా పూర్వం కాలినడకని కాశీకి పోయి, విద్యాభ్యాసం చేసేవారు. కనీసం విజయవాడ వెళ్ళి నేర్చుకుంటాను. సీజన్ టిక్కెట్టు తీసుకుంటాను.'" అంటూ అక్కడికి అప్ అండ్ డౌన్ చేసి మొత్తం మీద ఆర్నెల్లకు ఏదో వర్ణాల వరకూ లాగారు.

ఎప్పటికప్పుడు తన స్థాయిని, గురువు సమర్థతని విశ్లేషించి, బేరీజు వేసుకుంటూ, కచేరీలు చేస్తున్నట్లు, కొత్త కొత్త పరిశోధనలు చేస్తున్నట్లు కలలు కనేవారు.

ఒకరోజు గాంధీజీ ఆత్మకథ 'సత్యంతో నా ప్రయోగాలు' అనే వ్యాసం చదివి 'సంగీతంతో నా ప్రయోగాలు' అనే ఆత్మకథకు ఉపక్రమించారు. రాగాలు కలిపి చూస్తే..? అన్న ప్రయోగానికి శ్రీకారం చుట్టారు. 'ఏదోలే! ఈ ధోరణి మామూలే కదా!' అని, నేను పెద్దగా పట్టించుకోలేదు.

ఆ రోజు ఉదయం నుంచీ ఆయన కనబడలేదు. నా పనుల్లో నేను మునిగి ఉంటూనే ఏమయ్యారు చెప్మా? అనుకుంటున్నాను.

కొంతసేపటికి బాత్‌రూమ్‌లోంచి భూపాలరాగం వినబడుతోంది. 'మేలుకోవయ్యా!' అంటూ రకరకాలుగా పాడి, రాములవార్ని నిద్ర పోనివ్వడం లేదు శ్రీవారు.

ఆ బాత్‌రూమ్‌లోనే వాష్ బేసిన్ అవీ ఉండడంతోనూ, ఇంటికి అదొక్కటే బాత్‌రూం అవడం చేతనూ క్రమంగా ఇంట్లో వాళ్ళొక్కొక్కరూ బ్రష్‌లు పట్టుకుని రేషన్‌షాపు ముందు నిలుచున్నట్లు బారులు తీరారు.

లోపల రాగాలాపన వింతపోకడలు పోతోంది.



ఇంకలాభం లేదనుకొని, తలుపు దగ్గరకెళ్ళి

"విన్నపాలు వినవలె వింత వింతలు
బాత్‌రూం తలుపు త్వరగా తీయలెనయ్యా"

అని నేను పాడుతుంటే, మిగిలినవారు కోరస్ కలిపారు.

దాంతో మా శ్రీవారి సాధనకు అవరోధం కలిగింది కాబోలు 'ధన్' మన్న చప్పుడుతో తలుపు తీస్తూ 'ఏమిటంత తొందర?' అని రుసరుసలాడారు.

ఆ వాలకం చూసి, మేం కాస్త వెనక్కు తగ్గాము.

'పూర్వకాలంలో చలికాలం పీకలోతు నీళ్ళలోనూ, వేసవిలో పంచాగ్ని మధ్యన నిలిచి, గమకాలు సాధన చేసి, మహా విద్వాంసులయ్యారు. ఇప్పుడు తలుపుకొట్టి తపోభంగం కలిగిస్తారా? శపిస్తాను!' అన్నారు విశ్వామిత్రుడి ఫక్కీలో!

'బాబూ! మీరు బాత్‌రూంలోకి వెళ్ళి మూడు గంటలయింది. అందరికీ దాని అవసరం ఉంటుందన్న విషయం మీరు కూడా గమనించాలి కదా! ఇంకా నయం, పీకలోతు మంచినీళ్ళ గుండిగలో కూర్చున్నారు కాదు!' అన్నాను నవ్వాపుకుంటూ!

"ఇలాకాదు! ఇక పుస్తకాలలో మునిగి సంగీత శాస్త్రాన్ని లోతుగా అధ్యయనం చేసి, మధిస్తాను" అంటూ లైబ్రరీ రూంలో దూరారు!

ఇంక లోపలి నుండి మేక అరుపులు, కోయిల కూతలు, ఎద్దురంకెలూ తారాస్థాయిలో వినబడసాగాయి.

'ఓహూ! షడ్జం మయూరో వదతి' అనే శ్లోకార్థ సాధన జరుగుతోంది కాబోలు! అనుకున్నాను.

మేము బాత్‌రూం ప్రహసనంలో ఉండగా పనిమనిషి వచ్చి ఏదో హడావిడిగా ఉన్నారని, చెప్పా పెట్టకుండా పని చెయ్యకుండా ఉడాయించింది. 'హతోస్మి' అనుకుని రంగంలోకి దిగి, ఆ పనంతా




పూర్తిచేసి, వంట ప్రారంభించాను.

"ఔడవ, షాడవ సంపూర్ణాలకి ఉదాహరణలు చెప్పు చూద్దాం. నా ప్రయోగాలకి కావాలి." వెనక నుండి శ్రీవారి గొంతుక సీరియస్‌గా వినిపించింది.

అపుడేమన్నా ముప్పే అనుకుని శాంతంగా సమాధానం చెప్పాను. కాని, అది ఆయనకి నచ్చలేదు!

'అలా రాగాల పేర్లు మాత్రమే చెప్పడం కాదు! వాటి మూర్ఛనలు పాడి వినిపించు!' అని, ఆర్డర్!

అవి పాడుతుండగా పప్పుమాడు వాసన వస్తోంది. పాలు పొంగిపోయాయి. వాటి పని చూస్తూ, మా వారి సందేహాలకి సమాధానాలు ఇచ్చేటప్పటికి నా తలప్రాణం తోకకి వచ్చింది. కాని, ఆ విసుగు కనబడనీయకుండా 'అర్థమయిందా?' అన్నాను.

'ఆ! ఇదేమి బ్రహ్మవిద్యా? ఆ మాత్రం సూచన ఇస్తే అల్లుకుపోతాను!' అంటూ తిరిగి గది ప్రవేశం చేశారు.

రెండు మూడు గంటలు గడిచాయి. గదిలోంచి ఊడిపడరు.

మా ఇంట్లో అందరూ కలిసి ఒకేసారి భోజనం చేయడం అలవాటు! అందువల్ల అందరూ ఉసూరుమంటూ నీరసంగా కూర్చున్నారు. పిలిస్తే ఏం ప్రమాదం ముంచుకొస్తుందో? అని,

వాళ్ళ అవస్థ చూస్తూ నేను ఇక లాభం లేదని ధైర్యం చేసి, సంగీతాహ్వానం పలికాను.

'సారమైనది దివ్యాన్నము
షడ్రసయుత భక్షణములు
(సరే ఏడవరసం మాడు పప్పనుకోండి)
ఆరగింపవే!' అని, పాడాను.

వెంటనే తలుపు తెరుచుకొని, మందస్మిత వదనారవిందులైన శ్రీవారు "నా రాగాల కిచిడీ కూడా ఆల్మోస్ట్ పూర్తయింది." అంటూ, బయటకు వచ్చి భోజనాని కుపక్రమించడంతో మా అందరికీ ఆరోజు అన్నప్రాశన జరిగింది!

భోజనం చేస్తూ ఆహిరి రాగం సాధన చేస్తున్నారా? అని, అమాయకంగా అడిగాను.

'ఏం? భోజనం ఆలస్యమైందని అడుగుతున్నావా? భోజనానికి ముందు ఆహిరి పాడితే ఆ రోజు అన్నం పుట్టదు అంటారుగా? అదెందుకు పాడతాను?" అన్నారు తెలివిగా.

ఎప్పుడు ఏ రాగప్రయోగం జరుగుతుందో అన్నట్లు ఆ రోజంతా ఇంట్లో అందరూ బిక్కుబిక్కుమని, టీవీ కూడా పెట్టుకోకుండా కూర్చున్నారు.

శ్రీవారు మాత్రం ఇదేమీ పట్టించుకోకుండా రాగాలు, లలిత శాస్త్రీయ భేదం లేకుండా కీర్తనలు తనకు తోచిన రాగతాళాలలో మార్చి మార్చి పాడుతూ ఊపిరాడకుండా, మిగిలిన వారికి ఆడనివ్వకుండా విజయవంతంగా ప్రయోగం పూర్తి చేశారు ఆరోజు.

మర్నాడు పేపరు చూస్తుండగా డోర్‌బెల్ మోగింది. కూనిరాగం తీసుకుంటూ, వెళ్ళి తలుపు తీశారు మా వారు. ఎదురుగా ఇరుగుపొరుగు ఫ్లాటుల వాళ్ళు. పరంధామయ్య గారు, శామ్యూల్ గారు, షేక్ హుస్సేన్ గారు పలకరింపుగా నవ్వుతూ, "గుడ్ మార్నింగ్ సార్" అన్నారు.

'రండి! రండి! ఏమిటి విశేషం?' సాదరంగా ఆహ్వానించారు మావారు.

కాస్త మౌనం తర్వాత హుస్సేన్ గారు గొంతు సవరించు కుంటూ, 'మనం అంతా ఒకే



కుటుంబంలా, ఎలాటి భేదాలు లేకుండా కష్ట సుఖాలు పంచుకుంటూ, చాలా సంవత్సరాలుగా ఇక్కడ ఉన్నాం..' అంటఏదో చెప్పబోయారు.

మా వారు ఉత్సాహంగా వెంటనే ' ఆ స్పిరిట్ సంగీతంలో కూడా కనబడాలనే హిందూస్తానీ, కర్ణాటక, వెస్టర్న్ - అన్నీ కలిపి, కలగలిపి ప్రయోగాలు చేస్తున్నాను. నిన్న.."

శామ్యూల్ గారు కాస్త దూకుడు. "..అది వినే వచ్చాం. మన ఫ్లాట్స్‌లో పరీక్షలు రాసే పిల్లలు, నిద్రపట్టని ఉబ్బసం రోగులు, ఇంట్లో ప్రశాంతంగా నిద్రపోదామనుకునే ఉద్యోగస్తులు ఉన్నారు కదా. మీరిలా వాయించేస్తే ఎలా?" అనేశాడు. మా వారి మొహం కందగడ్డలా అయింది. 'నా యిల్లు, నా యిష్టం' అని ఏదో అనోబోతూండడం చూసి పరంధామయ్య గారు లౌక్యంగా మాట మార్చేశాడు -

"ఉండవయ్యా శామ్యూలూ, సరిగ్గా చెప్పవేమిటి? అది కాదండీ రావుగారూ, మా సలహా ఏమిటంటే..మ్యూజిక్‌థెరపీ అని ఒకటి యూనివర్శిటీలో పెడుతున్నారట. ఏ రాగాలాపన రోగాన్ని పెంచుతుందో, ఏది తగ్గిస్తుందో పరిశోధనలు చేస్తారట. అప్పటికప్పుడు మనిషికి ఉద్రిక్తత పెంచి, రోగగ్రస్తుడిని చేయగల సామర్థ్యం మీలో నిన్న మాకు కనబడింది. ఆ థీసిస్‌ను మీరు ఆ యూనివర్సిటీలో సబ్మిట్ చేస్తే మంచిదని అనుకున్నాం." అని ఒక్కసారి ఆగాడు.

పాపం మా వారు బోళామనిషి. పూర్తిగా బోల్తా పడిపోయారు. "...అంటే దీన్నిబట్టి ఇంకో టీము రోగం తగ్గించడం గురించి పరిశోధన కొనసాగించవచ్చంటారు..." అన్నారు.

'అంతే. అంతే.,,అహ..అంతే కాదు..ఇంకో చిన్నసలహా! ఇది ఇలా బహిరంగంగా ప్రాక్టీసు చేస్తే ఎవరైనా కాపీ కొట్టేసి వాళ్ల పేర పేటెంటు చేసేసుకుంటారు. అందువల్ల ఇది ఇక్కడితో ఆపేసి, ఈ ఫార్ములాను కాగితం మీద పెట్టేసి ఆ యూనివర్శిటీవాళ్లకు ఇచ్చేయండి. వాళ్లే తన్నుకు ఛస్తారు." అన్నారు పరంధామయ్యగారు మా వారి భుజం తడుతూ.

"థాంక్సండీ. నా ఇంటలెక్చువల్ ప్రాపర్టీ రైట్‌ను కాపాడేరు." అన్నాడు ఈ అమాయకుడు.

"థాంక్సండీ. మమ్మల్నీ కాపాడేరు.' అనుకున్నాం నేనూ, పిల్లలూ!

---

# హిందీ సినీ సంగీతంలో మలుపులూ-మజిలీలూ

## 1954


నౌషాద్, లతా,రఫీ

నౌషాద్ హిట్స్ మూడు వచ్చాయి - భరత్‌భూషణ్ హీరోగా 'షబాబ్','మీర్జా గాలిబ్', దిలీప్‌కుమార్ 'హీరోగా 'అమర్'.'షబాబ్'లో 'మర్‌నా తేరీ గలీమే, జీనా తేరీ గలీమే'(లతా), 'అమర్'లో 'ఇన్సాఫ్ కా మందిర్ హై యే భగవాన్‌కా ఘర్ హై'(రఫీ). 'మీర్జా గాలిబ్'లో 'దిలే నాదాన్ తుఝే హువా క్యా హై'(తలత్' పాటలు అజరామరంగా నిలిచిపోయాయి.

ఉర్దూ కవి గాలిబ్ (1797-1869)పై సినిమా తీయడం విశేషం. గాలిబ్‌కు, ఒక నర్తకికి మధ్య ప్రేమగాధను చొప్పించారు. గాలిబ్ కవిత్వాన్ని సురయ్యా, తలత్, రఫీలు గానం చేశారు.


'మున్నా' చిత్రంలో మాస్టర్ రోమి, జైరాజ్

'మున్నా' అనే పాటలు లేని సినిమా వెలువడింది. 'నౌజవాన్'(1937) తర్వాత పాటలు లేని సినిమా ఇదే! కె.ఎ.అబ్బాస్ దర్శకత్వం వహించగా ఈ కథాంశాన్ని కాస్త మార్చి 12 ఏళ్ళ తర్వాత చేతన్ ఆనంద్ 'ఆఖ్రీఖత్'గా మలిచారు.

సంగీత ప్రపంచంలో విప్లవాన్ని సృష్టించిన "నాగిన్" విడుదలయింది. ఎక్కడ విన్నా హేమంత్ కుమార్ గురించి ప్రశంసలే. 'తన్‌డోలే, మేరామన్ డోలే', 'జాదూగర్ సయ్యా', 'ఊంచీ ఊంచీ దునియాసే' వంటి పాటల చిత్రీకరణకు వైజయంతీ మాల అందం తోడయింది. కళ్యాణ్‌జీ వాయించిన 'బీన్'కు శ్రోతలందరూ సమ్మోహితులయిపోయారు. తెరమీద పాము కనబడినప్పుడు 'నాగిన్' మ్యూజిక్ వినిపించడం ఆనవాయితీ అయిపోయింది.


హేమంత్‌కుమార్


"నాగిన్" చిత్రంలో ప్రదీప్‌కుమార్, వైజయంతీమాల

బొంబాయి వీధుల్లో తిరిగే బాల కార్మికుల గురించి రాజ్‌కపూర్ రియలిస్టిక్ సినిమా 'బూట్ పాలిష్' ప్లాను చేసి తన అసిస్టెంటు ప్రకాష్ మెహ్రా చేత డైరక్టు చేయించాడు. చివరికి వచ్చేసరికి పాటలు లేకుండా తీయడానికి ధైర్యం చాల లేదు. 'నన్హే మున్హే బచ్చే తేరే ముఠ్ఠీమే క్యాహై' వంటి పాటలు అప్పటికప్పుడు తయారు చేయించి ఇమిడ్చాడు. సినిమా బాగా ఆడింది.


'బూట్‌పాలిష్'లో మాస్టర్ రతన్ కుమార్

పాటలు రాసే ప్రదీప్ పాటగాడిగా మారి పాడిన 'దేఖ్ తేరే సంసార్ కీ హాలత్ క్యా హో గయీ భగవాన్' (నాస్తిక్) చాలా హిట్ అయింది. అది 'ఇలవేలుపు' సినిమాలో 'నీమము వీడి అజ్ఞానముచే పలు బాధలు పడనేల' అనే పాట పల్లవికి ప్రేరణనిచ్చింది.

## సితార్, సుర్‌బహార్‌ల మేటి విద్వాంసుడు

# ఉస్తాద్ ఇమ్రత్‌ఖాన్



ఏ రంగంలోనైనా బెస్ట్‌సెల్లర్‌గా చలామణీ అవుతున్నది అత్యుత్తమ మైనది కానవసరంలేదు. సితార్ అనగానే అందరికీ గుర్తొచ్చే పేరు రవిశంకర్‌ది అయినప్పటికీ విలాయత్‌ఖాన్ ఆయన కంటే ఎన్నోరెట్లు మెరుగైన కళాకారుడని కొందరి ఉద్దేశం. విలాయత్‌ఖాన్ బాణీలో సితార్ వాయించే ఆయన తమ్ముడు ఇమ్రత్‌ఖాన్ అన్నగారి శిష్యుడే.

కర్ణాటక పద్ధతిలాగా కాకుండా హిందుస్తానీ పద్ధతిలో గాత్రసంగీతానికీ, వాద్యసంగీతానికీ చాలా తేడా ఉంటుంది. పాటలకు బదులుగా సాహిత్యం లేని గత్‌లు సితార్ మీద వాయించడం పరిపాటి. అంతే కాకుండా ఆలాపన, జోడ్ (తానం) సితార్ మీద ఎక్కువసేపు (ఒకప్పుడు తాన్‌సేన్ పాడిన ధ్రుపద్ శైలిలో) వాయిస్తారు. తరవాతనే తబలా తాళ సహకారంతో గత్ మొదలవుతుంది. ఈ ప్రక్రియలన్నిటిలోనూ ఇమ్రత్‌ఖాన్‌కు గొప్పప్రతిభ ఉంది. అతి నింపాదిగా మొదలయే విలంబిత కాలంలో రాగవిస్తారం నుంచి అతివేగంగా ముగిసే ద్రుత్‌గత్, ఝాలా వరకు అద్భుతమైన విన్యాసాలతో సాగుతుంది ఆయన కచేరీ. అందులో అడుగడుగునా సితార్ మీద ఆయనకు ఉన్న అధికారమూ, రాగం మీద పట్టూ, అద్భుతమైన సృజనాత్మకతా వినేవారిని ఆకట్టుకుంటాయి. ప్రతి స్వరమూ అందంగా, ప్రతిగమకమూ స్పష్టంగా, స్వరకల్పన తీర్చిదిద్దినట్టుగా వినిపిస్తుంది.

వ్యక్తిగతంగా ఇమ్రత్‌ఖాన్ చాలా స్నేహపూర్వకంగా, ఛలోక్తులు వేస్తూ నవ్విస్తూ ఉంటారు. భేషజాలేవీ లేకుండా 66 సంవత్సరాల వయసులో కూడా ఆరోగ్యం తొణికిసలాడే వైఖరి ఆయనది. రెండు కచేరీలలో పాల్గొనటానికై ప్రత్యేకంగా అమెరికా నుండి ముంబాయికి ఆయన వచ్చిన సందర్భంగా జరిగిన సంభాషణ:

❑ మీ కుటుంబంలో ఎన్నాళ్ళుగా సితార్ వాయిస్తున్నారు?

★ మా వంశం అక్బర్ పాదుషా కాలంనుంచీ ఎన్నోతరాలుగా సంగీతానికి పేరుపొందినది. నేను 1936లో కోల్‌కతాలో జన్మించాను. నాకు రెండున్నరేళ్ళ వయసులోనే ఆనాటి ప్రసిద్ధ సితార్ నిపుణుడైన మా తండ్రి ఉస్తాద్ ఇనాయత్‌ఖాన్ కాలం చెయ్యడంతో మా అన్నగారైన ఉస్తాద్ విలాయత్‌ఖాన్ నాకు సితార్ నేర్పే గురువుగా బాధ్యతను చేపట్టవలసి వచ్చింది.

❑ సితార్‌కూ సుర్‌బహార్‌కూ తేడా ఏమిటి?

★ మా బాబాయి ఉస్తాద్ వహీద్‌ఖాన్ "సుర్‌బహార్" అనే వాయిద్యాన్ని నేర్పారు. ఇది సితార్ కన్నా మంద్రస్థాయిలో గంభీరంగా మోగే వాయిద్యం. దాదాపు సితార్‌లాగే కనబడే ఈ వాయిద్యాన్ని మా ముత్తాత సాహెబ్‌దాద్‌ఖాన్ గారు మొదటగా తయారు చేశారు. దీనికీ సితార్‌కీ ఉండే తేడా పాశ్చాత్య వాయిద్యాలైన వయొలిన్, చెల్లోలకు ఉన్నటువంటిదే. రాగాలాపన ధ్రుపద్ శైలిలో వినిపించడానికి ఇది ఉత్తమ సాధనం. మా తాతగారూ, ముత్తాతగారూ దీన్ని కచ్ఛపవీణ అనే పేరుతో వాయించి ప్రఖ్యాతి గడించారు. అయిదారేళ్ళ వయసునుంచీ చేసిన రాక్షస సాధన ఫలితంగా నా చేతి వేళ్ళకూ పాదాలకూ కూడా గాయాలవుతూ ఉండేవి. మామూలు కుటుంబాల్లో అటువంటిది జరుగుతుందని ఊహించడం కూడా అసంభవం. నాలుగు శతాబ్దాలుగా సంగీతానికి పేరుమోసిన వంశానికి అప్రతిష్ఠ రాకూడదనే పట్టుదలతో ఆ అభ్యాసం కొనసాగింది.

❑ నాడు సితార్, సుర్‌బహార్ రెండింటిలోనూ అద్వితీయమైన విద్వత్తు ఉన్నది ఒక్క ఇమ్రత్‌ఖాన్‌కు మాత్రమే అంటే అతిశయోక్తి కాదేమో?

★ నేను ఒకే కచేరీలో రెండింటినీ వాయించిన సందర్భాలు ఎన్నో ఉన్నాయి. విలాయత్‌ఖాన్ సితార్, నేను సుర్‌బహార్ మీద చేసిన జుగల్‌బందీ కచేరీలు నాలుగైదు దశాబ్దాల క్రితమే శ్రోతలను ఉర్రూతలూగించాయి. సితార్ తీగల కన్నా సుర్‌బహార్ తీగలు దళసరిగా ఉంటాయి. సితార్‌లో ఒక మెట్టు మీద అయిదు స్వరాలు (స నుంచి ప దాకా) గుంజి పలికించవచ్చు. సుర్‌బహార్ మీదనైతే ఏడు స్వరాలు పలుకుతాయి. ఈ కారణంగా గమకాలూ, జారుడు స్వరాలూ సుర్‌బహార్ మీద అద్భుతంగా వినిపిస్తాయి.

❑ అయినా సంగీతంలో మీకు రావలసినంత పేరు రాలేదేమో ననిపిస్తుంది.

★ కొందరు పబ్లిసిటీ కోసం సాధన చేసి దాన్ని సంపాదించుకుంటారు. అది ఒక కళేనేమో. సంగీతాన్ని సాధించే ప్రయత్నంలో మునిగితేలే నా వంటివాళ్ళకు పబ్లిసిటీ అంతగా రాకపోవడంలో ఆశ్చర్యం లేదు. నేను వాయించిన రికార్డ్‌లూ, సీడీలూ, కేసెట్లూ కూడా ఏ దుకాణంలోనూ కనిపించవు. అది కూడా బుద్ధిపూర్వకంగా ఎవరైనా చేస్తున్న పనేమో నాకు తెలియదు. ఈనాడు పెద్ద కంపెనీల స్పాన్సర్‌షిప్ లేకపోతే సంగీత కచేరీలు జరగని ఈ రోజులలో వారిని పట్టుకొనే చాకచక్యం లేకపోతే నా వంటి పరిస్థితే ఎదురవుతుందేమో. అంగాంగ ప్రదర్శనతో సితార్ కళాకారిణులుగా పేరు సంపాదించడానికి ప్రయత్నిస్తున్న నేటి యువతులను కొందర్ని చూస్తే ఆశ్చర్యం, బాధా కలుగుతాయి.

❑ మీ బాణీకి పేరు తెచ్చిన గాయకీ శైలిని గురించి వివరిస్తారా?

★ మెట్లూ, మీటే పద్ధతి వగైరాల వల్ల సితార్‌వంటి తంత్రీవాయిద్యాల శబ్దానికి సామాన్యంగా పరిమితులు ఉంటాయి. ఒకసారి మీటాక తీగ కొంతసేపు మాత్రమే మోగుతుంది. పాటలో సాగినట్టుగా ఎడతెగని సంగతులు పలికించడం కష్టం. వీణ, సితార్ వంటి వాయిద్యాలకు సహజంగా ఉండే సమస్యలివి. వాటిని అధిగమించి గాత్రాన్ని పోలినట్టు గమకాలతో వాయించడం చాలి కష్టం మేము ప్రయత్నించే ఈ "గాయక శైలి" మన దేశపు అత్యుత్తమ హిందుస్తానీ గాయకులైన అబ్దుల్ కరీంఖాన్, ఫయ్యాజ్‌ఖాన్, బడేగులాం ఆలీఖాన్, అమీర్‌ఖాన్ తదితరుల బాణీలపై ఆధారపడినది. వాటిని తొలిసారిగా సితార్‌పై పలికించగలిగిన ఘనత విలాయత్‌ఖాన్‌దీ, నాదీను.

❑ మీరు విదేశాల్లో స్థిరపడడానికి కారణం?

★ 1956లో సోవియట్ యూనియన్, తూర్పు యూరప్ దేశాల పర్యటనతో మొదలైన నా విదేశయాత్రల వల్ల నాకు అంతర్జాతీయంగా పేరొచ్చింది. అమెరికా, కెనడా, బ్రిటన్, దక్షిణ అమెరికా, యూరప్, హాంకాంగ్ వగైరా ప్రదేశాల్లో ఎన్నో సంగీతోత్సవాల్లో నేను పాల్గొన్నాను. సంగీత కచేరీలే కాక అనేక దేశాల్లో భారతీయ సంగీతానికి ఉపాధ్యాయుడిగా, ఉపన్యాసకుడిగా పనిచేశాను. 1960లలో ప్రారంభించి ఇంగ్లండ్‌లోని డార్టింగ్‌టన్ కాలేజిలో, బీబీసీ రేడియో, టెలివిజన్‌లో, హాలండ్, స్వీడన్, ఇటలీ, జర్మనీ మొదలైన దేశాలలో ఎన్నో ప్రతిష్ఠాకరమైన సమావేశాలూ, యూనివర్సిటీల్లో, అమెరికా సియాటిల్ యూనివర్సిటీ ఆఫ్ వాషింగ్టన్, హార్వర్డ్, యూనివర్సిటీ ఆఫ్ కాలిఫోర్నియా లాస్ ఏంజెలిస్ ఇలా ప్రపంచమంతటా ఎన్నో కోర్సులు నిర్వహించి, విదేశీయులకు మన సంగీతం పట్ల అవగాహనను పెంచాను. బీబీసీ వద్ద మరే సంగీతకారుడిదీ లేనంత స్థాయిలో నేను వాయించిన

రికార్డింగులున్నాయి. ఉత్తమ సంగీతకారుడై ఉండి విషయాలను చక్కగా వివరించగలిగిన నేర్పు ఉందని పేరు రావడంతో నాకు ఇటువంటి ఆహ్వానాలు ఎన్నో వచ్చాయి. ప్రస్తుతం అమెరికాలో మిసోరీ రాష్ట్రంలో సెయింట్ లూయిస్ పట్టణంలోని వాషింగ్టన్ యూనివర్సిటీలో విజిటింగ్ ప్రొఫెసర్‌గా పనిచేస్తున్నాను. అక్కడ నాకు ఎందరో అమెరికన్ శిష్యులున్నారు. వారిచేత నేను "ఇమ్రత్ వయొలిన్" "ఇమ్రత్ గిటార్" అనే కొత్త రకాల వాయిద్యాలను సాధన చేయిస్తున్నాను. ప్రతి సంవత్సరంలోనూ కొన్ని నెలలు మన దేశంలో గడుపుతాను.

❑ సితార్‌ను కేవలం జంత్రవాద్యంగా కాక దానిమీద ఖయాల్, ఠుమ్రీ వంటి గాత్ర విశేషాలను వినిపించడం వల్ల మీ బాణీకి ఎనలేని ఖ్యాతి లభించింది. మీరు గాత్రం అభ్యసించారా?

★ వాద్యసంగీతం కాక చిన్నవయసులోనే మా తల్లిగారు బషీరన్ బేగమ్, మాతామహుడైన బందేహసన్‌ఖాన్‌ల వద్ద నేను గాత్రసంగీతం అభ్యసించాను. నాకు సంగీతం తల్లిపాలతోనే సంక్రమించింది. అన్నట్టు 1940లలో బాల గాయకుడిగా నేను కొన్ని సినిమాల్లో పాడానని మీకు తెలుసా?

❑ తెలియదు, వివరాలు చెపుతారా?

★ అవి హెర్క్యులిస్, ఖిడ్కీ, హాఫ్ టికెట్ వగైరా చాలా పాత సినిమాలు. నాది చిన్న పిల్లవాడి గొంతు కనక ఆ రోజుల్లో నేను నూర్జహాన్‌ని ఇమిటేట్ చేస్తూ పాడేవాణ్ణి. పెద్దయి కీచుగొంతు పోయాక ఆ అధ్యాయం ముగిసింది.



వ్యాసకర్తతో ఇమ్రత్‌ఖాన్

**❑ మీరు సినిమాల్లో సితార్ వాయించారా?**

★ కొన్నేళ్ళు బొంబాయి సినీపరిశ్రమలో నేపథ్య సంగీతానికి సితార్ వాయించాను. గంగా జమునా చిత్రంలో నౌషాద్‌కు "ఢూంఢో ఢూంఢోరే సాజ్‌నా" అనే పాటకు ట్యూన్ నేనే నేర్పాను. రోషన్, మదన్‌మోహన్ వంటి పాత స్వరకర్తలతో కూడా పనిచేశాను. కోహినూర్ వగైరాల్లో నటించిన దిలీప్‌కుమార్ కొన్నాళ్ళు సితార్ నేర్చుకున్నాడు కూడా. కాని త్వరలోనే సినీ వాతావరణంతో నాకు విసుగెత్తి శాస్త్రీయ విద్వాంసుడిగా కొనసాగాను. తరవాత సత్యజిత్‌రాయి తీసిన "జల్‌సాఘర్" 1968లో జేమ్స్ ఐవరీ చిత్రం "గురు", 1976లో షబాన నటించిన"కాదంబరి", "విల్‌బీ కాన్స్పిరసీ"అనే హాలీవుడ్ సినిమా వగైరా చిత్రాలకు వాయించాను.

❑ మీ తరవాతి తరం మాటేమిటి?

★ మా అబ్బాయిలందరూ ఉత్తమ కళాకారులుగా పేరు సంపాదించుకుంటున్నారు. లండన్‌లో ఉంటున్న పెద్దవాడు నిషాత్ సితార్‌నూ, కెనడాలో నివసిస్తున్న రెండోవాడు ఇర్షాద్ సితార్, సుర్‌బహార్‌లూ వాయిస్తాడు. లండన్‌లోని మూడో అతను వజాహత్ సరోద్ నిపుణుడైతే నాలుగో కుమారుడు షఫాతుల్లా (ఫిలడెల్ఫియా) సితార్, సుర్‌బహార్, తబలా మూడూ వాయిస్తాడు. ముంబాయిలో ఒక కచేరీలో నిషాత్‌ఖాన్ నాకూడా సితార్ వాయించాడు.

❑ ఈ రోజుల్లో యువతరం ఎంత అభిరుచి ఉన్నప్పటికీ చదువు మానేసి సంగీతం నేర్చుకోవడానికి సాహసించలేదు. చదువూ సంగీతం రెంటినీ అభ్యాసం చెయ్యమని సలహా ఇస్తారా?

★ సంగీతం అంత తేలిక అని ఎందుకనుకుంటారు? ఒకేసారిగా డాక్టరూ చదువూ, లాయరు చదువూ చదవగలరా? చదువులో అంతగా రాణించటం లేదని నా పిల్లలను స్కూలు మాన్పించాను. సంగీతానికి జీవితం ధారపోస్తామని అతి చిన్న వయసులోనే మాట ఇచ్చిన మా అబ్బాయిలు అహర్నిశలూ అభ్యాసంచేసి అన్నమాట నిలబెట్టుకున్నారు. ఒకేసారిగా చదువులోనూ, సంగీతంలోనూ పైకి రావాలనుకోవడం అత్యాశ అనిపిస్తుంది.

❑ మన సంగీతానికి భవిష్యత్తు ఎలా ఉందంటారు?

★ మనదేశంలో ఉన్న ఆర్థిక, సామాజిక సమస్యలు నిరాశ కలిగించినా మనకు ఉన్న సాంస్కృతిక వారసత్వమే కాపాడుకోదగిన మన సంపద అనేది మరిచిపోరాదు, ఆధునికత పేరుతో వెర్రితలలు వేస్తున్న నేటి సంగీతపు పోకడలు హాని కలిగిస్తాయి.

❑ ఫ్యూజన్ గురించి మీ అభిప్రాయం?

★ మనవాళ్ళు ఫ్యూజన్ అంటూ శాస్త్రీయ సంగీతాన్ని సంకరం చేస్తారు. పాశ్చాత్యులు తమ శాస్త్రీయ సంగీతాన్ని యథాతథంగా కాపాడుకుంటున్నారు. జాజ్, పాప్, రాక్ వగైరాలన్నీ వారు సృష్టించుకున్నవే. దేనికదిగా వాటిని అభిమానించేవారున్నారు. అంతమాత్రాన బెథోవెన్, మొజార్ట్‌ల సంగీతంతో రాక్, పాప్, జాజ్ వంటి వాటిని కలపడం ఎప్పుడైనా చూశారా? పశ్చిమదేశాల్లో జరిగే ఇటువంటి ఫ్యూజన్ కచేరీలకి హాజరయ్యేది మనవాళ్ళే. అక్కడివారు పట్టించుకోరు.

❑ మీరు కర్ణాటక సంగీతం వింటారా?

★ సంగీతం ప్రొఫెసర్నుగనక అమెరికాకు వచ్చే దక్షిణాది పండితుల సంగీతం వింటూనే ఉంటాను. అంత గొప్ప సంగీతం ఉన్నప్పుడు ముగ్గురేసి, నలుగురేసి తాళవాద్యకారులు వచ్చి యాంత్రికంగా ఒకరి తరవాత ఒకరు ముందుగా అనుకున్న పద్ధతిలో తాళవరసలూ, ముక్తాయింపులూ వాయించడం ఒక్కొక్కప్పుడు "అతి"గా అనిపిస్తుంది. వీణ విద్వాంసులైన ఈమని శంకరశాస్త్రి, చిట్టిబాబుల మీద నాకు చాలా గౌరవం ఉంది. చిట్టిబాబుతో జుగల్‌బందీ వాయిస్తే బాగుంటుందని అనుకునేవాణ్ణి.

**❑ వ్యక్తిగత విషయాలని కాదుగాని పాశ్చాత్యులకు మన సంగీతాన్ని తొలిగా వినిపించినది రవిశంకర్‌గారే కదా?**

★ అది తప్పు. అంతకు ముందు కొందరు చేసిన ప్రయత్నాలకు పబ్లిసిటీ రాలేదు. ఆ మాటకొస్తే మా అన్నగారూ, నేనూ రవిశంకర్ కంటే ముందే వారి ఆదరణ పొందాం. రోలింగ్ స్టోన్స్ గిటారిస్ట్ రోజర్ విలియమ్స్ నా దగ్గిర సితార్ నేర్చుకున్నాడు. అప్పటికి బీటిల్స్‌కి పేరు ప్రఖ్యాతలు లేవు. నా సితార్ విన్నాక జార్జ్ హారిసన్ (బీటిల్స్ గిటారిస్ట్) సితార్ నేర్చుకోవటానికి నా దగ్గరికి వచ్చాడు. అప్పటి హిప్పీ సంస్కృతి గురించీ, డ్రగ్స్ గురించీ కొందరు శ్రేయోభిలాషులు నన్ను గట్టిగా హెచ్చరించినందువల్ల నేనతన్ని అంతగా ప్రోత్సహించలేదు. ఆ తరవాత అతను రవిశంకర్ని ఆశ్రయించాడు.

❑ ఆ తరవాత?

★ రవిశంకర్ వుడ్‌స్టాక్ ఉత్సవంలో పాప్ కళాకారుల, హిప్పీల మధ్య సితార్ వాయించి పేరు తెచ్చుకున్నాడు. బీటిల్స్ సాంగత్యం ఆయనకు చాలా లాభించిందనేది అందరికీ తెలుసు. నా ప్రశ్నల్లా జార్జ్ హారిసన్ రవిశంకర్ నుంచి ఏపాటి సితార్ నేర్చుకోగలిగాడని.

❑ ప్రస్తుతం మీ అభిమాన విషయాలేమిటి?

★ అమెరికాలో ఉంటున్నా నా ఆత్మ మన సంగీతాన్నే ఆశ్రయించుకుని ఉంది. ఎటొచ్చీ ఆదాయానికి లోటులేదు. నాకు మన దేశంలో పేరూ, డబ్బూ కోసం పాకులాడే ధోరణీ, ఓపికా లేవు. మరొక ప్రణాళిక ఉంది. మొగలుల కాలం నుంచీ మన సంగీతంలో జరిగిన, జరుగుతున్న పరిణామాల గురించి. సంగీత శాస్త్రవేత్తలా కాకుండా సంగీతకారుడి దృక్పథంతో ఒక గ్రంథం రాయదలిచాను. అందులో నాకు తెలసిన విషయాలను సంగీతాభిమానులతో ముచ్చటించుకుంటాను.

**-డా. కొడవటిగంటి రోహిణీప్రసాద్**

# వాగ్గేయకారుడు యానం రామకృష్ణ

చరిత్ర చాలా విచిత్రమైంది!!

చరిత్ర పుటల్ని తవ్వుకుంటూ పోతే... ఎన్ని అనర్ఘరత్నాలు దొరుకుతాయో!... ఎన్ని ఘనీభవించిన కన్నీటి బిందువులు ముత్యాలై దొరుకుతాయో...

అన్నిరంగాల్లోనూ ఎప్పుడూ కొంత మందే వెలుగులో కనిపిస్తారు... కొంతమందే ప్రముఖులుగా వినిపిస్తారు!...

మిగతావాళ్ళు!! మసకమసకైపోతారు... కంటికి కనిపించరు... చరిత్రహీనులైపోతారు!...

ఆ పాపం ఎవరిదీ?...

మనదే కదూ....

ఇదిగో... అలా చరిత్ర కందకుండా పోయిన మరో మహానుభావుడే యానం రామకృష్ణ... 1912లో కార్వేటి నగరంలో పుట్టాడు. ఆయన బలిజ కులస్థుడు...

కళలకి కులం కూడా అడ్డమొచ్చే కాలం... రామకృష్ణకి సంగీతం నేర్చుకోవాలన్న తపన ఉంది... కానీ గురువేడీ!...

అయితే అపారమైన సంకల్పబలం ఉంటే... మార్గం అదే ఏర్పడుతుందిగామోసు....

దొరికాడు... గురువు దొరికాడు...

అల్లాటప్పా గురువు గాదు... సాక్షాత్తూ 'ముత్తుస్వామి దీక్షితులు'వారి శిష్యప్రశిష్యులకు శిష్యుడు...

ఎంత తపించాడు... ఎన్నిగుమ్మాలెక్కిదిగాడు... ఎన్ని అవమానాల్ని భరించాడు... అలాంటి 'స్వాతి చినుకంటి' యానం రామకృష్ణ వెళ్ళి ముత్యపు చిప్పలో పడ్డాడు...

నీరము తప్త లోహమున నిల్చి అనామకమై నశించు- "నీటి బిందువు వేడి వేడి పెనం మీద పడ్డే చుయ్‌మని ఆవిరైపోతుంది".

ఆ నీ రమె ముత్యమట్లు నళినీ దళసంస్థితమై తనర్చు-

"అదే నీటి బిందువు తామరాకు మీద పడితే కాస్సేపైన ముత్యంలా మెరుస్తుంది".

ఆ నీరమె శుక్తిలోబడి మణిత్వముగాంచు సమంచితప్రభన్' 'ఆ నీటి బిందువే ముత్యపు చిప్పలో బడిందో- ముత్యమై మెరుస్తుంది".

దాన్నే యోగం... అంటారు... ప్లేస్‌మెంట్...

ఎలాంటి మహానుభావుడు దొరికాడయ్యా అంటే... ఆ మహానుభావుడి పేరు కూత్తనూరు అయ్యాస్వామి అయ్యరు... ఆయన భార్య లలితాంగి వీళ్ళ బిడ్డ... ప్రముఖ గాయని ఎం.ఎల్.వసంత కుమారి...

ముసిరి సుబ్రహ్మణ్య అయ్యర్

ఆరైకుడి రామానుజ అయ్యంగార్ మొదలైన మహానుభావులు... ఈయన సహ పాఠులు...

మరో విషయం ఏవిటంటే...ఏదైనా తేలిగ్గా లభిస్తే...దానికి విలువుండదు. ఏదైనా కుప్పలకొద్దీ దొరికితే ఆసక్తి ఉండదు....

బంగారం చూడండి!...వెండిచూడండి!...ఇనుము చూడండి!!

మొత్తానికి రామకృష్ణ... కొలిమిలో కాలాడు...

సంగీతం క్షుణ్ణంగా నేర్చుకున్నాడు....

గురువుగారి ఆశీస్సులు...పుష్కలంగా పొందాడు...

చాలాచోట్ల కచేరీలు చేస్తున్నాడు!...ఎందరికో సంగీతం కూడా నేర్పిస్తున్నాడు. కానీ ఏదో అసంతృప్తి... ఏదో శూన్యం గుండెల్లో... ఏదోబెంగ... ఏదో దిగులు....

ఏదో స్ఫురించింది...అన్నమయ్య కీర్తనల్లే...

ఆకటి వేళల...అలిసిన వేళల...

చేకువ 'హరినామ మొక్కటే' వేరేగతిలేదు...

సంగీతానికి...పరమార్థం...పరమ -అర్థం...తోచింది!

ఓ రాత్రివేళ...నిద్రపట్టక...కూనిరాగాలు తీస్తున్నాడు..

కృష్ణుడి విగ్రహం...పిల్లనగ్రోవి ఊత్తోంది! అందులోంచి

అగరుపొగలు...రంగురంగుల ఇంద్రధనస్సులు...ఆనందలహరులు...

పిల్లనగ్రోవి...ఘంటమైపోయినట్టూ...కృష్ణుడు అది తన చేతపెట్టి ఆశీర్వదించినట్టూ...

కలం కాగితం మీద పెట్టగానే భావ సముద్రాలు పొంగినట్టూ...

సప్తవర్ణాలు...ఉబికి ప్రవహించినట్టూ...వెళ్లిపోతోంది కలం... కలిసిపోతుంది గలం...?

గొంతెత్తి పాడ్డం...దాన్నే రాయడం...

తన్మయత్వంలో మునిగిపోతూ...'కీర్తన సుధాలహరి'ని మొదలెట్టేశాడు...



కళ్లముందున్న కన్నయ్యతో మాట్లాడుతున్నట్టే...తన గోడువెళ్లబోసుకున్నట్లే...కొన్ని స్తోత్రాలు...కొన్ని స్తవాలు...కొన్ని లాలి పాటలు..కొన్ని జోలపాటలు.. కొన్ని మేలుకొలుపులు...కొన్ని ఆధ్యాత్మక ప్రభోదాలు ఒకటా రెండా...మొత్తం నూటమూడు...

మొట్టమొదట..సంగీత త్రయంలోని ప్రథముడైన 'త్యాగరాజ స్తుతితో ఆరంభించాడు...రుద్రప్రియ రాగంలో. "మంత్ర తంత్రాలు నేను ఎరగను... నిన్నే తలుస్తూ ఉండే దాసులకు నేను దాసుడనూ...'రామకృష్ణనుత' అనేది ముద్ర..

ఆ తర్వాత 'సరస్వతీ'దేవిని కళ్యాణిరాగంలో "వాణీనుత శర్వాణీ వనజాతాసన రాణీ" అని రూపకతాళంలో స్తుతి...

ఇంకా...శ్రీరాగం, నాట కురంజిరాగం... హంసధ్వని, నాటంగం హంసానందినిలో కామాక్షి స్తోత్రం... భైరవి, అభోగి, జంఝూటి. కళ్యాణి, సావిత్రి, మహాలక్ష్మిని గురించి మధ్యమావతిరాగంలోనూ. నరసింహస్తుతి మాల్‌కౌన్.

ఇలా అనేక రాగాలల్లో...అనేక దేవతల్ని కరువుతీరా...కన్నీరు కారుస్తూ స్తుతించాడు రామకృష్ణ...

రాముడి మీద రాసిన ఒక కీర్తన :

**కలడా లేడా రాముడు -కలనైన గాన రాడే మనసా**
**కలదని చెప్పిన -పెద్దల మాటలు -కలదాయెనా లేక లేదాయెనా**
**అంతవాడని యందురే జగమంత వాడని యందురే...**
**అంతరాత్ముడే రాముడుండ యిల వింతగాదే గానరాక యుంట.**

అలాగే యదుకుల కాంభోజి రాగంలో హనుమంతుని మీద కీర్తన

**హనుమంతా బలవంతా -ఘనవంతా బ్రోవుమా**
**నిన్ను సన్నుతించలేదా...నన్ను బ్రోవగారాదా**
**కన్నతండ్రివి కాదా-కాపాడుటకు వాదా**
**కిన్నెర నుత సాదా....సన్నుతిజేసేదా!!**

ఇలా ఉంటుండగా...ఒకసారి రామకృష్ణకి కలరా సోకింది!!

ఆ కాలం ఎలాంటిదంటే..ఏ పెద్ద జబ్బొచ్చినా... పసర్లూ... కాల్చివాతలూ తప్ప సవ్యమైన మందులు లేని కాలం...అన్నిటికన్నా అవగాహన లేని కాలం...మూఢ నమ్మకాలు రాజ్యమేలుతున్న కాలం...

ఏదైనా మందు వేసాడో లేదో గానీ...పరమ భక్తితో...హనుమంతుణ్ణి ప్రార్థిస్తూ...

కలరానుబారత్రోలు -కరుణతో మమ్మునేలు
చలమేలాశ్రితలోలా-సమయము ఇది వేళా

అంటూ ప్రార్థించాడు!...ప్రార్థన బలం వల్ల కలరా పోయింది!...

తెలుగులో చాలా జోల పాటలున్నాయి..అందులో ముందు గుర్తొచ్చేవి అన్నమయ్యది...జో అచ్యుతానంద జో జో ముకుందా...అని అది పాడుతుంటే వింటున్నవాళ్లే కాదు... పాడ్తోన్న వాళ్లు కూడా పడుకుంటారు...అంత గొప్ప పాట...

అలాగే రామకృష్ణుడు ఒక అద్భుతమైన జోల పాట రాశాడు...

బంగారు తొట్టెలో -పవ్వళించర సామి
రంగానిదురబోర -జోల పాడేదా...

అంటూ జో కొడ్తూ రెండో చరణంలో చంకదిగని పసిబాలుడిలా ఎంతో ఎత్తు మరిగావు ఏం చెయ్యాలిరా రంగా...అండపిండాల్లో వెలిగేటి దొంగ!! అంటాడు...

ప్రేమా-పిచ్చీ ఒకటి అని...కవివాక్కు...పిచ్చంటే ఏవిటీ...ఏదైనా ఒక విషయం మీద...ఒక విషయం మీదే...దృష్టిని కేంద్రీకరించడం..

డబ్బు పిచ్చి...పదవి పిచ్చి...స్త్రీల పిచ్చి...అలాగే భక్తి పిచ్చి...

అందులో మునిగిన వాడికి...ఐహికం పట్టదు!..



మనసుకే... తప్ప మనిషికి సంస్కారం ఉండదు...

మదిలో కోర్కెల లతలు తెగిపోతాయ్!... జుట్టు మాత్రం అట్టలు కడుతుంది... పలవరింపో... కలవరింపో తెలీదు.. ఎవడ్తో మాట్లాడుతున్నాడో తెలీదు... వొళ్ళంతా ఎండి పోయి ఉంటుంది... కళ్లు మాత్రం దివ్య తేజస్సుతో వెలిగిపోతూంటాయి.

తన సర్వస్వాన్నీ... పరమేశ్వరుడికి అర్పించి... అనుక్షణం ఆయనను స్మరిస్తూ...అద్భుతమైన కీర్తనలు రాసి... చరిత్రలో కరిగిపోయినా,... రామకృష్ణ... 'కీర్తన సుధాలహరి' మాత్రం... సంగీత విశ్వంలో చిరస్థాయిగా నిలుస్తుంది!!

**-తనికెళ్ల భరణి**

డాక్టర్ సి.విజయలక్ష్మిగారు రచించిన 'ఆంధ్రప్రదేశ్ సంస్థానాలు -సంగీత వాఙ్మయం' చదివి,స్పందించి)

-భరణి

ఈ వ్యాసంపై అభిప్రాయాన్ని శ్రీ తనికెళ్ళ భరణికి తెలియజేయ దలచుకునే వారు

**తనికెళ్ళ భరణి,**

**కేరాఫ్: "హాసం", 502, శ్రీబాలాజీ నిలయం, 13-1-212,**

**మోతీనగర్, హైదరాబాదు - 500 018**

**అడ్రసుకు ఉత్తరాలు పంపాలి.**

మార్చి 26న ఆనంద శంకర్ వర్ధంతి...

# ప్రయోగవాద సంగీతానికి ఆద్యుడు ఆనంద శంకర్

భారతీయ శాస్త్రీయ సంగీతాన్ని పాశ్చాత్య సంగీతంతో కలగలిపి కొత్తబాణీలను సృష్టిస్తున్న వారందరికీ ఆదిగురువు ఆయన. ప్రయోగాలెన్ని చేసినా భారతీయ సంగీతంలోని మూలాల్ని, వాటి ఔన్నత్యాన్ని, దాని లక్ష్యాన్ని విస్మరించకుండా కాపాడుకోవాలి అని అనే వారాయన. ఆయనే "ఆనంద శంకర్". ఆనందశంకర్ అనగానే మనకు భారతీయ సంగీతాన్ని టెక్నిక్స్‌తో పలికించిన నూతన శైలి గుర్తొస్తుంది.



నృత్యసంగీత కళావారసత్వమున్న కుటుంబంలో 1942 డిసెంబర్ 11న అల్మోరాలో జన్మించిన ఆనంద శంకర్‌కు అమలాశంకర్, ఉదయ శంకర్ తల్లిదండ్రులు. పండిట్ రవిశంకర్ ఈతని చిన్నాన్న, బెనారస్ హిందూ యూనివర్సిటీలో సెకండరీ విద్య నభ్యసించారు. అంతకు ముందు 'గ్వాలియర్ సింధియా స్కూల్'లో పాఠశాల చదువు సాగించారు. బెనారస్ హిందూ యూనివర్శిటీలో సంగీత విభాగానికి అధిపతి లాల్‌మణి మిశ్రా ఆయనకు సితారలో తొలిగురువు. రవిశంకర్‌తో కలిసి కాలిఫోర్నియాలో ఉన్నప్పుడు పాశ్చాత్య సంగీతంలోని వివిధ ధోరణులను ఆకళింపు చేసుకున్నారు. ఆయన సంగీతంలో నూతన పోకడలకు ఇదే మూల కారణమనవచ్చు. పాశ్చాత్య సంగీత ప్రపంచం నుంచి వినమ్రంగా అనేక అంశాలను నేర్చుకుని వాటిలో నిష్ణాతులై భారతీయ సంగీత సాధనాలతో పాశ్చాత్య సంగీత సాధనాలను సమ్మిళితం చేసి సరికొత్త సంగీత సృష్టి చేశారు.

ఆనందశంకర్ తొలి కచేరి చేసింది 1970లో. అయితే తొలి ఎల్.పి.ని కూడా ఈ యేడాదిలోనే విడుదల చేశారు. అదీ లాస్ ఏంజిల్స్‌లో. తరువాత ఆయన స్వరపరిచిన ఆరు ఎల్.పి.లు., ఆరు క్యాసెట్లు, ఒక ఇ.పి., మూడు సి.డి.లు విడుదలయ్యాయి. ఆనందశంకర్ సృజించిన విశ్వజనీనమైన సంగీతాన్ని జాతి భేదాలు మరిచి సంగీత ప్రపంచమంతా విని మైమరిచింది. ఆయన పలు జాతీయ, అంతర్జాతీయ కార్యక్రమాలకు సంగీత రచన చేశారు. ప్రపంచ రైల్వే క్రీడోత్సవాలకు, దక్షిణాసియా సమాఖ్య క్రీడోత్సవాలను, రిలయన్స్ వరల్డ్ కప్, విల్స్ వరల్డ్ కప్ పోటీలకు, 1989లో నెహ్రూ శతజయంతి ఉత్సవాల సందర్భంగా ఢిల్లీలో జరిగిన ఒక కార్యక్రమంలో జరిగిన సంగీత కచేరీకి ఆయనే ప్రధాన నిర్వాహకులుగా వ్యవహరించారు.

తల్లిదండ్రులతో కలిసి అనేక కొత్తరాగాలను, బాణీలను కూర్చిన ఆనందశంకర్ భార్య తనూశ్రీ గొప్ప నాట్యకారిణి. వీరిరువురు రెండు దశాబ్దాల పాటు ప్రపంచమంతా తిరుగుతూ సంగీత నృత్యప్రదర్శనలిచ్చారు. ఆయన కంపోజ్ చేసిన 'సాగర్', 'సన్ ఫ్లవర్' రూపకాలు ఉదాత్తమైన, ఉద్వేగపూరితమైన సంగీతానికి తార్కాణాలు. సంగీతంలోనే గాక నృత్యంలో కూడా ఆయన ప్రయోగాలు చేశారు. తను నృత్య దర్శకునిగా భారతీయ, పాశ్చాత్య బాలే కదలికలతో కలగలిపి సరికొత్త నృత్య రీతులను రూపొందించారు. వీటికి ఇతివృత్తాలు సామాజిక సమస్యలే కావడం గమనార్హం. కళ కళకోసమే గాక అది సమాజ అభ్యున్నతికి వినియోగ మవ్వాలని ఆశించారాయన. ఎవరికివారు తమ సంప్రదాయపు చట్రంలో గిరిగీసుకుని ఉండటం వల్ల ఏ కళలోనైనా సృజనాత్మకత కుంటు పడుతుందనేది ఆయన వాదన.

ఆనందశంకర్ కేవలం కంపోజర్ మాత్రమే గాదు. రచయితగా పలు కథలు, మాన్యుస్క్రిప్టులు (సంగీతం గురించి) రాశారు. మృణాల్ సేన్ తీసిన 'కోరస్' చిత్రానికి సంగీత దర్శకునిగా జాతీయ అవార్డు అందుకున్నారు. అమెరికాలోని మేరీలాండ్ గవర్నర్‌చే అమెరికా గౌరవ పౌరసత్వం అందుకున్నారు. ఇంకా బాల్టిమోర్ మేయర్‌చే సన్మానమందు కున్నారు.

భారతీయ శాస్త్రీయ సంగీతంతో పరిచయమున్న వారెవ రైనా సరే ఆనంద్ శంకర్‌ను ప్రయోగాలకు పెట్టింది పేరుగా పేర్కొంటారు. అంతకు ముందెవరూ గిటార్‌తో మృదంగాన్నిగాని, రాక్ బీట్‌తో సితార్‌ను, సరోద్‌లనుగాని కలగలిపి వాడిన సందర్భాలు లేవు. కాని ఆనందశంకర్ వీటిలో చేసిన సంగీత రచన భావితరాలకు ఆదర్శమైంది. ఆ మహా సంగీతకారుడు 56వ ఏట 1999 మార్చి 26న మృతి చెందారు.

పశ్చిమ బెంగాల్ ప్రభుత్వం ఆయన భౌతిక కాయాన్ని రవీంద్రసదన్‌లో గంటన్నరపాటు ఉంచి ఆయన కంపోజింగ్స్ ప్రదర్శించి నివాళులర్పించింది. సంగీతమే జీవితంగా బ్రతికిన ఆనందశంకర్ ప్రయోగ వాద సంగీతకారునిగా భారతీయ సంగీత చరిత్రలో సదాస్మరణీయులే.

**-నికిత**

## కొంటెకొశ్చన్లు-తుంటరి జవాబులు



వి.మంజురాణి, హైద్రాబాద్.

ప్ర: లాయర్ దగ్గరకొచ్చే తలతిక్క క్లయింట్ ఏమంటాడు?

జ: పేపర్లో సాంస్కృతిక కార్యక్రమాల లిస్ట్‌లో 'జుగల్‌బందీ' అని వుండటం చూసి బందీని విడిపించటానికి ఎంత తీసుకుంటారని అడుగుతాడు.

కూర్మాన వెంకట సుబ్బారావు, విశాఖపట్నం.

ప్ర: భక్తులు షాక్ తినేదెప్పుడు?

జ: 'చిల్లరతో చిల్లర కోరికలు మాత్రమే తీరును' అనే బోర్డుని దేవాలయంలో చూసినప్పుడు...

## డబుల్‌రోల్



'బడి'కెళతావా... 'బడితె' పూజ చెయ్యాలా!?

- బద్ది నాగేశ్వరరావు, అనకాపల్లి.

మీరు 'తారాజువ్వలు' చుడ'తారా'!?

ఓరేయ్! 'గాలిబ్' గారి సైకిల్‌కి 'గాలి' కొట్టరా!

- వై.క్రాంతిసాగర్, ఏలూరు.



## చిలిపి లిపి



52 = యుద్ధము

A2 = ఎక్కడకు

E2 = ఇక్కడకు

- రఫీ తన్వీర్, రాజాం.

## ఈ రూటే వేరు




Milk stone = పాలరాయి

- కైలాస్ చంద్ర బెహరా, పర్లాహిమిడి.

Buy Nails = కొనుగోళ్ళు

- దేవులపల్లి రామమూర్తి, విజయవాడ.

Fifth charecter = పంచపాత్ర

- బద్ది నాగేశ్వరరావు, అనకాపల్లి.

## షార్ట్‌కట్స్




| | | |
|---|---|---|
| కాకినాడ కిరణ్మయి | : | కాకి |
| నల్లా సీతక్క | : | నక్క |
| కురసా డిప్పల తిమ్మయ్య | : | కుడితి |
| గంపా జియ్యరు | : | గంజి |
| రావూరి రామకృష్ణ | : | రారా |
| పోకల రామచంద్రం | : | పోరా |
| ఏడిద రాజయ్య | : | ఏరా |
| జౌపోసన రాజేంద్ర | : | జౌరా |

-బద్ది నాగేశ్వరరావు,
అనకాపల్లి.

## పేరడీ పేరేడ్



నగలరాణివి నీవె - జీన్సుగాడిని నేనే
ఈడు కుదిరెను,జోడుకుదిరెను -కారుదిగిరావె ॥నగల॥
ఆస్తులన్నీ నాకోసం -అప్పులన్నీ నీ కోసం
మామ కట్టిన ఐదుగదుల -ఇల్లు మనకోసం ॥నగల॥
పిండి వంటలు నాకోసం -పిల్ల పాపలు నీ కోసం
ఇంటి పనులూ, వంటపనులూ - అన్ని నీకోసం ॥నగల॥
ప్రేమ అంతా పై పైనే-ఆశలన్నీ లోలోనే
ఆస్తి దొరికిన మరుక్షణమ్మే -పారిపోదునులే ॥నగల॥
కట్నమిచ్చిన చినదానా -వెర్రి చూపుల పిలదానా
అదురుటెందుకు,బెదురుటెందుకు, నీ మొగుడనేగానా? ॥నగల॥
('బందిపోటు'చిత్రంలో "నగలరాణివి నీవె" పాటకు పేరడీగా)

- రాయచోటి కృష్ణమూర్తి, ముంబై

## పేరు -రిపేరు




బంగారు గాజులు - ముక్కుపుడక-గోల్‌మాల్

- మేడా మస్తాన్‌రెడ్డి, పూణె

ఆది - అంతం - దేవుడు - సొంతం

శారద - ఈ అబ్బాయి చాలా మంచోడు - ప్రేమించిచూడు

- శ్రీ, ఆచంట

## చిలిపికవిత




ప్రియా!
నీపై నాకున్న
ప్రేమ విలువ
రోజూ మనం ఎక్కే
ఆటో డ్రైవర్‌కి మాత్రమే తెలుసు!
ఎందుకంటే
నా గోల్డ్ రింగ్
అతని దగ్గరే వుంది!!

- గణేష్‌పూడి, హైదరాబాద్.

మార్చి 28న బి.వసంత పుట్టినరోజు సందర్భంగా...



# విరిసినది 'వసంత' గానం

ఆ పేరు వినగానే తెలుగువారికి 'చందమామరావే జాబిల్లి రావే...' అంటూ ఒక సుమధుర స్వరం హాయిగా లాలిస్తున్నట్లు వినిపిస్తుంది. కొన్ని సంవత్సరాల వరకూ కూడా ఆమె గొంతు చాలా సినిమాల్లోనూ, మద్రాసు రేడియోలోనూ వినిపించేది. నలభై ఏళ్లకు ముందు విడుదలయ్యే ప్రతి సినిమా టైటిల్సులోనూ గాయనిగా ఆమె పేరు తప్పక వుండేది. ఇలా అనేక సంవత్సరాల పాటు జరిగింది. ఆంధ్రదేశంలోని ప్రతి ఇంటా ఆమె పేరు సుపరిచితం, ఆమె స్వరం సుచరితం.

ఈ ఐదు శతాబ్దాలలో తనదైన ఓ ప్రత్యేకతతో సుమధుర గానాన్ని పంచుతూ ఎందరో శ్రోతల హృదయాలలో నిలిచిపోయింది వసంత.

1944 సంవత్సరం మార్చి 28న గుంటూరులో పుట్టింది. వసంత తండ్రిగారైన రవీంద్రనాథ్ సంగీతాభిమాని, నాటక పిపాసి. తన పిల్లలందరికీ రాగాల పేర్లనే పేర్లుగా పెట్టారు. కళ్యాణి, వసంత - ఆ విధంగా.

రవీంద్రనాథ్ నటుడు కూడా. పింగళి నాగేంద్రరావు తొలిసారిగా పాటలు రాసిన "భలే పెళ్లి, తారుమారు"(1941)చిత్రంలో హీరో ఆయనే. రవీంద్రనాథ్ కొంతకాలం గుంటూరులో 'రవి స్టూడియో' పేరిట ఫోటో స్టూడియో నడిపారు. వసంత తల్లి కూడా సంగీతంలో నిష్ణాతురాలే. ఆమె చక్కగా వీణ వాయించేవారు.

ఇలా తల్లిదండ్రులిద్దరూ సంగీతం తెలిసినవారే కావడంలో సహజంగా వసంతకూ సంగీతం పట్టుబడింది. మూడేళ్ల వయసు నుండే పాడడం ప్రారంభించింది. లతామంగేష్కర్ అంటే చెప్పలేని అభిమానం. ఆమె పాడిన పాటలు వింటూ, పాడుతూ, తేలిక పాటలు కూడా అలవాటు చేసుకున్నది. ఇది గమనించిన రవీంద్రనాథ్ వసంతను బాగా ప్రోత్సహించేవారు. రేడియోలో పిల్లల కార్యక్రమం కోసం ప్రతి ఆదివారం వసంతను విజయవాడ తీసుకెళ్లి పాడించేవారు. "మా తండ్రి గారి ప్రోత్సాహం వల్లనే నేను ఇంతదాన్నయ్యాను" అంటుంది వసంత.

అలా పదేళ్ల వరకూ బాలల కార్యక్రమాల్లో గొంతుకలిపిన వసంత, గుంటూరులో మహావాది వెంకటప్పయ్య, రాఘవేంద్రచారి గార్ల దగ్గర ఒక సంవత్సరం పాటు శాస్త్రీయ సంగీతం అభ్యసించింది. సినిమా పాటలు పాడడమంటే చాలా ఇష్టపడేది. ఆ రోజుల్లో గుంటూరులో వినోద్ ఆర్కెస్ట్రా వుండేది. ఆ ట్రూపులో వెళ్లి సినిమా పాటల కచేరీలు చేసేది వసంత. అలా చుట్టుపక్కల గాయనిగా మంచి పేరు తెచ్చుకుంది వసంత. లత, ఆశాభోంస్లే, లీల, పి.సుశీల గార్ల పాటలు స్టేజీమీద పాడేది. "సినిమా సంగీతానికి వాళ్లే నాకు పరోక్ష గురువులు" అంటుంది వసంత.

1957 లో వసంత తల్లి హఠాత్తుగా చనిపోవడంతో ఆమె కొంతకాలం గొంతుకు విశ్రాంతి నివ్వక తప్పలేదు. వసంత కుటుంబ పరిస్థితుల వల్ల ఆమె గాత్రం, కళాసాధన మరుగున పడకూడదన్న ఆమె తండ్రి ఉదారచింతనే ఆమెను మద్రాసుకు తీసుకు వచ్చింది. ఆమె తండ్రి గారికి, వసంతను సినిమాల్లో పాడించాలన్న వుద్దేశం కలిగింది. దానికి పింగళి నాగేంద్రరావుతో వున్న పరిచయం దోహదం చేసింది. పింగళి, పెండ్యాలకు వసంత కంఠాన్ని వినిపించడం. ఆయన అవకాశం వచ్చినపుడు తప్పకుండా పాడిస్తానని చెప్పడం చకచకా జరిగిపోయింది.



అప్పుడు వసంత గుంటూరులో బి.యస్సీ చదువుతోంది. పరీక్షలు దగ్గర పడుతుండగా ఒకరోజు వున్నట్టుండి ఆత్రేయ నుండి టెలిగ్రాం వచ్చింది - 'ఫలానరోజున కవిత చిత్ర వారి పాటల రికార్డింగ్ వుంది. వెంటనే బయలుదేరి రండి' అని. అలా మొదటిసారిగా వసంత ఆత్రేయ నిర్మించిన "వాగ్దానం"(1961) చిత్రంలో తొలిసారిగా పాడింది. వసంత పూర్తి పేరు బి. బాల వసంత! ఆమె మొదటి పాటకు బాలవసంత అనే టైటిల్సులో వుంటుంది తర్వాత వసంతగానే అందరికీ తెలిసొచ్చింది.

శ్రీ కృష్ణ జన్మదినం సందర్భంగా ఆరు నిమిషాల పాటు వచ్చే ఆ పాట "మా కిట్టయ్య పుట్టిన దినము" అనే పాట. ఆ పాటను పిఠాపురం నాగేశ్వరరావుతో కలసి పాడింది వసంత. ఆ చిత్రానికి సంగీత దర్శకుడు పి. సుశీల, ఎస్. జానకిలను పరిచయం చేసిన పెండ్యాల నాగేశ్వరరావే. ఆ మొదటి పాట అనుభవం వసంత మాటల్లోనే-

"1961 లో వాహిని స్టూడియోలో సౌండ్ ఇంజనీర్ కృష్ణయ్యర్ నా మొదటి పాటను రికార్డ్ చేశారు. ఆ పాట పల్లవి ఇది-

"మా కిట్టయ్య పుట్టిన దినం
కిలకిల అని నవ్వెను జగము
మా పల్లె బృందావనం
మా మనసే దేవాలయం" - ఈ ఒక్క పాట వుదయం నుండి సాయంత్రం దాకా పాడించారు. మొదటి సారి పాడుతున్నందుకు భయంగా ఏమీ అనిపించలేదు. చక్కగా పాడానని పిఠాపురం, పెండ్యాల గార్లు అభినందించారు. ఆ రోజుల్లో హీరోయిన్‌కు ప్లేబాక్ పాడాలంటే తొలుత గ్రూప్‌లోనూ, కామెడీ డాన్స్ సాంగ్స్... అలా అలా హీరోయిన్‌కు పాడే అవకాశం ఇచ్చేవారు. అప్పుడంతా బాగా పాడాలంటే సుశీల, పి.లీల గార్ల లాగా గొంతు వుండాలనేవారు. మంచి గాత్రానికి అదే కొలబద్ద!

"వాగ్దానం" లో తొలిపాట పాడిన నెలరోజుల్లోనే 'జగదేకవీరుని కథ' చిత్రాన్ని కన్నడంలో డబ్ చేసినప్పుడు అందులో పాడింది వసంత. మాధవపెద్ది సత్యం ఆ చిత్రంలో సహగాయకుడు. ఆ తర్వాత గుంటూరు వెళ్లిపోయింది వసంత. అప్పుడే బి.ఎస్సీ పూర్తి చేసేసింది.

తిరిగి ఎన్.ఎ.టి వారు "గులేబకావళి కథ" చిత్రం కోసం పిలిపించారు. అందులో 'ఉన్నది చెబుతా వింటారా' (ఎస్.జానకితో కలసి) అనే పాట పాడింది వసంత. మళ్ళీ కొద్దిరోజులుండి గుంటూరు వెళ్లాల్సి వచ్చింది. ఇలా వస్తూ పోతూ వుండడం ఇబ్బందిగా మారడంతో 1962 మే 26 న మొత్తం కుటుంబాన్నంతా గుంటూరు నుండి మద్రాసుకు తరలించేశారు వసంత తండ్రిగారు. అప్పుడింకా వసంత గాయనిగా పుంజుకోలేదు. ఆ సమయంలో ఒకరోజు పింగళి ఇంటికెళ్తే

అక్కడేవున్న బి.ఎన్.రెడ్డికి వసంతను పరిచయం చేశారాయన. 'ఈ అమ్మాయి బాగా పాడుతుంది. కావాలంటే పాడమనండి' అన్నారు పింగళి బి.ఎన్.రెడ్డితో! 'ఆర్టిస్టును ఎక్కడ పడితే అక్కడ పాడించను' అని చెప్పి, వసంత మ్యూజిక్ ప్రోగ్రామ్స్ ఎక్కడైనా వుందా అని అడిగి, ఫలానారోజు రేడియోలో వస్తుందని చెప్పడంతో, ఆయన గుర్తుగా విని "పూజా ఫలం"(1963) చిత్రంలో పాడించడానికి వసంతను పిలిపించారు. అందులో నాయిక రాజశ్రీ (అప్పటికి రాజశ్రీ హాస్యనటే) కి 'ఓ బస్తీ దొరగారు దిగి వస్తారా మీరు', 'వస్తావు పోతావు నా కోసం' అనే రెండు పాటల్ని పాడించారు. అలా 'మాట ఇచ్చి, పాడించిన వ్యక్తిని(బి.ఎన్.రెడ్డి) నా జీవితంలో ఆయనొక్కర్నే చూశాను' అంటుంది వసంత.

బి.ఎన్.రెడ్డి ది నిజంగా అమృత హస్తం. ఘంటసాలకు బి.ఎన్ "స్వర్గ సీమ"లో అవకాశం ఇచ్చారు. ఆయన దశ తిరిగింది. అలాగే 'పూజాఫలం'తో బి.వసంత దశ తిరిగింది. అనతికాలంలోనే అనేక చిత్రాల్లో అవకాశాలు లభించాయి. అప్పట్లో వసంత గొంతు పి.సుశీల గాత్రానికి చాలా దగ్గరగా వుండడంతో జంట నాయికలకు పాడించే పాటలన్నీ ఆ ఇద్దరి చేత పాడించేవారు. అలా ఎన్నో పాటలు ఇద్దరు కలిసి పాడినవి వున్నాయి. 'మానవజాతి మనుగడకే' (మాతృదేవత) 'పిల్లగాలి ఈలలా' (మరపురాని తల్లి) వంటి పాటలన్నీ వీరిద్దరి కాంబినేషన్‌లో వచ్చినవే.

వసంత ఒక్క పి. సుశీలతోనే గాక పరిశ్రమలో అప్పటి గాయనీ గాయకులందరితోనూ కలసి పాడింది. అన్ని రకాల పాటలూ పాడింది. అన్ని రసాల గీతాలు ఆలపించింది. 'నీకు నేనూ కావాలి' (పి.బి.శ్రీనివాస్‌తో, మనవడికోసం), 'కొత్తపెళ్లికూతురా రారా' (ఎల్.ఆర్.ఈశ్వరితో, సుమంగళి), 'చిలకలాంటి చిన్నదానా' (పిఠాపురంతో, అమాయకురాలు), 'నా హృదయపు కోవెలలో' (ఎస్.పి.బాలసుబ్రహ్మణ్యంతో, ఇద్దరు అమ్మాయిలు), 'చేసరూపమున'( ఏ.పి.కోమలతో, రంగులరాట్నం), 'పెళ్లిమాట వింటేనే' (ఘంటసాలతో కలసి, మాతృదేవత) ఇలా ఎందరితోనో గొంతు కలిపింది వసంత.

చిన్న పిల్లల పాటలు పాడటంలో స్పెషలిస్టు బి.వసంత. తమిళంలో ఎం.ఎస్.రాజేశ్వరిలా తెలుగులో పిల్లల పాటలతో మంచిపేరు తెచ్చుకుంది వసంత. 'బంగారు బండిలో వజ్రాల బొమ్మతో' (వసంతసేన) 'చక్కనయ్యా చందమామ' (భార్యబిడ్డలు) ఇందుకు ఉదాహరణలుగా చెప్పుకోవచ్చు. అలాగే "సిరివెన్నెల" చిత్రంలో హరిప్రసాద్ చౌరాసియా వంటి ప్రఖ్యాత వేణువాదన విద్వాంసునితో కలిసి పాడింది వసంత. ఇకపోతే వసంత రెండు చిత్రాలకు సంగీత దర్శకత్వం కూడా వహించింది. గబ్బిట వెంకటరావు కన్నడంలో నిర్మించిన "రాజనర్తకియ రహస్య", తెలుగులో "మంచికి స్థానం లేదు" అనే చిత్రాలు ఆమె సంగీత దర్శకత్వంలో వచ్చిన చిత్రాలు.

ఇంతవరకూ వసంత సుమారు మూడువేల పాటలు అన్ని భాషల్లోనూ (తెలుగు, అరవం, కన్నడం, మలయాళం, హిందీ) కలిపి పాడారు. తమిళంలో మొదటిసారిగా పాడిన చిత్రం - 'కొంజుమ్ కుమరి', హిందీలో "జై జవాన్ - జై కిసాన్".

'సూర్యుని చుట్టూ తిరుగుతుందీ భూగోళం (ఈడుజోడూ), 'ఏమయ్యా రామయ్యా' (బొబ్బిలియుద్ధం), 'నిజం చెప్పవే పిల్లా' (డాక్టరు



చక్రవర్తి), ఓ సుమబాలా ( శ్రీకాకుళ ఆంధ్ర మహావిష్ణువు కథ), 'ఏమన్నాడమ్మా' (దేవుడిచ్చిన భర్త), 'ఎక్కడ ఎక్కడ దాక్కున్నావో చెప్పుకో' (జీవనజ్యోతి), 'అందాల దాసులే' (సతీ సుమతి), 'ప్రేమ పక్షులం మనం' (ఆడపడుచు), 'శ్రీరమణా వెంకటరమణా' (దేవకన్య), 'లేత వయసు కులికిందిలే' (ఏకవీర), 'ఆడించు ఆడించు జోరుగా' (మావూరి కథ), 'పతియే ప్రత్యక్ష దైవమే' (ఆమెకథ), 'కలవాణి అలివేణి' (శభాష్ సూరి), 'నిత్య సుమంగళి నీవమ్మా' (ఇదాలోకం) 'నవ్వనా నా ప్రియ' (అంతా మన మంచికే) మొదలైన పాటలు వసంత పాడిన ఎన్నో పాటల్లోని కొన్ని పాటలు.

ఇక వసంత సినిమాకు గాకుండా ప్రయివేట్‌గా రేడియోలకు, ప్రైవేట్ ఆల్బమ్స్‌లోనూ ఎన్నో వున్నాయి. హెచ్.ఎం.వి. వారి కోసం క్రైస్తవ గీతాలు, జానపదగీతాల ప్రైవేట్ ఆల్బమ్స్ వెలువరించారామె. వాటిల్లో ఆమే స్వయంగా సంగీతం సమకూర్చినవీ వున్నాయి. మొదట్లో లలిత సంగీత కచేరీలు, తర్వాత సినిమా సంగీత కచేరీలు విరివిగా చేసేదామె. విడిగానూ, జంటగానూ, మాధవపెద్ది, పిఠాపురం, బాలసుబ్రహ్మణ్యం, బి.గోపాలం మున్నగు వారితో చేసిన కచేరీలు వేలాది వున్నాయి.

అమెరికా, కెనడా, బ్రిటన్ వంటి దేశాలు పలుమార్లు పర్యటించి సంగీత కచేరీల్లో పాల్గొన్న వసంత మద్రాసు తెలుగు అకాడమీ వారి ఉగాది పురస్కారంతో బాటు, 'ఉమ్మాచు' అనే మలయాళ చిత్రంలో పాటకు 1972లో ఢిల్లీ మలయాళీ అసోసియేషన్ నుండి ఉత్తమ గాయని అవార్డును పొందింది.

"నేనెప్పుడూ సినిమా రంగంలోకి వస్తానని, ఘంటసాల , లీల, సుశీల వంటి గొప్పవారిని చూస్తానని కూడా అనుకోలేదు. అలాంటిది వారితో కలిసి పాడడమనేది ఎవరెస్టు శిఖరాన్నెక్కినంత ఆనందాన్నిస్తుంది'' అని వినయంగా చెప్పుకునే వసంత వ్యక్తిగా ఎంతో సౌమ్యురాలు. ప్రస్తుతం సినిమా సంగీతం గురించి ప్రస్తావిస్తే ''ఇప్పుడు పాటల్ని (సాహిత్యాన్ని) సంగీతం డామినేట్ చేస్తోంది. ఇంకా చెప్పాలంటే వాటిని పాడనక్కరలేదనుకుంటాను. ఒక పల్లవి పాడితే పది బార్ల గ్యాప్! పాట ఫలానా వాళ్లే పాడాలని లేదు! ముందైతే టీమ్ సిస్టమ్ వుండేది. సంగీత సాహిత్యాలు తెలియాలంటే పాతపాటలే వినాలి- తమాషా ఏంటంటే కొత్త సింగర్స్‌కూడా ఏదైనా ఒక పాట పాడమ్మా అంటే పాత పాటలే పాడి విన్పిస్తున్నారు. దటీజ్ ఓల్డ్ మెలోడీ. ఆర్టిస్టు టాలెంటు తెలియాలంటే పాత పాటలూ పాడాల్సిందే!'' అని చెప్పారు. ఇక ఏం సాధించారంటే-

"నేను సినిమా రంగంలోకి వచ్చి గాయనిగా ఫలానా సాధించాను అని చెప్పుకోవాలంటే, ఎస్. రాజేశ్వరరావు, పెండ్యాల, మహదేవన్ దగ్గరి నుండి చక్రవర్తి వరకూ అందరి సంగీతంలో పాడడం, ఘంటసాల నుండి ఎస్.పి.బాలసుబ్రమణ్యం వరకూ అందరితోనూ యుగళగీతాలు పాడడం, అంటే ఒక స్వర్ణయుగంలో జీవించాను అనే ఆత్మతృప్తి, అన్ని వేల పాటలు పాడి ఆర్థిక తృప్తి రెండింటిని సాధించాను'' అని చెప్తుంది వసంత.

సినిమా రంగంలో ఎంత బిజీగా వున్నా కుటుంబాన్ని అశ్రద్ధ చేయలేదు వసంత. తన ఇద్దరు అమ్మాయిలను తన భర్త అండదండలతో మంచి విద్యావంతురాళ్లను చేసింది. వారిద్దరూ విదేశాల్లో స్థిరపడ్డారు. కూతుళ్లు, అల్లుళ్లు, మనవళ్లు ఇలా అందరితోనూ గృహాన్ని స్వర్గసీమగా మలుచుకున్న వసంత ప్రస్తుతం ఆరు నెలలు ఇండియాలోనూ, ఆరు నెలలు విదేశాల్లోనూ కాలం గడుపుతున్నారు.

**- కంపల్లె రవిచంద్రన్**

# వసంత సినీ గీతాలు



**చిత్రం: సిరివెన్నెల** **గానం: బాలు, పి.సుశీలతో త్రిగళం**
**సంగీతం: కె.వి.మహదేవన్** **రచన: సీతారామశాస్త్రి**

ఆ: చందమామ రావె జాబిల్లి రావె
కొండెక్కి రావె గోగుపులు తేవె
చలువ చందనములు పూయ చందమామ రావె
జాజిపూల తావినీయ జాబిల్లి రావె
అ: కలువ చెలువ కలలు విరియ కొండనెక్కి రావె
గగనపు విరితోటలోని గోగుపూలు తేవె ॥చందమామ॥
ఆ: నందనందనుని వంశీ నాదము విన్నావట
సుందర బృందావన నందనమును కన్నావట
రాసలీలనాటి ఊసు తెలియజేయ రావె
నాటి స్మృతుల వెన్నెలనిటు నేడు విరియనీవె॥చందమామ॥
ఆ: మునిజన మానస మోహిని యోగిని బృందావనం
మురళీ రవళికి ఆడిన నాగిని బృందావనం
అ: రాధా మాధవ గాధల రంజిలు బృందావనం
గోపాలుని మృదు పద మంజీరము బృందావనం
బృందావనం బృందావనం ॥చందమామ॥

**చిత్రం: శాంతినిలయం** **గానం: బాలు తో యుగళం**
**సంగీతం: ఎస్.పి.కోదండపాణి** **రచన: ఆత్రేయ**

అ: దేవీ క్షేమమా
ఆ: దేవరవారు క్షేమమా
అ: తమ కడగంటిచూపే కరువైనది
ఆ: తమ కరుణా కటాక్షమే అరుదైనది ॥దేవీ॥
అ నులిసిగ్గుల లేబుగ్గలు ఎలాగున్నవి
ఆ: నులివెచ్చని తొలిముద్దులు పంపమన్నవి
అ: అల్లరల్లరీ కళ్ళు చల్లగా వున్నవా ॥2॥
ఆ: తెల్లవార్లు నిదురరాక ఎర్రబారుతున్నవి ॥దేవీ॥
ఆ: జడలోన మల్లెపూలు యిమడకున్నవి
అ: జతలేక పట్టుపరుపు కుదరకున్నది
ఆ: తలగడతో చెప్పకునే కబురులే మిగిలినవి ॥2॥
అ: అవికూడ నలిగిపోయి జాలివేస్తున్నది ॥దేవీ॥
అ: నీ ఒడిలో చదవాలి కొత్త కొత్త చదువులు
ఆ: నేనపుడు అడగాలి చిలిపి చిలిపి ప్రశ్నలు
అ: పెదవులపై వ్రాయాలి నీవుమెచ్చు జవాబులు ॥2॥
ఆ: నీ మగసిరి గెలవాలి అసలైన పరీక్షలు ॥దేవీ॥

**చిత్రం: మాతృదేవత** **గానం: పి.సుశీలతో యుగళం**
**సంగీతం: కె.వి.మహదేవన్** **రచన: సి.నారాయణరెడ్డి**

మానవజాతి మనుగడకే ప్రాణం పోసింది మగువ
త్యాగంలో అనురాగంలో తరగని పెన్నిధి మగువ
ఒక అన్నకు ముద్దు చెల్లి ఒక ప్రియునికి వలపులమల్లి
ఒక రామయ్యకే కన్నతల్లి సకలావనికే కల్పవల్లి ॥మానవ॥
సీతగా - ధరణిజాతగా - సహన శీలం చాటినది
రాధగా - మధురబాధగా - ప్రణయగాథల మీటినది
మొల్లగా - కవితలల్లగా - తేనె జల్లు కురిసినది
లక్ష్మిగా - ఝాన్సీలక్ష్మిగా - సమర రంగాన దూకినది॥మానవ॥
తరుణి పెదవిపై చిరునగవొలికిన మెరయును ముత్యాలసరులు
కలకంఠి కంట కన్నీరొలికిన తొలగిపోవురా సిరులు
కన్నకడుపున చిచ్చురగిలెనా కరువులపాలౌను దేశం
తల్లిని మించిన దైవంలేదని తరతరాల సందేశం ॥మానవ॥

**చిత్రం: వసంతసేన** **రచన: దాశరథి**
**సంగీతం: యస్.రాజేశ్వరరావు**

బంగారు బండిలో వజ్రాల బొమ్మతో
భలే భలే రాజులా ధాటిగా స్వారిచేతును
నేను పయనమవుదును ॥బంగారు॥
అడవులైనను వరదలైనను ॥2॥
బండి దాటుతూ సూటిగా సాగిపోవును
చుక్కలను చంద్రుడినీ అందుకొనేను
గణ గణ గణ గంటలతో పరుగుతీయును ॥బంగారు॥
ఏనుగైనను సింహమైనను ॥2॥
బండి ఢీ కొని తీవిగ కదిలిపోవును
కొండలనే పిండి చేసి ముందుకేగును
గల గల గల గజ్జెలతో గంతులేయును ॥బంగారు॥

**చిత్రం: ఈడూ-జోడూ** **గానం: ఘంటసాలతో యుగళం**
**సంగీతం: పెండ్యాల** **రచన: ఆరుద్ర**

అ: సూర్యుని చుట్టూ తిరుగుతుంది భూగోళం
ఈ సుందరి చుట్టూ తిరుగుతుంది నా హృదయం
ఆ: ఏయ్...తనలో తానూ తిరుగుతుంది భూగోళం
నీ తలలో తిరుగును ఏదో తెలియని గందరగోళం
అ: యవ్వనమందున ఎవరైనా కమ్మని కలలే కంటారు ॥2॥
ఆ: కన్నకలలే ఫలించకుంటే కలవరపడతారు ॥సూర్యుని॥
అ: ఆలయమైనది నీ హృదయం అంకితమైనది నా రూపం ॥2॥
ఆ: ఆలయాన అడుగిడ నీకు హక్కులేదు పాపం ॥సూర్యుని॥
అ: కోరిన కోరిక తీరినచో తారున ప్రాణం పోయెను ॥2॥
ఆ: పెద్దవాళ్ళు ప్రాణం పోయని పిండి బొమ్మనేను ॥సూర్యుని॥

**చిత్రం: ఇదాలోకం** **గానం: ఘంటసాలతో యుగళం**
**సంగీతం: చక్రవర్తి** **రచన: ఆత్రేయ**

నిత్యసుమంగళి నీవమ్మా నీ పసుపు కుంకుమ
చెదరనిదమ్మా - ఇది- లోకులు ఎరుగని
నిజమమ్మా నీ ఇన్నేళ్ల కన్నీళ్లే బుజువమ్మా ॥నిత్య॥
అమ్మా! నాన్న వచ్చారు - నీకు పూలు గాజులు తెచ్చారు
మోడు చిగురులు వేసింది - పాదు పూదోట అయ్యింది
విధి - ఓడిపోయి జరుగని వింతే జరిగింది ॥నిత్య॥
మీ పెళ్లికి యిరవై ఏళ్ల వయసట
పండగ చేయాలనుకున్నాము
పీటలపైనా కూర్చోండి - మాలలు ఇద్దరు మార్చండి ॥నిత్య॥
ఎన్నాళ్లకమ్మా - ఎన్నేళ్లకమ్మా
కన్నుల కింతటి పండుగ
నిన్నూ నాన్నను చూశామొకటిగ
అనురాగం త్యాగం ఆలుమగలుగ ॥నిత్య॥





ఎస్.జానకితో...







రాజన్-నాగేంద్ర, ఎస్.పి.బాలుతో...

ప్రముఖ నేపథ్య గాయని బి.వసంత పుట్టినరోజు (మార్చి 28)
సందర్భంగా అభినందనలతో....

హాసం

RNI Regd. No.APTEL/2001/5503 HAASAM HAASYA SANGEETHA PATHRIKA Postal Regn. No. H-HD-997.

# Blueprinting the future from the past



The world around us is full of unseen biological wonders, many of them endowed by nature with miraculous cures for the ills of man.

But it takes a particularly discerning eye to see these hidden cures.

At Shanta, we take quiet pride in the fact that our scientists possess this type of penetrative vision.

One example of their path-breaking research is Shanvac-B, India's first indigenous family vaccine against Hepatitis-B. Another is betacarotene, an antioxidant manufactured from algae found in the high seas. A third is Shanferon, an indigenous anti-cancer drug...

Working 24 hours a day, 365 days a year, Shantha's scientists are ceaselessly pushing back the frontiers of the unknown. To bequeath mankind with a healthier future - through the miracles of Biotechnology.

**SHANTHA BIOTECHNICS PVT. LTD.**

3rd Floor, Serene Chambers, Road No 7, Banjara Hills, Hyderabad, India.

Tel : +91-40-3548507, 3608843 Fax : +91-40-3548476 E-mail : info@shanthabiotech.com

www.shanthabiotech.com